

"వహ్ కౌన థీ" లో అందాల నటి సాధన.

STUDIO
Roopkala

REVATHI



రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్

# లక్షాధికారి

నిర్మాతలు
డి.వి.రెడ్డి... తమ్మారెడ్డికృష్ణమూర్తి

దర్శకత్వం... వి.మధుసూదనరావు




# శ్రేష్ఠతలో విశిష్టమైన కాఫీ




# ఆంధ్రా కాఫీ యిండస్ట్రీ

H.O. గుంటూరు-2.

ఏజంట్లు : సి హెచ్. టి. శర్మ & కం., కంటోన్ మెంటు రోడు, మచిలీపట్నం.

## పిక్ నిక్ పాకెట్ రేడియో

జపాన్ పాకెట్ రేడియో సృష్టి సిగరెట్ కేస్ కంటే చిన్నది. తేలికైనది. స్థానికంగా ప్రపంచంలో ప్రతి స్టేషను వినవచ్చును. ఇతర రేడియోలకంటే తక్కువ ఖర్చు. సులభముగా ఉంచుకొనుటకు అనువైనది. అందమైనది. లైసెన్సుతోపాటు 3 సం॥లు గ్యారంటీ.

నెం LR 88 ధర రు. 35. డీలక్సు రకం నెం. GM 99 ధర రు. 45-50. వి.పి.పి.చార్జీలు రు. 4 అదనం రేడియోకు తోలుకేసు 5—50

INDOJAP ARTS (AP 35)
P. O. Box 1248 - DELHI-6.

# కుటికురా

## అయింట్ మెంట్

చర్మరక్షణకు శతాబ్దానికి పైగా పేరుమోసింది.




మాట పది సంవత్సరాలు ! ఇంత కాలంగా ప్రపంచమంతటా కుటికురా అయింట్ మెంట్ ఉపయోగంలో ఉందన్న మాట !

కుటికురా అయింట్ మెంట్ మచ్చలు తెచ్చే క్రిములను నాశనంచేస్తుంది. మూరేడు కాయలూ, మొటిమలూ మొదలైన వాటిని రూపుమాపి అవి మళ్లీ ఎంతో కాలం వరకు వచ్చే అవకాశం లేకుండా చేస్తుంది. దీనిలోగల క్రిమిసంహార మూలాలు, ఒరపును, చమట పొక్కులను, పురుగుల కాట్లనూ నయంచేస్తాయి; కోతలూ, కాల్పులను, గజ్జిని మాన్పుతాయి.

**కుటికురా అయింట్ మెంట్**

కుటికురా టాల్కుం పౌడరు డబ్బా కొనండి — కుటుంబానికి అంతటికీ ఉపయోగపడే బహూళ వినోపయోగ టాల్కుం పౌడరు



NATIONAL CO INDIA

# ఉత్తరాలు

## ముఖచిత్రం

అయ్యో బాబోయ్ ! మళ్లీ అట్టమీద అందమైన పోజు ! మీరిలాంటి ముఖచిత్రాలే వేస్తూ ఉండండి, అడ్డమైన "అప్పారావు"లు "మాష్టారూ, ఒక్కసారి చూడ నివ్వండ"ని పత్రిక తీసుకొని అదే పనిగా చూసేస్తూ ఉంటారు ! ఇదేం బావులా......

భానూ చంద్ర (ఉప్పాడ)

## సందేహం

ఈ సంవత్సరము 'దసరా', 'దీపావళి', పండుగలు 28—9—63, 17—10—63, అని కొన్ని పంచాంగములు ప్రచురించినవి.

మరికొన్ని పంచాంగములు, అక్టోబరు, నవంబరులలో 'దసరా', 'దీపావళి' పండుగలు ప్రచురించినారు. ఆంధ్రుల అభిమాన 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' ప్రత్యేక సంచిక వెలువడు తేది సరియయిన దినముగ నిర్ణయించుకొందుము. మీరు పై పండుగల తేదీలు మాకు తెల్పెదరని ఆశించుచున్నాము.

బి. యమ్. యస్. నారాయణరావు,
ఓ. యస్ రామారావు, బి. పి. రావు (గుంటూరు)

**25-10-'63 దసరా సంచిక తేదీ,**
**15-11-'63 దీపావళీ సంచిక తేదీ.**

## "విమర్శకాదు : విజ్ఞప్తి"

6—9—63 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "చిరాకు పుట్టించే మాటలు" శీర్షికతో మీరు ప్రచురించిన "మీ స్వంత గొడవ—స్వవిషయం" క్రింద పేరాలో 'రచనమీద ఆసక్తి' ఉన్న పాఠకులకు మీరు చేసిన విజ్ఞప్తి చదివిన తరువాత నాకు కలిగిన మనోవేదన ఇది. ఈ వారపత్రికలో అలెగ్జాండర్ డ్యూమా, మార్క్ ట్వైన్‌ల వంటి అన్యభాషా దురంధరుల రచనలు విశ్వసనీయంగా అనువదించబడ్డాయి. అనేకమైన సాహితీపరమైన స్వంత రచనలు చెయ్యబడ్డాయి ? ఇప్పుడూ అలాటివి కొన్ని వస్తున్నాయి. "ప్రేమకు పగ్గాలు" "కొలంబో", "వెండిమబ్బు", "విడీ విడని చిక్కులు" వంటి స్వంత రచనలు, అనువాదాలు నిజంగా మనోరంజక మైనవి. విజ్ఞానాత్మక మైనవి. వాటి రచయితలకు, మీకూ ధన్యవాదాలు. కానీ ఈమధ్య కొన్ని శీర్షికలకు వాటికి తగని విలువ నిస్తున్నట్లనిపిస్తుంది. బహుశా ఇది ప్రజాభిరుచికి అనుగుణంగా పోయే వ్యాపార లక్షణమేమో. కాని, ఈ వ్యాపార లక్షణం పత్రిక ఆశయాలకే విభిన్నమైనంత తీవ్రమైనది అయితే అది సంతోషించదగ్గది కాదు.

పత్రికలో వ్రాసే కొన్ని ఉత్తరాలు, మీ మనలో మాట— వీటిలో వ్యంగ్యం కలవర పరిచేటంతగా ఉంటోంది. ఆ వ్యంగ్యం చూస్తే మాకు చిరాకు పుట్టించే మాటలకంటే పీహ్యం కలుగుతోంది. ఒక్కోసారి. తెలుగు భాష కుంటుపడిందా ? లేక అది నవీన పంథానా ? బ్రాకెట్‌లో ఏదో వ్రాసి స్పష్టీకరించవలసిన గతి పట్టిందా తెలుగు భాషకి అనిపిస్తుంది. కేవలం కొందరు పాఠకులతో సరిపోతే ఒకవిధంగా ఉండేది. మీరు కూడా ఇలాటి పంథానే అనుసరించడంలో గల న్యాయం దురూహ్యం. ఒకవేళ ఏదైనా ప్రత్యేక భావం ఉంటే తెలియపరచిన నావంటి మధ్యతరగతి పాఠకుడు లాభించగలడు. మీరు సినిమా విషయాలకై ఇస్తున్న ప్రాముఖ్యత అనవసరమేమో అనిపిస్తుంది. సినిమా విషయాలకై అనేకమైన పుస్తకాలు, పత్రికలూ వెలువడుతున్నాయి. అవి చాలవా ? పోనీ మీరు అన్ని విషయాలకూ చోటు ఇవ్వదలుచుకుంటే సినిమా విషయాలకై తగుమాత్రం కేటాయిస్తే బాగుంటుంది. వీరాజీగారు రచించిన తెరమీద—తెర వెనుక వలన కానీ, రంగారావుగారు రచిస్తున్న సరాగమాల వలన గానీ కలిగే ప్రయోజనం ఏమిటో చిరాకు పడకుండా ఆత్మవిమర్శ చేసుకోవలసి ఉంది. ఇది వీరాజీగారిమీద విమర్శకాదు. రంగారావుగారి సంగీత పరిజ్ఞానాన్ని కించపరచడమూ కాదు. నాకు సినిమాతార లంటే అయిష్టం కాదు. నిజంగా వీరాజీగారు చాలా బాగా వ్రాశారు ఆ శీర్షికకు తగినట్లు. రంగారావుగారు సినిమా సంగీతంలో అందెవేసిన చెయ్యి అని ఆయన రచనలు చెప్పక చెప్తున్నవి. శ్రీమతి సావిత్రి, శ్రీ రంగారావు మొదలైన సినిమావారు అనన్యమైన సేవ చేశారు. అలాగని నాలుగు ఐదు పేజీలు కేటాయించడం, ఫలానావారు పాడిన ఫలానా రికార్డు నెంబరు కొనుక్కుంటే ఎలాటి సంగీతం వినవచ్చునో అదే అత్యంత ప్రాముఖ్యమైన విషయమన్నట్లుగా మీ పత్రికాముఖంగా చూడడం చాలా విచారం కలిగిస్తుంది.

ఆంధ్ర సంస్కృతి పట్ల మనకు బాధ్యత లేదా ? ఇదివరకు ఉన్న చిన్న పిల్లల విభాగం ఇప్పుడు ఏదీ ? వార పత్రికలు చదివేవారిలో అధికసంఖ్యాకుల్లో "ఇంప్రెషనబుల్ ఏజ్ గ్రూప్" వారే ఎక్కువ మంది ఉంటారు కదా ? మరి వారికి పైన చెప్పిన మనసుకి బద్ధకం వేర్పే శీర్షికలే ప్రచురించి దుస్సేవ చేయడం లేదా ? కన్యాశుల్కంలో నాయకుడు ఎవరు అంటే 'రామారావు' అని ఠక్కున చెప్పే పిల్లలదా ? తప్పు వారు గిరీశం పేరు విని ఉండకపోతే ? ఇది భరించలేని క్షోభ. ఇలా ఉండగా మీరు యిచ్చిన లిస్టులో ఉన్న ఇంగ్లీషుమాటలు ఉపయోగించడం ఏమంత ప్రమాదకర విషయము ? చిరాకు పుట్టడం ఎందువలన ? భాషామతల్లికి అపచారం జరుగుతోందనా ? సందర్భశుద్ధిగా వాడితే ఆ ఇంగ్లీషు పదాలు ఏమంత ప్రమాదకరమైనవి కావేమో. భాష అభివృద్ధి చెందుతుంది. పైపెచ్చు! ఏమైనా పై ప్రమాదంతో పోల్చి చూస్తే ఇది ఆందోళనకాని, చిరాకుగాని చెందవలసినదికాదు. కేరళ, మద్రాసు రాష్ట్రాలలో ఉన్నంత సాహితీ విలువల ఔన్నత్యం మనలో మరుగుపోతోందని మీవంటి ప్రాజ్ఞులకు నేను చెప్ప నవసరంలేదు. ఇది విమర్శ కాదు. ఆత్మ విమర్శ, క్షోభ. మీలో ఒకడినై ఈ విజ్ఞప్తి చేస్తున్నాను.

నరసింహారావు (మంగుళూరు) ★

ఆంధ్రసచిత్రవార

# పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 4—10—63
శోభకృన్నామ సం॥ ఆశ్వయుజ బహుళ పాడ్యమి
సంపుటము 56 సంచిక : 5
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా . రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వార (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1





నటుడు జగ్గయ్య.
ప్రత్యేక చిత్రం (ఫొటో: ప్రభాకర్)

## మనలోమాట

'నా అనుభవంలో కెల్లా పెద్ద పరిశోధన' వ్యాసాలు ఈ సంచికతో అయిపోయాయి. ప్రపంచంలో వివిధ ప్రాంతాల అపరాధ పరిశోధనా పద్ధతులు వివిధంగా జరుగుతాయో ఈ శీర్షికవల్ల కొంత వరకు తెలుసుకోవచ్చు. భారత దేశానికి సంబంధించిన యథార్థ అపరాధ పరిశోధకగాథ ఒకటి ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ఇంతకుముందే వేశాము. ('యు' రచించినది.) వీలయితే, త్వరలో మన దేశానికీ, ప్రాంతానికీ, సంబంధించిన మరికొన్ని యథార్థగాథలు ప్రచురిస్తాము.

* * *

'పిచ్చిదానా ఎక్కడికీ పరుగు?' వ్రాసిన శ్రీమతి కె రామలక్ష్మి ప్రఖ్యాత రచయిత శ్రీ ఆరుద్ర సతీమణి. 'జీవిత-సంగీత' మొదలయిన కథలు రచించిన 'రామలక్ష్మి' వేరే వ్యక్తి.

* * *

తమవద్ద ఫలానా రచనలు ఉన్నాయని ప్రచురించేట్లయితే పంపుతామని కొందరు వ్రాస్తారు. వ్రాతప్రతి పరిశీలించనిదే ప్రచురణకి అంగీకరించటం సాధ్యం కాదు!

మరొక విషయం రచయితలు తమ వ్రాతప్రతులు పూర్తిగా, ఒకే సారి పంపాలి. వాయిదా పద్ధతి అవలంబించరాదు!!

## లోకంపోకడ



ఎందుకేనా మంచిది. దగ్గిరగా వెళ్ళకు! అతగాడు కామరాజ్ పథకం మూలాన మంత్రిపదవి కోల్పోయాడు! కసిగా వున్నాడు పాపం!

## విషయానుక్రమణిక

**కథలు :**



**సీరియల్ కథలు :**



**శీర్షికలు, వ్యాసాలు, సినిమా :**


పులికి కోరలు పీకేద్దామని ప్రయత్నం
బంగారు నియంత్రణ
దీన్ని పెంచాడు
కాని కాలం పండింది
ప్రపంచం
కాస్త గాలి తీద్దామని...
కామరాజ్ పథకం
OOMMEN

శ్రీకృష్ణ

# వద్దన్నా వదలని ముఖ్యమంత్రులు
# దండుగగా మారుతున్న దండకారణ్య ప్రాజక్టు

"రాజకీయ కార్యకలాపాల్లోని వ్యక్తులు నిరంతరం అగాధం, అనంతమైన సముద్రయానం చేస్తూ ఉంటారు. ఈ యానాని కొక నిలకడగాని, ఈ పాంధుల కొక గమ్యంగానిలేదు. ఎప్పుడూ సమస్థాయిలో తేలుతూ పయనిస్తూ ఉంటమే లక్ష్యం" ఈ మాటలు ఇటీవల వచ్చిన రాజకీయ సిద్ధాంతాల్లో అతి నవీన సిద్ధాంత ప్రతిపాదకుడు మైఖేల్ ఓకే షాట్ అనే ఒక ఆక్స్ఫర్డ్ పండితుడివి. ఈ మాటలు మన భారతదేశంలోని కాంగ్రెస్ నాయకులకు కూడా వర్తిస్తాయి. వీళ్ళ పని కూడా వూరికే తేలుతూ పోతూ ఉండటమే. వెనకటి కాలంలో నాయకులను నిర్ణయించేటప్పుడు వారు భారత స్వాతంత్ర్య సముపార్జనకు ఎంత కృషి చేశారనే దానిమీదనే ఆధారపడేవారు. ఇప్పటి కాంగ్రెస్‌లో ఏకైక ప్రతినిధి శ్రీ నెహ్రూను మినహాయిస్తే, ఇంక ఎవరెవరు ఎన్ని మంచి పనులు చేశారనే లెక్క వేయటం కష్టమే అవుతుంది.

ఇటీవల దక్షిణాదినుంచి వచ్చిన ఒక వ్యక్తి, శ్రీ కామరాజనాడార్ ఓనాడు తెల్లారేసరికల్లా అఖిల భారత ఖ్యాతిని, ప్రపంచ ప్రశంసలు అందుకున్నాడు. శ్రీ నాడార్ తను చదువుకునేందుకు ఏ ఈటన్‌కో, కేంబ్రిడ్జికో పోలేదు. ఈ అఖిల భారత నాయకత్వంకోసం ఆరాటపడనూలేదు. పైగా ఈ పదవిని ఉత్తరాదివాళ్లే ఆయనమీద వేశారు. అసలు శ్రీ కామరాజు పథకం ఏమిటి ? దేశాన్ని పార్టీ ముందర, పార్టీని కాంగ్రెస్‌లోని సభ్యుని (మంత్రి హోదాలో) ముందరా ఉంచి పరిశీలన జరపటం ఉద్దేశ్యంగా ఈ పథకం రూపొందించటం జరిగింది. దీన్ని పురస్కరించుకుని శ్రీ కామరాజు మంత్రి పదవి నుంచి తప్పుకున్నందువల్ల పార్టీకి, దేశానికి ఎక్కువ సేవ చేసే వీలుంటుందనే నమ్మకంతో పదవి వదులుకుంటున్నట్లు ప్రకటించారు. తరువాత ఏం జరిగిందో అందరికీ తెలిసిందే. ఈ పథకంలో ఇంకో చిన్న విభాగం ఏమిటంటే కాంగ్రెస్ మంత్రులలో ఏయే వ్యక్తులు పార్టీ పనికి పనికి వస్తారో ఎంచుకునే అధికారం ప్రధానమంత్రికి దత్తం చేయటం. ఇది అవకాశంగా తీసుకుని ప్రధానమంత్రి ధైర్యంగా తన మంత్రివర్గంలోని ఆరుగుర్ని నెట్టివేయటమేగాక, ఒరిస్సా, బీహార్, ఉత్తరప్రదేశ్, కాశ్మీర్, మధ్యప్రదేశ్, మద్రాసు రాష్ట్రాల ముఖ్యమంత్రుల రాజీనామాలు ఆమోదించవలసిందిగా కాంగ్రెస్ కార్య నిర్వాహక మండలికి 'సిఫార్సు' చేశారు. ప్రధానమంత్రి చేసిన పెద్ద తప్పేమిటయ్యాంటే పదవీ త్యాగుల రెండో 'చిత్తు' త్వరలో ప్రకటిస్తామని చెప్పటం. ఇంక పంజాబ్ ముఖ్యమంత్రి సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్‌ను సంరక్షించేందుకు పూనుకోవటం ప్రధాని చేసిన రెండో తప్పిదం.

1947 నుంచి అధికారాన్ని అనుభవిస్తున్న వాళ్ళను చూస్తూ, బాధపడే వారికి శ్రీ నెహ్రూ నిర్ణయం దివ్యౌషధం మాదిరి పని చేసింది. ఈ విషయాన్ని నిరూపించటానికి డా. జీవరాజ్ మెహతా వృత్తాంతం చాలు. స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే ఆయన కేంద్ర ఆరోగ్య శాఖ కార్యదర్శిగా నియుక్తులయ్యారు. అప్పట్నుంచి ఆయన శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ ఆరోగ్యశాఖ మంత్రిణి అయ్యేదాకా ఆ పదవిలోనే ఉన్నారు. ఆయన అవిభక్త బొంబాయి రాష్ట్ర మంత్రివర్గంలో చేరటం ఆ తరువాత గుజరాత్‌కు ముఖ్యమంత్రి కావటం దరిమిలా జరిగిన విశేషాలు. ఈయనతో పోల్చి చూస్తే బల్వంతరాయి మెహతా చేసిన పనులు పెద్దగా లెక్కలోకి రావు. ఆయన డా. జీవరాజ్ బయటికి నెట్టేందుకు కామరాజు ప్రతిపాదనను ఆయుధంగా వినియోగించుకున్నాడు. ఇలాంటి సంఘటనలే చాలా రాష్ట్రాల్లో జరిగాయి మరి!

కామరాజు ప్రతిపాదన, మన రాజ్యాంగానికి హాని కలిగిస్తున్నదని ప్రధానమంత్రి ఇంకా గ్రహించినట్లు లేదు. రాజ్యాంగం ప్రకారం మంత్రి మండలి కది శాసన సభలకు లోబడి ఉండాలేగాని, సభలకు బైట ఉండే కాంగ్రెస్‌వంటి పక్షాల చెప్పుచేతల్లో ఉండకూడదు. ఏ ముఖ్యమంత్రి, మంత్రుల రాజీనామాలు ఆమోదించే అధికారం కాంగ్రెస్‌కుగాని, పండిత నెహ్రూకుగాని లేనేలేదు. అదీ కాక, తన నాయకుణ్ణి ఎన్నుకోవాల్సిందికాని, క్రిందికి దించాల్సిందికానీ పార్లమెంటరీ పక్షమే. ఉత్తరప్రదేశ్, పంజాబ్‌ల తీరు చూస్తే భారత రాజ్యాంగ చరిత్ర ఎలా ఉందో అర్థమవుతుంది. శ్రీ సి. బి. గుప్తా న్యూఢిల్లీలో జోక్యం కల్పించుకున్నందువల్ల ఉత్తరప్రదేశ్‌లోని కాస్త బలమైన మంత్రివర్గమూ పడిపోయింది. ఇంకోచోట ఓ ముఖ్యమంత్రికి హైకోర్టు అభిశంసిస్తున్నట్లుగా విమర్శించినా మన ప్రధాన మంత్రే ఆయన్ను పని గట్టుకుని సంరక్షిస్తున్నారు. ఇలా వుంది తీరు!

*　　*　　*

కమ్యూనిస్టులు న్యూఢిల్లీలో అతి భారీ ప్రదర్శనాన్ని ఒకటి జరిపారు. ఒక విధంగా బలధన ప్రదర్శనలకు విజయమనే చెప్పవచ్చు. ఈ ప్రదర్శన జరిపేందుకు కమ్యూనిస్టులకు కనీసం కొన్ని లక్షల రూపాయలైనా అయి ఉంటుంది. దీనివల్ల భారత్‌పై వ్యతిరేక ప్రచారాన్ని కొనసాగించేందుకు కావల్సినంత సమాచారాన్ని భారత దేశంలోనే సంపాదించుకునేందుకు చైనీయులకు అవకాశం కల్గింది. ఈ ప్రదర్శనాన్ని ఫోటోలే కాకుండా సినిమా కూడా తీశారు. భారత దేశంలో కమ్యూనిస్టుల బలం, ప్రధానమంత్రికి వ్యతిరేకత ఎంతగా ఉందో నిరూపించేందుకు ఈ చిత్రాలను ఆసియా, ఆఫ్రికాలలో ప్రదర్శించటం జరుగుతుంది. కనుక కమ్యూనిస్టుల పద్ధతేమిటో స్పష్టమవుతూనే ఉంది. కమ్యూనిస్టు చైనా విషయంలో వాళ్ళనుసరించిన తప్పటడుగు ద్వారా పలుకుబడి కోల్పోయిన కమ్యూనిస్టులు తిరిగి తమ వెనుకటి ప్రాభవాన్ని సంపాదించుకుని, అధికారంలోకి రావాలని ప్రయత్నిస్తున్నారు.

**ఇందులో వాళ్ళననాల్సిన పనేం లేదు. తప్పంతా రష్యాదే. రష్యా అనుసరించే విధాన మేమిటో కాస్త ముందుగా తెలిసి ఉంటే చైనాపట్ల వీళ్ల 'విధానం' ఇంకో**



ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి
ఐన శ్రీమతి కృపలానీ.

**రకంగా వుండేది. భారత్ చైనా వివాదంలో రష్యా చైనాను సమర్థిస్తుందో తటస్థంగా వుండిపోతుందో పాపం వీళ్ళకు తెలియనే తెలియ లేదాయే!**

వాళ్ళ ఉద్దేశ్యాలు చాలా స్పష్టంగానే ఉన్నాయి. కాంగ్రెస్‌ను పడగొట్టటం, ప్రధాన మంత్రిని మాత్రం, కాంగ్రెస్ ఇంటా బయటా వున్న అభివృద్ధి నిరోధక శక్తులనుంచి రక్షించటం వాళ్ళ ధ్యేయం. అన్నిటికన్నా విచారించదగ్గ విషయం

50 వ పేజీ చూడండి

# సరాగమాల

## వి ఎ కె రంగారావు

క్రిందటి కృష్ణజయంతినాడు రాజమహల్లో శ్రీకృష్ణుని జన్మదిన సందర్భాన ఆనందోత్సవాలు జరిగినవి. ఆనాటి ఆటా, పాటా చూసి, విని రసిక హృదయాలు పొంగినవి. ఆనంద డోలికల్లో వూగినవి. మధుర రస మార్గాలలో సాగినవి. దీనికి కారణం ఆనాటి నృత్య, గీత, హరికథా ప్రదర్శనల పరిమళమే అంటే అది చెప్పరాని అతిశయోక్తి అవుతుంది. ఆనాటి ఆనందానికి ఒకే ఒక కారణం ఆ నృత్య కథమాలలో అంతర్లీనమై ప్రవహించిన కృష్ణభావంలోని మాధుర్యం. ఆ ప్రదర్శనలో సౌందర్యం అంతగా కనవడటానికి హేతువు అతిలోక సుందరుడైన ఆనంద బాలుడు ఆనాటి కథానాయకుడు కావటమే. ఈ సంతోష చంద్రికకు మరొక వన్నె హెచ్చించినది ఆనాడే మా కందిన ఆశీస్సు.

శ్రీ రంగారావుగారికి
ఆహ్వానము అందుకున్నాను
ఆనందకృష్ణుని లలిత కళామయ
ఆశీస్సులు—వాని గొలిచే వారికి
ఎన్నటికీ పరిపూర్ణ ఫలదాయినులే!
మీ ఇలువాసికి పండుగగా
మిమ్మేడబాయని వేడుకగా
ఆనంద మోహనుడు, మీ కనుల
కాపురమై —నూరేళ్లపాటు
మీ సేవల దనిసి
మిమ్మను గ్రహించేను.

ఇటువంటి ఆశీస్సు ఎవరిదౌతుంది? మువ్వ గోపాలుని కాలి మువ్వగా మధురూహలు కురిపించిన మల్లాదిదవుతుంది. రాధా మాధవుల ప్రణయం రాకొందు వదనగా అనుభవించిన రామకృష్ణశాస్త్రి దవుతుంది. మాధవుని స్మరణా, శరణూ పారమార్థికంగా ఎంతటివో మల్లాదివారి భావనా, దీవెనా భౌతికంగా అంతటివే. ఆ భాగ్యం స్వంతమయినందుకు గర్వం. ఆ ఆనందానికి నోచుకున్నందుకు సంతోషం. ఇంతటి అనుభవం ఈ ప్రపంచంలోనే ఉన్నదని తెలియ యెన్నుకొనబడినందుకు వినయం. ఆనాటి వైభవం.

ఇక నాటి కార్యక్రమం సంగతి. శ్రీ కృష్ణ జననం మొదలుకొని, ద్వారకానాథుడైన సత్యారుక్మిణీ సమేతంగా తన జన్మ దినోత్సవ సందర్భాన వెళ్ళినంతవరకు ఉన్న కథాంశాలు కొన్ని నృత్య, గీత, హరికథ మూలంగా ప్రదర్శింపబడ్డాయి. నృత్యం చేసినది కుమారి రత్నప్రభ, శ్రీ కృష్ణప్రియ. వీరి నాట్యంలో ప్రావీణ్యతకన్న పరవశమే ఎక్కువ కనబడింది. హరికథ చక్కని శాస్త్రీయ రాగాలలో చెప్పి రక్తి కట్టించినది చిరంజీవి. నేపధ్యం, అప్పారావు కబీర్‌షా బృందం. ఈ కథామాలికలోవున్న ఇరవైఆరు పాటలలో చాలమట్టుకు ఆరుద్ర, కొసరాజు, సి. నారాయణరెడ్డి, ఆత్రేయ, రాజశ్రీ, సముద్రాల, సినిమాలకోసం కృష్ణపరంగా వ్రాసిన పాటలే. అయిదారు కొత్త పాటలు ఆనంద కుమార్‌వి. వీటిలో

"ఆనాటి ఆరాధనే ఈనాటి ఆనందమూ
అలనాటి ఆవేదనే ఇలనేలు ఈ భాగ్యమూ"

అన్నది చాల హాయిగా ఉన్నది. సంభాషణలు, హాస్యం వ్రాసింది. కల్పించింది. జొన్నాడ భట్టర్ జగన్నాథాచారి. ఉన్నకొద్ది పాటలు రసవత్తరంగా ఉన్నవి.

మద్రాసునుంచి శ్రీ ఆరుద్ర, శ్రీమతి రామలక్ష్మీ ఆరుద్ర శుభాకాంక్షలు పంపేరు. ఆరేయి



"నాగదేవత"లో అంజలీ దేవి.

ఆనందం సుమారు యాభై మంది ఆహూతులు పంచుకున్నారు.

*   *   *

పది రోజుల క్రిందట ఆంధ్ర జంతు వైద్య కళాశాల వసతి గృహ లలిత కళా సమాఖ్యకు తిరుపతిలో చెర్వు ఆంజనేయశాస్త్రిగారు ఆరంభోత్సవం చేశారు. యువ నటుడైన హరనాథ్ పై శాస్త్రిగారు హాస్య ధోరణిలో ప్రసంగిస్తూ, కళల ఆవశ్యకతను ఉగ్గడించారు. సంగీత దర్శకులు టి. వి. రాజా. లలిత కళలలో సంగీతానికున్న ప్రాముఖ్యతను వివరిస్తూ ఉపన్యసించారు.

ఈ సభ ముగిసిన తరువాత, విందారగించిన తిరువాత వారి ముగ్గురితో కలిసి రాత్రికి రాత్రి, పదకొండు గంటలకు బయలుదేరి మద్రాసుకు వచ్చాను. దారిలో ఆ నాలుగు గంటలు ఎంత సరదాగా గడిచినవో చెప్పలేను. ఆంజనేయశాస్త్రి ప్రముఖ సినీ తారలపై శృంగార చాటువులు చదివారు. హరనాథ్ ఇటువంటి పూర్వాశ్రమ కథలు కొన్ని చెప్పుతూ, తల్లీ బిడ్డలులోని రెండు పాటలు పాడారు. కాని ఆ రాత్రి కారులో జరిగిన తతంగమంతటికీ నాకు నచ్చింది టి. వి. రాజా పాడిన పాత హిందీ సినిమా పాటలు. సాధారణంగా రాజాగారు గాయకులకు పాట చెప్పే సమయంలోనే పాడరు. అసిస్టెంటుని వినిపించమనో, తాము హార్మోనియం వాయించో చెప్పుతారు. కాని ఆ అర్ధరాత్రి సమయం పున్నమి చంద్రుని పరిపూర్ణ ప్రకాశం వారికి మత్తెక్కించినది కాబోలు, పాతికేళ్లనాటి హిందీ పాటలు జోరుగా పాడేశారు. ఒకటా, రెండా దేవికారాణి పాడిన "మై బన్ కీ చిడియా బన్‌కర్ సంగ్ సంగ్ డోలూరే", లీలా చిట్నీస్ వూగిన 'హిండోలే కైసే ఝూటా" స్నేహప్రభ వినిపించిన "నాచే నాచే మేర్ మన్‌కే మోర్", ఖుర్షీద్ ప్రాణం పోసిన "బరసోర్" ఇంకా ఎన్నో ఇన్నేళ్ల తరువాత వారికిన్ని పాటలు గుర్తున్నాయంటే ఆ క్షణానికి ఆశ్చర్యపోయాను. నిజానికి అందులో ఆశ్చర్యపడటానికి కారణమేలేదు. రత్నశాస్త్రం తెలిసినవారు ఒకసారి చూసిన మణిని పాతికేళ్ళ తరువాతయినా పోల్చగలరట. వీరి సంగతి కూడా అంతే అయివుంటుంది.

ఇంటికి చేరి సంఘటనలన్నీ హాయిగా నెమరు వేసుకుంటూ, నిద్రకు సిద్ధమయేసరికి తెల్లవారు జామున నాలుగయింది.

*   *   *

"పూలు విరిసెను తేనె కురిసెను
వలపు వాకిట పూల పుల్లకి నిలిచెను.
లోకమే పులకించి నాట్యము చేసెను
అందగాడా
మనసులోని మర్మమేదో తెలుసుకో
తెలుసుకొని నన్ను నీలో దాచుకో"

ఆ దాశరధి రచన ఎంత అందంగా ఉన్నదో గమనించారా? అందంలో ఆ పాటలోనే పోటీ పడేవి సుశీల కంఠం వంపులు, చలపతిరావు వరస సొంపులు,

63 వ పేజీ చూడండి

ఆ డం బ రా ల ను వి డ నా డం డి
దే శ సం ప ద ను వృ ధా కా నీ య కం డి

# బస్సులపై రద్దీ తగ్గుదలకై సచివాలయ కార్యక్రమం 11 గంటలకు ప్రారంభం?

కరువులో అధికమాసం అంటం పరిపాటే ! కాని దానివలన వచ్చిన అదనపు ఈతి బాధలేమిటో తెలీదు ! అధిక మాసంలోనూ అవే జీతాలు పుచ్చుకుంటారు. ఇళ్ల యజమానులకు అవే అద్దెలు చెల్లించుకుంటారు. తిండి ఖర్చులు అదనంగా తగిలేవేమీ ఉండవు పేర్లు మార్చినంత మాత్రాన తారుమారయ్యేదేమీ లేదు. అయితే ఈ సంవత్సరంలో వచ్చిన అధిక ఆశ్వయుజ మాసాన్ని అందరూ అభినందించాల్సిందే ! సరదాగా వస్తున్న దసరాను ఆహ్వానించటంలో అందరూ చిరునవ్వు మొహాలు పెట్టినా, పండగ ఖర్చులు భరించట మెట్లాగా అనే సమస్య, అందర్నీ కూడా యేదో విధంగా కలవర పెడుతూ ఉంటుంది. దినదినాభివృద్ధి చెందుతున్న ధరలు, రాబడికి అందకుండా పారిపోయే ఖర్చులు, ఉన్నదాంట్లోనే మిగుల్చుకోమని ప్రభుత్వంవారు తెస్తున్న వత్తిళ్ళ ఆకాశాన్నంటే అద్దెలు, అంతస్థుకు మించిన పన్నులు, ఒకటేమిటి, ఇలాంటివెన్నో, సామాన్య భారత పౌరుణ్ణి అనుదినం వెక్కిరిస్తూ ఉంటాయి. ఈ అవమానాల భారంతో కృంగి కృశిస్తున్న వాళ్లకు, పండగలొస్తున్నాయంటే ఏమంత ఉత్సాహం ! దేన్ని చూసి సంతోషం ! సాంప్రదాయాల మధ్యన నలిబలవుతూ, పాతకట్టుబాట్లలో సతమత మవుతూ నిత్యనరకం అనుభవిస్తున్న మధ్య తరగతి కుటుంబాలలో చాలా మందికి పండగలొస్తున్నాయంటే, గుండె అదురు, భయం, ఎట్లా తట్టుకో గలమా అనే అధైర్యం. ఈ మధ్య హైదరాబాదులో జరిగిన పండిత మహాసభలో అధిక ఆశ్వయుజం దృష్ట్యా, దసరా పండగలు జరుపుకోవటానికి, సెప్టెంబరు మాసానికి అధికారం లేదన్నారు. దానితో పెద్ద పండగలు రెండూనూ ఓ నెలముందుకు తోసుకు పోయినాయి. అక్టోబరు 27వ విజయదశమనీ, నవంబర్ 15వ నాడు దీపావళి అని, నిర్ణయించారు. అమ్మయ్య బ్రతికిపోయినామని ఓ పెద్ద నిట్టూర్పు విడిచారు, పై నెలలో చూసుకోవచ్చులే అన్నట్టు!

## 'బిజినెస్ క్లినిక్'

మానవ రోగాన్ని కుదర్చటానికి ఆసుపత్రులు వెలిసినాయి. తర్ఫీదుపొందిన డాక్టర్లూ ఉన్నారు. అయితే ఈ రోగాలు, అంటే లోపాలు అన్నింట్లోనూ ఉన్నాయి. ఈ లోపాలకు కారణమేమిటో సమగ్రంగా తెలుసుకుని, వాటిని సరిదిద్దుకుంటే 'శరీరాలు' బాగుపడ్డట్టే, సంస్థలు కూడా అభివృద్ధి చెందటానికి అవకాశముంటుంది చిన్న తరహా పరిశ్రమలు, ఇతర వ్యాపార సంస్థలు యెన్నో ఉత్సాహంతో ప్రారంభింపబడుతున్నాయి. ప్రారంభంలో ఉన్న ఆవేశం, పట్టుదల రానురాను సన్నగిల్లిపోవటం, ఎక్కువ కాలం కాకుమున్నే ఆ సంస్థలు అదృశ్య మవటం సర్వసాధారణంగా జరుగుతూనే ఉంది. ఒక పరిశ్రమ అభివృద్ధి చెందాలంటే ఎన్నో సమస్యలను ఎదుర్కొనాలసి వస్తుంది. డబ్బు పెట్టుబడి, ఉత్పత్తి సాధనలో మెళుకువలు, తయారయిన వస్తువులను సరియైన పద్ధతిలో పంపిణీ చెయ్యటం కార్మిక సమస్యలు, ఇంకా యెన్నోయెన్నో ఉన్నాయి. పరిశ్రమలను ప్రారంభించాలని ఉబలాట పడే వాళ్లలో, ఈ విషయాలన్నీ క్షుణ్ణంగా తెలిసిన వారు చాలా అరుదుగానే ఉంటారు. ఏదో ఓ భాగంలో కాస్తంత తెలియంగానే, ఒకటి ప్రారంభించటం, విజయవంతం కాలేదని, నిరుత్సాహ పడటం. ఎక్కడుంది లోపం అని తెలుసుకోవటానికి అవకాశం లేకుండానే అధ్యాయం ముగిస్తూ ఉంటుంది. ఈ సాధక బాధకాలను గుర్తించి, చిన్న తరహా పరిశ్రమలకు ఇతర వర్తక వ్యాపార సంస్థలకు ఉచితంగానూ, నిర్మొహమాటంగానూ సలహాలు ఇచ్చేటందుకుగాను, హైదరాబాదు పట్నంలో 'బిజినెస్ క్లినిక్' ఒకటి ప్రారంభించారు. దీనితాలూకు కమిటీలోని నిపుణులైన వ్యక్తులు పనిచెయ్యటానికి ముందుకు వచ్చారు. జెమ్‌షెడ్ దిన్‌షా ఇటాలియాగారు, ముందుకు వచ్చి, దాని ఆధ్వర్యం వహించారు. ఆయన కూడా ప్రముఖ వ్యాపారే! జంటనగరాల్లో ఉన్న సంస్థలు ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని బాగుపడితే ఈ పద్ధతిని, ఇతర చోట్ల కూడా చెయ్యమని కోరటానికి తగినంత ప్రోత్సాహం లభిస్తుంది.

## నూరుపాళ్లు ప్రజాస్వామ్యం

ఈ మధ్యకాలంలో, ప్రభుత్వంవారు ప్రజాభిప్రాయానికి తల ఒగ్గినట్టుగా ఎక్కడా నిదర్శనలు లేవు. ప్రజలగోడు ప్రజలదే. ప్రభుత్వంవారి ధోరణి ప్రభుత్వంవారిదే ? కాని విశాల హైదరాబాదులో బస్సురేట్లు పెంచుతామని ప్రకటన చేసేటప్పటికి, ప్రజాభిప్రాయం వ్యతిరేకంగా ఉవ్వెత్తున లేచింది అన్ని వర్గాలవారు అన్ని పార్టీలవారు, తీవ్రమైన ఆక్షేపణ తెలియజేశారు. ఈ వ్యతిరేకతను, ప్రభుత్వంవారు గమనించి, రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్‌వారు తలపెట్టిన రేట్లు పెంపుదలను, విరమింపజేశారు. దీనికి ప్రత్యేకంగా ప్రభుత్వంవారిని నిజానికి అభినందించవలసిన పనేమీలేదు. వారి విధి వారు నిర్వర్తించారు. అంతే ! కాని విధినిర్వహణే చాలాచోట్ల జరగటంలేదు కాబట్టి, ప్రజాభిప్రాయాన్ని ఈ విషయంలో మన్నించినందుకు, ప్రభుత్వంవారు అభినందనీయులే ! కార్పొరేషన్ వారికి అదనంగా ఓ కోటి రూపాయలు నష్టం వస్తోంది. దీనికి కారణం, కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాల పన్నుల విధింపు. దీనిని భర్తీ చెయ్యటానికి, రేట్లు పెంచటానికి ఉద్యుక్తులయ్యారు. పైగా వీరు ప్రభుత్వంవారికి 21 లక్షల రూపాయలదాకా వడ్డీ ఇవ్వాలసి వస్తోంది. తీసుకున్న అప్పు 5 కోట్లను మరి ! ఈ క్లిష్ట పరిస్థితుల్లో, ఈ వడ్డీ విషయమై వత్తిడి తీసుకురామని కూడా ప్రభుత్వంవారు హామీ ఇచ్చారు. తర్వాత కొన్ని సూచనలు కూడా చేశారు. బస్సులు పెంచమని, బస్సుల్లో సీట్లుకూడా అధికం చెయ్య

49 వ పేజీ చూడండి

**వీరాజీ**

## జరిగిన కథ

సురేఖను భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయం చేస్తుంది, పద్మావతి. భాస్కరం సవతి తల్లి జానికమ్మగారు అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది. భాస్కరానికీ, కూతురు వసంతకూ ఒకేసారి వివాహం చేయాలని ఆమె ఆరాట పడుతుంది. తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్లిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది పెళ్లి కూతురు సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది. సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పట్టుదల పెరుగుతుంది. భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది, ధనమ్మకు దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్టు కూడా అప్పుడే ఏర్పాట్లు జరుగుతుంది. తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది. చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం, ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో గూడా అనుకోని సురేఖకు తను భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు. చివరకి భాస్కరం తన పెళ్లి ఏడాది వాయిదా వేస్తాడు. ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు. సురేఖ, పద్మ యిద్దరూ ఎం ఏ లో చేర్తారు భాస్కరం కూడా ఫైనలియర్ పూర్తి చేయటానికి వస్తాడు. సురేఖ అంతా చెప్పిఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు. ఎగ్జిబిషన్‌లో కూడా పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు. భాస్కరం భాస్కరం స్నేహితుడు మూర్తి శైలజను ప్రేమిస్తాడు శైలజ కూడా పద్మవతికు సురేఖకు స్నేహితురాలు. జానకమ్మగారు వసంత పెళ్లి యత్నంలో మునిగి వుంటుంది. పిక్‌నిక్‌కు వెళ్తారంతా. అక్కడ పద్మావతి అలిగింది. సురేఖ అనునయించ వచ్చింది.

## 39

సాయంకాలం సంధ్య కాంతులు కరిగి మెల్లి మెల్లిగా చీకట్లు వాలుతున్నాయి. స్నేహితురాండ్రిద్దరు ఒకరి నిశ్శబ్దాన్ని ఇంకొకరు భంగం చేయటం ఇష్టం లేనట్లు తాపీగా నడుస్తూ "పామ్ బీచ్"కి చేరుకున్నారు.

సందడిలేదు. సదుపాయంలేదు. సంద్రం హెూరున గోలచేస్తున్నది అక్కడా అక్కడా కొందరు "దొరలు దొరసానులు!"

కొంచెం మంది యూనివర్సిటీ క్వార్టర్స్ లోని కుటుంబాలు తప్ప నగరంలోని బీచ్‌కీ దీనికీ చాలా తేడా ఉన్నది.

"ఇవాళ క్లాసులన్నీ జరిగాయా ?" ఇద్దరూ కాస్త రోడ్డూ సందడి అగుపించే చోట కూచున్నాకా అడిగింది పద్మావతి

"నువ్వు మధ్యాహ్నం రాకపోవడం బాగులేదు పోనీ అంత అత్యవసరమూ తప్పనిసరీ అవితే "

సురేఖ మాటలను మధ్యలోనే అందుకొని "అసలు ఇప్పుడీ వూరు ఎందుకొచ్చావా ? అని ఏడుస్తున్నాను" అన్నది పద్మావతి అక్కసుగా.

"నీకు నిజంగా 'ఎమ్మే' అవ్వాలని లేదా ?"

"మా అమ్మకి నేను బియ్యేడీ అవ్వాలనీ ఉంది. అది నీకు తెలుసు." పద్మావతి సురేఖను తలఎత్తి చూసి మళ్లీ మొహం అటు తిప్పుకుంది.

"ఎమ్మే చదివినా నీకు వెంటనే ఏ అమ్మాయిల కాలేజీలోనైనా కళ్లకద్దుకొని ఉద్యోగం ఇస్తారుగా !" సురేఖకు ఏం మాట్లాడాలో తెలియడంలేదు

"ఏమో మరి నాకు మాత్రం బుద్ధమతంలో చేరాలనుంది." అంది పద్మావతి

"ఎందుకని ?"

"మనశ్శాంతి కోసరం."

"అది బుద్ధుడికి చిక్కిందా ? పిచ్చిదానిలా ఉన్నావు ? బుద్ధ భగవానుడు ఏ మూడు రకాల శోకాలను చూసి అడవుల్లోకి పారిపోయి తపస్సు చేశాడో ఆ మూడు శోకాలూ ఇప్పుడూ ఉన్నాయ్ అప్పుడూ ఉన్నాయ్ ! అతను మరణిస్తే అతన్ని నాలుగువందలమార్లు కాబోలు పుట్టించారు అతని శిష్యకోటి...."

"నీకు బుద్ధుడంటే అంత కోపమెందుకూ ?" పద్మావతికి మరో విధంగా సురేఖ మీద కోపం ప్రదర్శించగల అవకాశం దొరికింది.

"నాకా ? బుద్ధుడి మీద ఇంత పిసరు కోపంలేదు కాని ... బుద్ధ భగవానుడు నీ మనశ్శాంతికి ఎలా ఉపకరిస్తాడో నన్నదే నా జిజ్ఞాస" నవ్వింది సురేఖ ఇసుకలో ప్రేళ్లతో బుద్ధుడు... అని ప్రేలితో రాస్తూ....

"మరేం చేసేది ? నువ్వు అదృష్టవంతురాలివి గనుక బుద్ధుడు.. వెంగళప్ప అంటావు ?" అన్నది పద్మావతి

"అదిపోనీగాని— నువ్వు మీ అమ్మగారి కోసరమేనా చదువుకొని తీరాలిగా— అమ్మకన్నా బుద్ధుడు గొప్పవాడా ?" సురేఖ అడిగింది పద్మావతి పొడిగా నవ్వింది. "థాంక్స్" అన్నది.

"చూడు పద్మావతీ, నీకు ఒక అమ్మే కాని నాకు మా దొడ్డమ్మ ఒక అమ్మా ప్లస్ కనుక్కున్న అమ్మా నాన్నా ఈజీక్వల్టు మొత్తం ముగ్గురున్నారు" సురేఖ సరదా తెచ్చుకుని చెప్పింది "వీళ్లల్లో ఏ ఒక్కరి మాట కాదన్నా పెంచి ఇంత పెద్దదాన్ని చేస్తే ఇవాళ విశ్వాస ఘాతకి నయ్యానంటారు తెల్సునా ? నన్నేమతంలో చేరమంటావు?"

"పోని వాళ్ల ఇష్టప్రకారమే నడుచుకోరాదూ ?"

"అబ్బ ! ఎంత సింపుల్‌గా టూకీగా ఉంది నీ ప్రశ్న ! కానీ ఆ ప్రశ్న నువ్వే నీకు వేసుకుంటే ఎంత క్లిష్టంగా ఉంటుందో ఆలోచించు !"

"నన్నేం చెయ్యమంటావు ? నువ్వు నాకు స్నేహితురాలివిగాకపోయినా బాగుణ్ను" మొహం అటు తిప్పేసుకుంది పద్మావతి.

"ఏంలేదు – నీకు నేస్తాన్ని అయ్యాను గనుక ఆ అపరాధానికి మింజామతే ఒక కోర్కె ఈ చదువును నిర్వాచీగా, బేఫికర్‌గా చదువుమంటాను" సురేఖ స్నేహితురాలి దగ్గరగా జరిగి బుగ్గమీద చిటికె వేసింది

ఒళ్లు మండిపోయింది పద్మావతికి

"ఇంతకీ భాస్కరంగారు ఏమంటాడు ?" అన్నది గభిక్కున ఏదో స్ఫురించినట్లు—

"వాళ్ల చెల్లెలు పెళ్లికి రమ్మంటాడు" సురేఖ నవ్వింది.

"వెళ్తా"

"నన్ను కాదోయ్ ! నిన్నూ"

"నేనెందుకుటా ?"

"సరే ! నన్నడిగితే ?"

సురేఖకి కూడా మనసు నొప్పెట్టింది.

"ఈ వాదనతో ఎందుకు టైము వృథా చేస్తావు ? ఇద్దరం వెళ్దాం మా దొడ్డమ్మ గారిదే మగ పెళ్లివారి పెద్దరికం— గనుక నేను "మగపెళ్లి దాన్ని"— నువ్వు ఆడపెళ్లివారి తరఫునరా !" అంటూ లేచింది.

"అంత అవకాశమా ? భాస్కరం గారికి చిన్నతనం కాదూ, నేను అలా వస్తే ?"

"చూడు పద్మా ! ఆ ప్రశ్న ఆ పెద్దమనిషినే అడుగు నేను మీకు స్నేహితురాలిని— అంతేగాని మధ్యవర్తినీ రాయబారినీ కాదు."

ఒక్క విసురున అటు తిరిగి నడక సాగించింది సురేఖ.

పద్మావతి నిశ్చేష్టురాలై నిలిచి పోయింది !

నాలుగు అడుగులు వేసిన సురేఖ వెనుదిరిగి కోపం దిగమింగి, చల్లబడి— తిరిగి వచ్చింది "రా !" అంది.

"ఉహూఁ ! యూ కెన్ గో...." అన్నది పద్మావతి

"నాన్‌సెన్స్ ! ఐఫీల్ లైక్ కిల్లింగ్ యూ చంపేద్దామనుంది నిన్ను— డూ కమ్ !"—

అనురాగంవల్ల స్నేహానుబంధంవల్లా కలిగిన ఆగ్రహావేశాల్తో రెండు కెరటాల్లా ఢీ కొన్నారా ఇద్దరూ.

రెక్క పుచ్చుకుని లాక్కెళ్తున్న సురేఖను వెనక్కు లాగి "ఉండూ ! చెయ్యి విరిగిపోగలదూ ! నేను రాగలనులే" అన్నది పద్మావతి.

ఇద్దరూ అక్కడే కూలపడ్డారు సురేఖ పద్మావతి ఒళ్లో తలదూర్చి

"సారీ !" అన్నది.

పద్మావతి చలించి పోయింది సురేఖ తన కంటె చిన్నదై చంటిపిల్ల ఐనట్లు అనిపించింది.

"పాపం ! రాణీగారికి అంతలోనే కోపం అంతలోనే దుఃఖం—ఛీ ఛీ! నా ఒళ్లో నీకు చోటు లేదు" అన్నది ఆప్యాయంగా సురేఖ తల నిమిరి ! కదల్లేదు సురేఖ.

సముద్రం కెరటాలు మరింత మరింత హోరుచేస్తూ ఒక్కో అడుగూ ముందుకూ వస్తూంటే, గంభీరతా చీకటి ఒక్కోక్షణానికి రెండింతలు పెరుగుతున్నాయి.

"అమ్మయ్యో !"

చుట్టూ దూరదూరానగల మనుషులు కూడా మాయమై పోయారు !

వడివడిగా లేచి బయలుదేరారు !

"అమ్మ నిన్ను భోజనానికి రమ్మంది" ఇల్లు దగ్గరకు రాగానే పద్మావతి అన్నది.

"అమ్మో ! మరోనాడే ! ఇవాళకాదు ! ప్లీజ్ ప్లీజ్ ...." సురేఖ గునిసింది.

"కాదు ఇవాళే!" అని మళ్లీ కోపంగా "పోనీ ! నీ ఇష్టం మా అమ్మకి నేను నువ్వు రానన్నావని చెప్పేస్తా ! సరేనా ? ఎందుకంటే పేదవాళ్లం అందుకనీ అంటాను"— అన్నది పద్మావతి వేలు చూపి హెచ్చరించింది కూడా !

"ఓ. కే. పద ! నీ చీవాట్లు మీ ఇంటి భోజనం రెండూ రాశాడు నీ బుద్ధ భగవానుడుటా మొహాన" — సురేఖ ఒప్పుకుంది—

* * *

సురేఖను క్రిష్ణనగర్ వెళ్లే ఆఖరి బస్సు ఎక్కించిన తరువాత పద్మావతి ఇంటికి వచ్చి పడుకున్నదే గాని నిద్రరాలేదు.

"సురేఖ సుఖపడితే మాత్రం నాకు సంతోషం కాదూ ? పోనీ భాస్కరం గారిని అది పెళ్లి చేసుకుంటే ?...."

"మరి నీగతో ? నీసంగతో ?" ఎవరో గుండెల్లో నించి కేకలు.

"నా సంగతా ? బడి పంతులమ్మ నవుతా !" నంది ఎవరికో సమాధానం ఇస్తున్నటు.

"కానికాని.... భాస్కరం నన్ను ఇంత ఇంత అన్యాయం అన్యాయం చేస్తాడనుకోలేదు" అని బాధపడ్డది.

ఐతే భాస్కరం సురేఖా ప్రేమించుకున్నటు నిర్ధారణ ఏదీ?

"సురేఖ అందరితోనూ నిష్కల్మషంగా, నిర్మోహమాటంగా మాట్లాడుతుంది. దానికి భయంలేదు— భాస్కరం గారితోనూ అంతే నేమో...."

"అంతే.... అంతే...." అనుకుంటూ కలత నిద్ర పోయింది పద్మావతి.

## 40

పెళ్లి సందడి అంత ఇదిగానూ ఉంది. పెళ్లికి ఆశ్చర్యకరమే అయినా ధనమ్మగారే తనలోగిరి

47 వ పేజీ చూడండి



# గర్ల్స్ హైస్కూళ్లు

పవని నిర్మల ప్రభావతి

చాలాకాలం తర్వాత ఆమధ్య ఒకసారి పిన్నిని కలుసుకోవడం సంభవించింది.

"పిన్నీ అంతా కులాసా ?" అన్నాను.

"ఏం కులాసా అమ్మాయ్ ! ఈ ఆడపిల్లల చదువులతో చావొచ్చిందే !" అంది పిన్ని నిస్పృహనంతా మాటల్లో ధ్వనింపజేస్తూ.

"అదేమిటి పిన్నీ చక్కగా గరల్స్ హైస్కూళ్లు ఉంటే...." అన్నానో లేదో పిన్ని తారాజువ్వలా లేచింది.

"ఏం గరల్స్ హైస్కూళ్లో .... ప్రాణాలు పిండేస్తున్నారంటే నమ్మ."

పిన్ని ఒక్క అరగంటలో చెప్పిన సంగతులన్నీ విని సానుభూతి చూపించాను. అప్పట్లో అదొక పెద్ద సమస్యనిపించలేదు కూడా ! కానీ ఈ మధ్య చాలా మంది ఆడపిల్లల తల్లిదండ్రులు ఈ 'గరల్స్ హైస్కూళ్ల' సమస్యతో సతమత మవటం కళ్లారా చూచాను.

అసలేమిటి సమస్య? అంటారు కదూ?

"ఆడపిల్ల" అనగానే అన్నీ సమస్యలేమో అనిపిస్తుంటుం దొక్కొక్కసారి. చాలాచోట్ల ఆడపిల్లల హైస్కూళ్లు పెట్టారు. కొన్ని ప్రదేశాలలో ఆడపిల్లల స్కూలు ఉంటే, ఇక మగపిల్లల స్కూలులో వారికి ప్రవేశ ముండదు. "కో—ఎడ్యుకేషన్" ఉండనే ఉందన్నమాట. ఇక తప్పనిసరిగా తమ ఆడపిల్లలను, గర్ల్స్ హైస్కూల్లో చేర్చాలి. పూర్వకాలపు జానపద గాథల్లో, వ్యుత్యు మందిరాల్లోకి దూరిన రాజకుమారులు, సునాయాసంగా బయటపడతారు గానీ, ఆడపిల్లల స్కూల్లో తమ పిల్లలని చేర్చిన తల్లిదండ్రులిక కోలుకోలేరు. బాగా ధనవంతుల సంగతి వదిలెయ్యండి. వారిది వడ్డించిన విస్తరి. విలాసంగా చదివినా, చదువుకోసం చదివినా, ఎంత, ఖర్చయినా తట్టుకోగలరు. వచ్చిన చిక్కల్లా మధ్యతరగతి, అంతకంటే హీనంగా బ్రతికేవారికే.

పిన్ని కుటుంబం చూడండి. ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు. ఫస్టు ఫారమ్, థర్డ్ ఫారమ్, స్కూలుఫైనల్ చదువుతున్నారు ఆడపిల్లలు గరల్స్ హైస్కూల్లో. మగపిల్లలిద్దరి కాలేజి చదువులనూ మించిందీ ముగ్గురు ఆడపిల్లల చదువు ఖర్చు !

ఎందుకని ? అని ప్రశ్నిస్తారు. చెబుతా వినండి.

ఆడపిల్లల హైస్కూల్లో, టీచర్లు లేక మేడమ్స్ ఆడవారు. ఈ టీచర్లు లేక మేడమ్స్ చేతుల్లో పిల్లల భవిష్యత్తూ, పెద్దల ప్రాణమూ, ఉండిపోతాయి.

ఫస్టు ఫారమ్ చదివే పాప దగ్గర్నుంచి స్కూల్ ఫైనల్ చదివే అమ్మాయి వరకూ, ప్రతి సబ్జక్టుకూ (గమనించ ప్రార్థన : అది ఎంత చిన్న సబ్జక్టయినా ఎంత తక్కువ వర్కు ఉన్నా), నాలుగు స్క్వేర్స్ బౌండు నోటు బుక్కులు వాడాలి. దాంతో మొదటి సమస్య ప్రారంభమవుతుంది. సైన్సు, సోషల్, ఇంగ్లీషు (ప్రోజు, పొయిట్రీ, గ్రామరు, కాంపొజిషన్) తెలుగు (2 పార్టులు విడివిడిగా గద్య, పద్యాలకు కాంపొజిషన్), లెక్కలు (హోంవర్కు, క్లాస్‌వర్కు,) ఇంపోజిషన్‌లూ, ఫేర్ కాపీలు, మరికొన్ని ఎక్స్ట్రాలూ ! పై చెప్పిన వాటికి బౌండు నోట్సులు కొనేసరికి, ఆ బాధ, అనుభవించే వాళ్లకు వినా మరొకరికి అర్థంగాదు. ఇవి ఒక్క టెరమ్‌కే సుమండీ ! మళ్లీ మిగతా రెండు టెరమ్‌లకూ మళ్లీ మొదలు.... !

బౌండునోట్సులు కొనే శక్తిలేనివారు— తెల్ల కాగితాలతో పుస్తకాలు (ఆ సబ్జక్టునూ, నోటు వర్కునీ బట్టి) కుట్టుకునివస్తే, అవి క్లాసు బైటకి గిరవాటు వేస్తారు "మేడమ్స్" హుందాగా! క్లాసులోంచి ఆ పుస్తకాల తాలూకు అమ్మాయిని బైటికి పంపిస్తారు ఒక్కోసారి. ఇదంతా 'నీట్' నెస్‌కు మొదటిమెట్టుట.

ఇక రెండోది కుట్టుపని క్లాసు. ఇది వారానికోమారయినా ఉంటుంది.

స్కూల్ ఫైనల్ పాసయ్యేలోపల ఆడ పిల్లలకు స్కూల్లో నేర్పించే కుట్టు, అల్లికలూ, టైలరింగ్ వగైరాలు ఏ మాత్రం వస్తాయో ఆ భగవంతుడికే తెలియాలి. కొందరికి స్వతహాగా ఆ కళ అబ్బుతుంది. అది వేరే సంగతి. కుట్టుపని క్లాసుకు డిజైన్ వెయ్యటానికి క్లాసులో పిల్లలందర్నీ 1 గజానికి తక్కువ లేకుండా, మంచి రకం బట్ట (సామాన్యంగా లాంగ్‌క్లాత్) తెచ్చుకోవాలని ఆజ్ఞ జారీ చేస్తుంది కుట్టు టీచరు. నేర్చుకోటానికి ఏ ఒట్టయితేనేమని కాస్త ఖరీదు తక్కువలో బట్ట తీసుకుంటారు పిల్లలు (లేక పిల్లల పెద్దలు). దాంతో అగ్గి బుగ్గయి "ఈ మాత్రం బట్ట కొనలేని వాళ్లకు చదువెందుకు ?" వగైరా పెద్దమాటలు ప్రయోగించి, తక్షణ కర్తవ్యం బోధిస్తుంది మేడమ్. "క్లాసంతకూ ఒకేరకం బట్టనే తెచ్చిస్తాను. తలకొక 2 రూపాయలు ఒచ్చే క్లాసుకు తెచ్చి నా చేతికివ్వండి." అని అలా ఇవ్వని వారికి మిగతా సబ్జక్టులలో మార్కులు తగ్గిస్తామని కత్తి మెడమీదుంచుతుంది. మాటిమాటికీ ఇంట్లో డబ్బు లడుగుతున్నారని పెద్దవాళ్ల పొలికేకలు పెట్టేంతర్వాత, ఎలాగో ఓలా, ఆ పిల్లలు ఆ డబ్బు టీచరుకు సమర్పించుకుంటారు. మూడో కుట్టు క్లాసుకు తలొక మువ్వావు గజం మల్లు బట్ట చేతుల్లోకి వస్తుంది. "అదేమని" అడిగే పాపాత్ములుండరాదు ! బట్టఇచ్చి "చూడండమ్మా మీకు నచ్చిన డిజైన్ ఇంట్లో వేసుక, నచ్చిన రంగు దారాలతో కుట్టుకురాండి. మీరు కుట్టుకున్నా, మీ పెద్దవాళ్లచేత కుట్టించుక వచ్చినా ఫర్వాలేదు." అని తరుణోపాయం బోధిస్తుందావిడ. పిల్లలదేం పోయె ? ఎలాగో ఓలా బట్టమీద డిజైన్ కుట్టో, కుట్టించుకునో, నాలుగోవారం టీచరుకు ఇస్తారు బట్ట. "ఇవన్నీ స్కూల్ "మెరిట్" కోసం ఇన్‌స్పెక్షన్ సమయంలో చూపాలి" అని దాచేస్తారు.

మళ్లీ మరో కుట్టుక్లాసుకు టెయిలరింగ్. మరో రెండురూపాయలు. బట్ట చేతిలో నుంచి లాక్కుని, కాగితంమీద కత్తిరింపులు చూపి, "ఇక ఈ కత్తిరింపులు చాలు. ఇప్పటికే మీకు బోలెడంత టెయిలరింగ్ వచ్చేసిం"దని భుజం తడుతారు.

ఇక ప్రయివేటు, అదే ట్యూషను.

అందరూ సరస్వతీదేవి వరప్రసాదాలుగా జన్మించరు. ఒక్కొక్కరికి కొన్ని సబ్జక్టుస్ బొత్తిగా అంతుబట్టవు. అలాటివారికి ట్యూషను వినా గత్యంతరంలేదు. వాళ్ల స్థాయినీ, లేక పిలుపు బట్టి ట్యూటర్‌ను ఏర్పాటు చేసుకుంటారు. ఇదీ తప్పే కొందరు మేడమ్స్ దృష్టిలో. "చెట్టంత మనిషిని నేనుండగా మరో టీచర్ని కుదుర్చుకున్నావెందుకమ్మా ట్యూషన్‌కు ? అన్ని సబ్జక్టుస్ నేను చెప్పలేననా, లేక నేను బి. ఇడి పాస్ కాలేదనా నీ ఉద్దేశ్యం ?" అంటూ నిలవేస్తారు కాస్త చాటుగా.

డ్రెస్ : ఈ డ్రెస్ విషయంలో ఒక్కొక్క గరల్స్‌హైస్కూల్సు ఒక్కొ అభిప్రాయం, ఒక్కో మేడమ్‌కూ, హెడ్ మిస్ట్రెస్‌కూ ఉంటుంది కాబోలు ! కొన్ని స్కూళ్లల్లో మితిమీరిన అలంకరణకు తావు లేకుండా చెయ్యటానికో, లేక క్రమశిక్షణ, సర్వ సమానత్వం వగైరాల కొరకో ఒక "స్కూల్ డ్రెస్" అంటూ ఏర్పరుస్తారు. ఇది సాధారణంగా హెడ్ మిస్ట్రెస్ అభిప్రాయాన్ని బట్టి ఉంటుంది. ఆ మధ్య గరల్స్ హైస్కూల్లో ఇల్లాగే డ్రెస్ ఏర్పాటు చేశారు. ఇంకేం పిల్లలందరూ, చిన్నాపెద్దా, తెలుపు నీలం రంగురలలో అందంగా కన్పించారు. అదేం ఖర్మో ఓ నెల తిరిగేసరికి, ఆ డ్రెస్ బాగలేదనీ, మరోరకం డ్రెస్ అయితే బావుంటుందనీ తీర్మానం వచ్చింది! ఇంకేముంది ? మళ్లీ మరోరకం డ్రెస్‌లు పిల్ల

లకి తలకో నాలుగు జతలు కుట్టించేసరికి ఆ వెల, ఆ బట్టలు చూచుకుంటూ ఉపవాసాలు చెయ్యాల్సిందే. పాతడ్రెస్ ఏం చెయ్యాలి ? ఎక్కడికైనా వేసుకెళ్తే, హేళన చేస్తారని భయం. అస్తమానూ ఇంట్లోనే అవి తొడుక్కోమంటే పిల్లలకు విరాకు. పోనీ పారెయ్యొచ్చనుకుంటే వాటికి పెట్టిన డబ్బు ఎక్కడా త్రవ్వకు రాలేదుగదా ? మరి ఈ బాధలా హెడ్ మిస్ట్రెస్‌కుగానీ, ఆమె అభిప్రాయాలను బలపరిచే "మేడమ్స్"కు గానీ తెలుస్తాయా ? ఊహూ బొత్తిగా తెలీవు.

ఇది ఇలా ఉంటే ఈ స్కూల్ డ్రెస్ లంటూ లేని స్కూళ్లల్లో మరీ ఘోరం. కాస్త పాతవి (అంటే మరీ చింకిపాతలు, మాసినవి కాదు సుమండీ) వేసుకుని వెళ్తే, ఆ పిల్లల్ని నిండు క్లాసులో టీచర్లు (పొరబాటు మేడమ్స్) అవహేళన చేసి నానా చిత్రహింసా పెడ్తారు. "నీట్"గా డ్రెస్ చేసుకురావాలంటూ ఉద్బోధ చేస్తారు. "మేం బీదవాళ్లం. మాకు లేవు మేడమ్" అని ఎవరేనా పిల్లకాకి పలికితే "అయితే స్కూలుకు రావద్దు. చదువు మానుకో" అని అమూల్యమైన సలహా ఇస్తారు. ఆ "నీట్" అనే మాటకర్థం టెరిలిన్ జాకెట్టు, షిఫాన్ వోణీ, శాటిన్ పరికిణీ ! ఆ సిల్కుల్లో మునిగిన అమ్మాయిలంటే ఇలాటి టీచర్లకు అంతులేని అభిమానం. రెండోతరగతి పుస్తకంలో కాబోలు "వేషమహిమ" కథ గుర్తుకు వస్తుంది.

పిన్నేకాదు నూటికి తొంభై ఐదుమంది తల్లిదండ్రులేనా ఇలా ఆవేదనపడ్తున్నారీనాడు ఆడటీచర్లు—ఆడ పిల్లల స్కూళ్లమూలంగా !

ఇలా అని టీచరయిన ప్రతి ఒక్కరూ ఇలా ఉన్నారని కాదు. కానీ ముప్పాతిక మంది ఇలాగే ఉన్నారు. లేనివారు కనీసం తోటి టీచర్లలో తమ అభిమానాన్ని కాపాడుకోవటానికి అలా ప్రవర్తిస్తున్నారు. "ఏ రాయి అయితేనేం పళ్లూడ కొట్టడానికి ?" అన్నట్టుంది.

మగ పిల్లల హైస్కూళ్లల్లో ఇలాంటి విపరీత పద్ధతులులేవు. మగపిల్లలు అల్లరి పెడతారనో, లేక స్వతహాగా ఆలోచనా శక్తి, కుటుంబ ఆర్థిక పరిస్థితులూ తెలిసి ఉన్నందువల్ల మగ మేష్టర్లు లేనిపోని నిర్బంధాలూ, పద్ధతులూ ప్రవేశపెట్టరు. పైగా పిల్లల్ని నములుకు తిందామనే ఆసక్తికంటే, వారికి నాలుగక్షరాలు చెబుదామనే అభిప్రాయమే వారిలో ఎక్కువగా ఉంటుందనుకుంటాను. బట్టలూ, అలంకరణ, కుట్టుపనికి డబ్బు, చందాలకు ఈ "ఇంత" మొత్తం, నోటుబుక్కులు బొండువి అవునా, కాదా, అనే చిన్నచిన్న, విషయాలను పట్టించుకోరు వాళ్లు. ఎలా అయితేనేం ఒక్కో మేష్టరూ ఒక్కో యమదూతగా (పెద్దల, పిల్లల పాలిట) గాక, మేష్టరుగానే కన్పిస్తారు.

ఇంతవరకూ చదివేసరికి, గరల్స్ హైస్కూళ్ల టీచర్లందరికీ నా మీద పీకెల వరకూ కోపం రావటమేగాక, వ్యాసంతోబాటు పత్రికలో నేను సజీవంగా కన్పిస్తే నమిలి మ్రింగాలని కూడా అనిపించవచ్చు. అంతటి కోపం వస్తే రావచ్చును గాక. ఈ నాడు సగటున గరల్స్ హైస్కూళ్లల్లో ఉన్న పద్ధతులనూ, ఆడటీచర్ల వైఖరిని వాస్తవికంగా ఉన్నదున్నట్లు వ్రాస్తున్నాను.

మగ పిల్లలవల్ల తమ ఆడపిల్లలు అల్లరిపడకూడదనో, లేక అక్కడ ప్రవేశం లేనందువల్లో, మరే కారణాలవల్లో తల్లిదండ్రులు తమ ఆడపిల్లలను ఆడపిల్లల హైస్కూల్లో చేరుస్తారు. (చదువులేకుంటే పెళ్లికాదని భయమొకటి మళ్లీ!) వారివారి కుటుంబ పరిస్థితులూ, ఆర్థిక స్తోమతులపై, ఆ పిల్లల బట్టలూ, అలంకరణా ఆధారపడి ఉంటాయి. అలాటప్పుడు వారిని ప్రతి విషయంలో నిర్బంధించటం ఆడటీచరు అమానుషత్వానికి నిదర్శనమే తప్ప మరొకటికాదు.

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే, ప్రతి ఆడ టీచరూ, కొన్ని ముఖ్య విషయాలను గమనించాలి. న్యాయంగా తమకు చెందుతున్న జీతంతో, ఆడ పిల్లలకు చదువు చెప్పటానికే వారక్కడున్నారనీ, కేవలం ఆడపిల్లలను, వారి తల్లిదండ్రులనూ ఆవేదన పెట్టటానిక్కాదని గ్రహించుకోవాలి. ఏదో ఓ సాకుతో పిల్లలు చేతిలో చిక్కారనే సాకుతో, మార్కులు తగ్గించి, రిమార్కులు వ్రాసి, ఫెయిల్ చేసినందువల్ల అటు ఆ అమ్మాయి భవిష్యత్తు ఒక సంవత్సరం చేతులారా, పాడు చేయుటమేకాక, అది ఈ నాడు వెళ్లినా, అనుక్షణమూ మనలనందర్నీ ఓ కంట కనిపెట్టే ఆ దయామయుని న్యాయ స్థానంలో చెల్లించుకోలేరు. తమ దగ్గర విద్యాభ్యాసం చేసి ఆ పిల్లలు, ఉన్నత స్థితిలోకి రావాలని కాంక్షించటంలో నిజమైన 'గురు స్థానానికి' చోటు ఉన్నది కానీ, వారిని ఉన్నతి మార్గం నుంచి నిరోధించటంలో ఒక టీచరు అంటూ కావాలా ?

పెద్దలు, చదువుకున్నవారు. దయ, క్షమ, సానుభూతి వగైరా ఉన్నత గుణాలకు దర్పణాలూ అయిన ఆడువారు, అందులోనూ మరొకరికి బోధించ వలసిన టీచర్లు లేక మేడమ్స్ ఇలా ప్రవర్తించటం సబబుకాదు. నేనిలా వ్రాశానని నన్ను నిందించినా, ఒక్కమారు, ఎవరికి వారు ఆత్మ విమర్శ చేసుకుంటే చాలు. ఇకనైనా పిల్లల మీద దాడి, తద్వారా పెద్దల ప్రాణాలమీద నిఘా మేడమ్స్ మానుతారనీ, గరల్స్ హైస్కూళ్ల ఆడపిల్లల, వారి తల్లిదండ్రుల పాలిటి యమశాలలుగా గాక, ఆడపిల్లల ఉన్నత పాఠశాలలుగానే ఉండగలవని ఆశిస్తున్నాను. ★

# వనితా వాణి

## అమెరికాలో పిల్లల పెంపకం

వ్యాసం నాకే కాదు, ప్రతి గృహిణిని ఆకర్షిస్తుంది. పాత పద్ధతుల పరిస్థితులలో పడిపోతున్న కుటుంబాలు పిల్లల పోషణలో తగు జాగ్రత్త తీసుకోక పచ్చని భవిష్యత్తును పాడుచేస్తున్నారు. పిల్లలు పుట్టినప్పటి నుండి పోషణలో కాని, పెంచటంలో కాని, తల్లి పాల విషయం (ద్రవ, ఘన పదార్థముల ఆహారములు)లో కాని డాక్టర్ల సలహాలచే అమెరికాలో పిల్లలను పెంచుతున్న స్త్రీలను గురించి బాగా తెలియజేశారు రచయిత్రిగారు. ఆస్పత్రులలో సరిగ్గా పురుడు పోయరు. అన్న అనుమానంను తక్కువ చేసుకొని ఇంట్లో ప్రసవిస్తే అయ్యే ఖర్చులను తగ్గించుకొని, డాక్టర్ల సహాయం లేకుండా ఇంటిదగ్గర నున్న మంత్రసానులచే పురుడు పోయించుకోక జాగ్రత్తగా ఉండాలి.

లతా కృష్ణారావు (హైదరాబాదు)

* * *

వ్యాసం చాలా బాగున్నది. కొన్ని పద్ధతులు మనం చేయవచ్చు. కాని కొన్ని చేయలేము అక్కడ వాతావరణం బట్టి వారు చేసినా ఈ దేశం వాతావరణానికి కొన్ని పద్ధతులు వీలుపడవు మొత్తంమీద వ్యాసం బాగుంది. వారికి మా ధన్యవాదాలు. ఇంకా ఇలాంటి వ్యాసాలు విదేశాలలో ఉన్న సోదరీమణులు వనితావాణి ద్వారా తెలియజేసెదరని ఆశిస్తున్నాను.

శ్రీమతి మూర్తి (గజపతి నగరం)

* • *

వనితాలోకంలో రమాదేవిగారు వ్రాసిన 'అమెరికాలో పిల్లల పెంపకం' వ్యాసం బాగానే వ్రాసారు. ముఖ్యముగా పాశ్చాత్య దేశములలోని పద్ధతులు మన వారికి చాలా ఉపయోగము. పత్రికల ద్వారా ఇటువంటి వ్యాసములు చదువుటకు వీరు. అమెరికాలో పిల్లలు 18 సం. తరువాత స్వశక్తిమీద ఆధారపడుట అక్కడ గల అభివృద్ధిని తెలుపుచున్నది.

చావలి. మీనాక్షి (విజయవాడ)



రమ గారి వ్యాసం, స్త్రీలో కాస్త ఆవేశం ఎక్కువగా ఉన్నట్లు కన్పించినా కొంత సహజంగానే ఉంది. నేటి నవనాగరిక యుగంలో మనం కూడా అన్ని రంగాలలోను పురోగమించడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాము. దానికి పురుషుల సహాయ సహకారాలు ఎక్కడో తప్ప అంతగా కన్పించటంలేదు. విషయాలన్నీ ఒకదాని తర్వాత మరొకటి వూహించి వ్రాయటం బాగుంది. అయితే ఈ కాలపు తల్లిదండ్రులు తమ సంతానంలో అబ్బాయిల కంటె అమ్మాయిలను చిన్న చూపు చూస్తారనటం సహజంగా కన్పించదు. ఎంత పేదవాడైనా కొడుకుని, కూతురును ఒకే విధంగా చూసుకుంటాడే తప్ప వారన్నట్లు ఆడపిల్లను చిన్నచూపు చూడడు. ఈ విషయంలో వారితో నేను ఏకీభవించలేకపోతున్నాను:

నడిమింటి రమణమ్మ (అదపాక)

* * *

"రమ" గారు వ్రాసిన స్త్రీ వ్యాసం ఎంతో అసహజముగ నున్నది. స్త్రీకి మునుపు గౌరవమయినప్పటికిని, ప్రస్తుతము స్త్రీకి ఎంతో గౌరవ మిచ్చుచున్నా రనెడి విషయము గమనించ వలసి యున్నది.

"కుమార్తె" గ తల్లిదండ్రులు గౌరవం చూపుతున్నారు. (తండ్రుల సంగతి ఏమో గాని, తల్లి మాత్రము కుమార్తెవేపే పక్షపాత బుద్ధి చూపించునని మా ఉద్దేశ్యము). "అర్ధాంగి" భర్త, భార్య నెంతగ గౌరవించుచున్నాడో మన కందరకు తెలిసిన విషయమే. పోతే ... మాతృదేవత" గ తల్లిని గౌరవింకో [illegible] కూడ లేక పోలేదు.

"రమ" గారు వ్రాసిన వ్యాసము పూర్వకాలమున (18 వ శతాబ్దమున) వర్తించులేనేమో గాని ప్రస్తుతము వర్తించదు. వారు వ్యాసంలో, "పెళ్లయిన తరువాత స్త్రీ జీవితం నరకంగ మారుతుంది." యని వ్రాసినారు. కాని "పెళ్లయిన తరువాత స్త్రీ జీవితం "సుఖమయము" గ సాగునని మా యుద్దేశ్యము.

## వనితావాణి

"రమ" గారు వ్రాసిన విషయములు కొందరి పట్ల నిజమేమో గాని, యనేకుల పట్ల అసంభవము.

గోరి రామమోహనరావు,
కుమారి పద్మలత (మంగళగిరి)

* * *

## బొట్టు మచ్చ

బొట్టు పెట్టుకొనుచోట పుండవుతున్నది, ఎన్ని మందులు వాడినా బాగుకాలేదు. తెలిసిన వనితలు ఏదైనా చిట్కా వైద్యం తెలుప ప్రార్థన

శెట్టిపల్లి పద్మావతి (గుంతచీపాడు)

★




### జరిగిన కథ

భర్త రచన రాయమంటాడు తనకు వస్తువు లభ్యం కాదు. పైగా సంసార తాపత్రయం. కాని గోపాలం అనే కథానాయకుడు సరోజ అనే కథానాయిక లభ్యమయ్యారు....ఐతే రచన ఎలా.... యింతలో అభిమానులు వస్తారు. వాళ్ళు వెళ్ళాక భర్తకి టిఫిన్ చేద్దామనుకుంటుంది.

(గత సంచిక తరువాయి)

"ఎందుకు తిప్పలుపెడుతుందీ? నే వెలిగించేదా?" అంటారు పైగా.

అదేం చిత్రమో. అది ఆయన చెప్పేవట్టు వినమా వింటుంది.

"ఐదు సంవత్సరాల సహవాసం! ఏమిటను కున్నావ్!" అంటారు.

స్టౌ వెలుగులో మొహం గర్వంగా మెరిపించుకొంటూ. —

"నేనూ వచ్చి నాలుగు సంవత్సరాలైందిగా?" అంటాను ఉక్రోషంగా.

"ఇదిగో అమ్మాయ్! మనుష్యుల్నిబట్టే అదీనూ."

"ఉహూ! నేను దానికి వచ్చినప్పుడు నే నసలు దాన్ని ముట్టనే ముట్టను. నాకు జనతా స్టౌ కొనండి."

"కానీ కోతి అర్ధణా బెల్లం తిందట. నీకు వేరే స్టౌ ఒకటా? దండగ."

"దండగేం? పోనీ మనం ఎప్పుడైనా దెబ్బలాడుకుంటే చెరో స్టౌ ఉంటుందిగా?"— సరిగా అప్పుడు శ్రీవారి మొహం చూడాలి కాని.

అచ్చం ఇంద్రధనుస్సులా ఉంటుంది పాపం!

ఓసారి నిజంగా మావారు నాతో దెబ్బలాడి వేరుపడ్డారు ఖర్మ! గబగబా స్టౌ వెలిగించుకోటం .... అన్నం వండుకోటం .... అదంతా ఓ పెద్ద కథ!

"మవ్వేం దెప్పనక్కర్లా?"

"అహ! దెప్పటంకాదు. ఉన్న సంగతి."— గతంలో పడి కొట్టుకుపోతున్న నేను శ్రీవారి గొంతు విని ఉలిక్కిపడ్డాను.

"ఏమిటో పరధ్యాన్నం? పట్టపగలే నిద్రపోతున్నావా ఏమిటి? ఏదీ? తొందరగా పెట్టేయ్! అప్పుడే ఓ గేమ్ ఐపోయివుంటుంది—ఏడీ? వానిగాడెటు పోయినాడు?" గబగబా స్వగతాలు మాట్లాడేసుకుంటూ బాట్ తీసికెళ్ళి సైకిల్‌కి తగిలించుకొని రేడియో ట్యూన్ చేసుకు కూర్చున్నారు—"నా స్థితి వర్ణనాతీతం" అనేస్తే ఒక్క వాక్యంతో పోతుంది గానీ, కాస్త నా బాధెలా ఉంటుందో మననం చేసుకోవాలని ఉంది మరి.

"నాలిక పిడచకట్టుకుపోయింది. గుండె ఆగిపోయింది." అంటారే అలాగే తయారైంది స్థితి.

మౌనంగా నిలబడిపోయాను.

"నీకేనోయ్ చెప్తా! ఏమిటలా చూస్తావ్."

"ఛ! నేను బొత్తిగా భయస్థురాల్ని" అనుకొంటూ కాస్త ధైర్యం తెచ్చుకోటానికి ప్రయత్నిస్తున్నాను.

"ఏమిటబ్బా ఈ మౌనవ్రతం? నా మొహాన్నేం బొమ్మలాడుతున్నాయా చెప్పు."

"అహాఁ! మీ మొహం .... చాలా అందంగా ఉంటేనూ!" 43 వ పేజీ చూడండి




జోరుగా వర్షం కురుస్తూంది. కళ్లు పొడుచుకున్నా కనబడని చీకటి ఆవరించుకుంది. కీచురాళ్లు గోలగా అరుస్తున్నాయి. కప్పలు సప్తస్వరాలు పలికిస్తున్నాయి. ఆ వర్షంలో, వీస్తూన్న గాలిలో విరబోసుకున్న తలలలా వూగుతున్నాయి చెట్లు. ప్రకృతి భయానకంగా ఉంది.

గదిలో బిక్కుబిక్కుమంటూ ఒదిగి కూర్చుంది సీత. వర్షం అంటే సంతోషంతో అరుస్తున్నాయి కప్పలు. 'ఇంకాకురు ఇంకాకురు' అంటున్నాయి కాబోలు. శక్తినంతా ధారపోసి అరుస్తున్నాయి కీచురాళ్లు. ప్రేయసిని ఆకర్షించడం కోసం అలా తమ రెక్కలని కాళ్లతో రుద్ది చప్పుడు చేస్తాయి కీచురాళ్లు అంటారు. ఏమో మరి. దుమ్ము కడుక్కుపోయిన చెట్లు పొద్దుటయేసరికి సూర్య కాంతిలో తళతళ మెరుస్తాయి. విరిగిన సూర్యకిరణాలు ఇంద్ర ధనువులు పరుస్తాయి. కూర్చుని దీపం కేసి చూస్తూ వూహించుకుంటూంది సీత.

రోజూ వర్షం రాదు. కాని ఇలా ఒదిగి కూర్చోడం, దీపంకేసి చూడ్డం సీతకి అలవాటయిన పని—దినచర్య. కోడి కూసే టైముకి కోడికంటే ముందే లేచిన సీత రోజూ ప్రతతి దీర్ఘ నిద్రలో మునిగినా తను కనుమూయలేదు. ఆయన ఇంటికి రావాలి భోజనం చెయ్యాలి. పక్కమీద ఏ గొడవా లేకుండా వాలాలి. అప్పుడు— ఇక ఇల్లు చక్కపెట్టి తను పడుకోవాలి ! సీత ! ఏం పేరు ? అని సన్నగా నవ్వుకుంది సీత. నా ఈ జీవిత పథం వూహించి అమ్మా నాన్న పదకొండో రోజున పెట్టారా ఆ పేరు ?...లేదు...అమ్మా నాన్నా ఇలా ఎప్పుడూ వూహించి ఉండరు. పచ్చని దబ్బపండు లాంటి శరీరచ్ఛాయ చూసి, చేపపిల్లల్లా మెరిసే కళ్లు చూసే ఆ పేరు పెట్టి ఉంటారు. నిట్టూర్చింది సీత. అనుకోకుండానే ఎడం చేత్తో కుడి చేయి తడిమి చూసుకుంది. ఆ బంగారు ఛాయ ఏమైంది ? మెరిసే కళ్లిలా శ్రావణ మేఘాలయ్యాయేమిటి ?

దూరంలో ఎక్కడో పిడుగు పడింది. ఆ పిడుగు పాటుకి ప్రతతే దద్దరిల్లి పోయింది. దీపంకేసి రెప్పవాల్చక చూస్తున్న సీత అదిరి పడింది. ఈ పిడుగు ఎక్కడ పడిందో ? వారున్న కాంతం ఇంటిమీదా ? నే పుట్టి పెరిగిన తాతగారి వూరిలోనా ? నా పచ్చని జీవితం మీదా ? ఎక్కడ పడిందీ పిడుగు ? అనుకుంది సీత. వానజోరు ఎక్కువ అయింది. కప్పలరొద కీచురాళ్ల అరుపులతో పోటీ పడుతోంది. చీకటి కంటికి కనబడుతోంది ! కిరసనాయిలు తగ్గిపోతూన్నట్టుంది. దీపం భగ్గు భగ్గున మండుతోంది. చిమ్నీ అంతా మసి బారుతోంది. అయినా ఆ పరుచుకున్న చీకటిలోంచి చూస్తూంది సీత.

గతంలో—

సీత కలవారింటి పిల్ల. అందంగా నాజూకుగా వయ్యారాలు పోయే సీత మేలిమిరంగు శరీరం, వంపులు తిరిగిన సొంకం చూసి కళ్లు కుట్టుకోని కుర్రవాడులేడు. దిష్టి తీసిన మిరపకాయల ఘాటుతో ఉక్కిరి బిక్కిరి కాని నాయినమ్మలేదు ! సీత కలల్లో నీలి నీలి ఆకాశపు తెరలలో తేలి ఆడుతూండేది. కాళ్లకీ చేతులకీ గోరింటాకు పెట్టుకుని ఒక చోట కూర్చోలేక తేలిపోతూ నడిచే సీతని చూసి 'ఎక్కడికే ఆ పరుగూ ? పిచ్చి !' అని కేకలు వేసేవాడు పెద్ద మామయ్య. పెద్ద

మామయ్య ఒలకపోసిన ఆపేక్షతోనే పెరిగి పెద్దయిన సీతకి ఆ రంగు వచ్చిందని వేళకోళం చేసేవారు అందరూ వయ్యారంగా వాలుజడ స్కిరుదులమీద ఆడుతూండే పరికిణీ కుచ్చెళ్లు తన్నుకుంటూ నడిచిన సీతనీ— ఎక్కడికే ఆ పరుగూ ? అంటూ కేకలు వేసేవాడు పెద్ద మామయ్య! పెద్ద మామయ్యకి ఆడది నడిస్తే పరుగులా కన్పిస్తుంది కాబోలు ! అని వేళాకోళం చేసేది సీత.

పెద్ద బావని చేబట్టాలని పట్నంలో కాపురం పెట్టాలని కోటి కోర్కెలతో సతమత మయ్యే సీతకి మూగతనం ఆవరించేది బావముందు. బావ చదువుకున్నవాడు. సరసుడు. తను మాట్లాడితే మోటుగా ఉంటుందేమో, నవ్వుతాడేమో ! చిన్న చూపు చూస్తాడేమో ! అని హడలిపోతూ, బెదరిన లేడిలా పల్కులకు పారిపోయేది సీత. కలిసిన కుటుంబాల మధ్య అందరి పిల్లలూ ఒక్కలాగే పెరుగుతూ వస్తారు. ఎవరిలోని ప్రత్యేకతలూ అప్పట్లో ఎవరూ గుర్తించరు.

పెద్ద బావ పట్నం చదువు ముగించేసరికి పెద్ద మామయ్య ఆస్తి సగం తరిగింది. అయినా కుర్రవాళ్ల ఆశలకి అడ్డువచ్చే రకంకాదు పెద్ద మామయ్యది. 'ఇద్దరు కొడుకులేగా. పోనీలే చదువుకోని. వీడికి సీతని కట్టబెడతాను. వాడికి వెంకటలక్ష్మిని కట్టి పెట్టేస్తాను. సరిపోయింది.' అని నిశ్చింతగా ఉండే పెద్ద మామయ్య అనుకోకుండా మంచం ఎక్కాడు. ఎండనక వాననక పొలం పనులమీద, పొగాకు వ్యాపారం మీద తిరిగే పెద్ద మామయ్య ఉన్నట్టుండి — మొదలు నరికిన చెట్టులా పడిపోయాడు. పచ్చటి సంసారంలో చిచ్చులు పుట్టాయి. 'చదువుకని నీ ఆస్తి అంతా తగలెట్టి నాశనం చేశావు. మిగిలిందంతా చిన్నవాడిదే !' అంటూ వెంకటలక్ష్మి తండ్రి కరణం మునసబుల అండచూసుకుని తీర్పు చెప్పాడు. పెద్ద బావని చూస్తే తన్మయం చెందే సీతకి బావకి ఆస్తి లేక పోతేనేం? అనిపించింది. కాని సీత తండ్రి గారి కిదేం నచ్చలేదు. 'అదేవిటి ? రామకొండని ఏం చదువుకోవద్దన్నాడా ? పొలంలో పాతుకు పొమ్మని చెప్పలేదే ! వాడే చదువద్దు మొర్రో మన్నాడు. అంచేత పెద్దవాణ్ణి అన్యాయం చేస్తారా?' అని పేచీకి దిగాడు. 'అయితే సీతని రామకొండకే ఇస్తాను.' అన్నాడు. ఆ మాటలు విని అదరి పోయింది సీత. ఇదేం అన్యాయం ! వీళ్ళు మనుష్యలనే చూస్తారేం ! మమతల సంగతి పట్టించుకోరేం ? అని లేని గోడలకి తల బాదుకుని ఏడ్చింది సీత. సీత పడిన బాధ దండగే అయింది. భవిష్యత్తు మీద ఆశలేని తండ్రి ఎవరేనా ఉంటారా? సీత తండ్రి అంత వాజమ్మకాదే ! ఆస్తి పాస్తులు లేని పెద్దవాడికి పిల్లనివ్వనన్నా చదువుకున్నవాడు. చక్కని ఉద్యోగం వస్తుంది. అన్న ఆశను వదులుకోలేదు. వెంకటలక్ష్మి తండ్రి పట్టు వదలకపోతే అప్పుడు చూసుకోవచ్చు. అని వూరుకున్నాడు. వెంకటలక్ష్మి తండ్రి ఆత్ర పడ్డాడు. పెద్దవాడి చేతిలో రెండొందలు పెట్టి ఉద్యోగం చూసుకోమని పంపేశాడు. పెద్దరికం వహించి రామకొండకి వెంకట తల్లిని పెళ్లిచేసి అమ్మయ్య ! అని నిట్టూర్చాడు— బరువు దింపుగొన్నట్లు. వెంకటలక్ష్మి వంటిట్లోనూ, రామకొండ పొలంలోనూ ప్రవేశించడంతో సీత జీవితంలో ఒక అధ్యాయం ముగిసి ఇంకో అధ్యాయానికి ప్రారంభం అయింది.

తండ్రి ఏం చేయలేక పళ్లుకొరికి నలుగుర్నీ శాపనార్థాలు పెడుతూంటే సీత కెక్కడికేనా పారిపోవాలనిపించేది. ఎక్కడికి పారిపోతుంది ? ఎప్పుడు తెగిద్దామన్నా, నడిస్తే చాలు ఏమిటా పరుగు ? ఎక్కడికా పరుగు ? అని హెచ్చరించే పెద్ద మామయ్య మాటలే చెవుల రింగుమంటూంటే, ఎక్కడికి వేస్తుంది— అడుగు ! పెద్ద బావకి పట్నంలో ఉద్యోగం అయిందనగానే కొండంత ధైర్యం వచ్చింది సీతకి. అబ్బ ! ఇక నా జీవితం ఒక దారిన పడుతుంది. బావతో హాయిగా కాలం గడిచిపోతుంది— అని పంచరంగుల కలలు కని వూహల ఉయ్యాలలో వూగనారంభించిందిసీత లేత వయసు. మమతల కొలనైన లేతమనసు.

ఉద్యోగంలో చేరిన పెద్దబావ ఇంతగా మారాడని ఎలా తెలుస్తుంది ?.... సీత ఉంటే చాలనే పెద్ద బావ సీతని చేసికుందుకిన్ని షరతులు పెట్టాడని ఎవరనుకున్నారు ?

చిన్న సైజు కాపరానికి కావలసిన సరంజామా అంతా కొనిచ్చారు. అల్లుడిగారికి చిన్న మోటారు సైకిలు కొనిచ్చారు. పిల్లని పట్నం తీసికెళ్లి ఏలుకుంటేనే చాలు. అదే పదివేలు అని ఉబ్బిపోయారు సీత తల్లిదండ్రులు. ఎంతో కష్టం మీద, పదివేలు- అప్పుమీద సీత కళ్యాణం అయిందనిపించారు. నాల్గు నాటికల్లా భార్యా సమేతంగా పట్నం కాపురానికి వచ్చాడు పెద్దబావ.

పిల్ల జమీందారు ఫాయిలో ఉద్యోగానికి పోతూ వస్తూవుండే బావని వెలిగే కళ్లలో నింపుకొని ఆనందంగా బ్రతకడం నేర్చుకుంది సీత. మోటారుసైకిలు వీధి అరుగు పక్కగా నిలబెట్టి సన్నగా ఈలవేస్తూ "ఓయి సీతా" అంటూ లోపలికి వచ్చే పెద్దబావని చూసి రోజంతా పడ్డ తాపత్రయం, ఒంటరితనం అన్నీ మరిచిపోయి లేడిలా ముందు గదిలోకి పరిగెత్తేది సీత.

ఆఫీసుకి వెళ్లేప్పుడు ఆప్యాయంగా చేతుల్లోకి తీసుకున్నా, ముద్దుపెట్టుకున్నా. 'అయ్యో ఎవరేనా చూస్తున్నారేమో!' అన్న భయంలేదు ఆ ప్రేమ పక్షులకి. రోజులు క్షణాల్లా జరిగిపోయాయి. సన్నగా మెరుపు తీగలాఉండే సీత కొంచెం ఒళ్లు చేసింది. నడకలో హుందా నింపుకొంది. కళ్లు కొత్త కాంతులని పుంజుకున్నాయి. తృప్తి నిండిన జీవితంలో తేలిపోతూంది సీత. జీతం సరిపోదని కర్చు తగ్గించాలని భయం లేదు. ఇద్దరి కెంత కావాలేం ! అన్న నిర్లక్ష్యం. అనుభవించడానికి కాకుంటే ఈ సంపాదన ఎందుకు ? అన్న చిన్నతనపు దోవనపడి.... విచ్చలవిడిగా కర్చుచేస్తూ సంపాదిస్తూ, నవ్విస్తూ తను నవ్వుతూ సాగే పెద్దబావ నీడలోనే సీతనీడ ఐక్యం చేసుకు నడిచింది...

నెలలు సంవత్సరాలైనాయి. నాల్గు సంవత్సరాల సంసారిక జీవితం చట్టున కన్పిస్తూంది. సీత ముఖంమీద.. కళ్ల చుట్టూ నల్లని నీడలు— అవి బావ రాకకోసం అలసిన కన్నులు పరచిన నీడలు! పట్నంలో ఉద్యోగం మాటలా ? గబ్బిలాయిలా ఇలా నీ కొంగు వదలకుండా ఉంటే నీతోపాటే నేనూ రాతియుగానికి దారితీస్తాను ! అని హేళనగా వ్యంగ్యంగా కోపంగా అప్పుడప్పుడు విసుక్కునే బావను చూసి దిగ్భ్రమ చెందింది సీత. తన చుట్టూ అల్లుకున్న రంగుల కలలు చెదరిపోవడం, తను ఎక్కిన వూహల పాలకి క్రిందికి దిగడం— వెన్నుమీద చరచినట్లు, మొట్టికాయ మొట్టి చెప్పినట్లు తెలిసొయి. ఆ తెలుసుకునే లోగానే గతం కదిలింది....

వర్తమానంలో....

సీత రేయింబవళ్లు దీన్నిగురించే ఆలోచిస్తూంది. పట్నంలో కర్చు ఎక్కువగా ఉందని, దగ్గరలోనే ఉన్న చిన్న పల్లెటూరిలోకి మకాం మారింది. మోటారుసైకిలెలాగా ఉంది. ఉదయం వెళ్లి ఉద్యోగం అయాక సాయంత్రం ఇంటికి వచ్చేయచ్చునని సంజాయిషీ. కాని ? కాని సీత కిందులో మోసం కల్పించింది. బావ తనకి దూరంగా ఉండాలని కోరుకుంటున్నాడా ! తన సాన్నిహిత్యం భరించలేని స్థితికి వచ్చాడా ?.... ఈ ఆలోచనల అలలకి అంతులేదు. ఏదో ఒక చిన్న వూహ గులకరాయిలా పడితేచాలు : ప్రశాంతంగా ఉన్న మానసిక సరస్సులో ఎడతెగని అలలు రేకెత్తడానికి.

రాత్రి పన్నెండవుతోంది. పట్నాని కెంత చేరువలో ఉన్నా ఈ దిక్కుమానిన పల్లెటూరికి దీపాలు లేవు ! హరికెన్‌లాంతరు వెల్గులు వింత నీడలు పరుస్తూంటే బావ వస్తాడేమో అని అరుగు మీద నిలబడి చూస్తూంది సీత. ఇంతరాత్రిదాకా ఏం చేస్తున్నాడు ? ఆఫీసులోనే ఉన్నాడా ? అన్న చిలిపి వూహ రావడంతో చిలవలూ పలవలూ అల్లడం ప్రారంభించింది సీత అలసిన మనసు.

ఎందుకీ ఎదురు తెన్నులు చూడ్డం అన్న విస్పృహతో లోపలికి వచ్చి దబాలున తలుపులు గడియ వేసి వెళ్లి మంచం మీద పడుకుంది. బావ ఏం చేస్తున్నాడు ? ఏదో ఉన్న దాంట్లోనే సర్దుకుని కాలక్షేపం చేద్దాం— పన్నెందుకీ అడవిలోకి ఈడ్చేశాడు ? ఏం చేయలేని చేతకానితనంలో వెక్కి వెక్కి ఏడ్చింది సీత. 'ఈ జీవితం నాకొద్దు. నాకొద్దు' అని పదికి పదిసార్లు పల్లించింది. 'పిచ్చిదానా, ఎక్కడికీ పరుగులు ?' అనే పెద్దమామయ్య ఏడి ? ఎందుకిలా చచ్చి నన్ను సాధిస్తున్నాడు ?.. మామయ్యా, ఎందుకిలా చేశావు ? నా మీద నీకెందుకింత కక్ష ! నన్నిలా రాక్షసుల్లా తినేస్తున్నారెందుకు ? అంటూ అరిచింది. తిట్టుకుంది. కాని ఈ గోల ఎవరు పట్టించుకుంటారు ? సహవర్త్యానికి తహతహ. అదేలేక ఈ మానసిక ఆందోళన గోల. బావరానీ చెప్తాను. అనుకుంది. ఏం చెప్పాలనో !కాని ఆ వూహతో కొంచెం ప్రశాంతి చిక్కి అలసిన సీత తలగడపై తలవాల్చి కళ్ళు మూసింది.... ఆ నిద్ర ఎంతసేపు పోయిందో.... ఎవరో తలుపులు బద్దలయేలా తట్టుతున్నారు... బద్దకంగాలేచి వళ్లు విరుచుకుంది. పిడుగుపాటులా ఏమిటీ తలుపు చప్పుడు. లేచి కొడిగట్టిన దీపాన్ని సవరించింది. గడియారం మూడు చూపెడుతోంది... అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లి తలుపు తెరచింది సీత. తలుపులు తెరచుకోవడం ఎదుటి వ్యక్తి లోపలికి రావడం, సీత చెంప ఛెళ్లుమనడం ఓ తృటిలో జరిగిపోయాయి. నిద్రమత్తు వదిలిపోయింది సీతని, కోపంతో

42 వ పేజీ చూడండి



# కొలంబా

## రచన: ప్రాస్పర్ మెరిమె

### జరిగిన కథ

కర్నల్ థామస్‌నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్‌వస్తాడు. లిడియా సాహసం గల యువతి. చిత్రలేఖనం తెలుసు. 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం. అక్కడికి వెళ్లడం కష్టనష్టాలతో కూడినపని ఐనా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాతెతో ప్రయాణం అవుతారు. కార్సికాకు బయలుదేరారు. వారితో లెఫ్టినెంట్ "ఆర్సోద్దెల్లా రెబ్బియా" అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను యీ రెబ్బియాతో పరిచయం పెరుగుతుంది. మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది. వారు కార్సికా చేరారు. పాస్‌పోర్టు ఆఫీసరు మాటలవల్ల, ఆర్సో తండ్రి హత్యకు లోనయ్యాడని మిస్ లిడియా గ్రహిస్తుంది. ఇంతలో ఆర్సో చెల్లెలు కొలంబా అతన్ని వెతుక్కుంటూ అజాచ్చియోకి వస్తుంది. కర్నల్‌గారి సత్రంలోనే దిగుతుంది. కొలంబా, ఆర్సో ఆంటన్‌లు పియత్రనెరాకి వెళ్ళిపోతారు. స్వగ్రామంలో కొలంబా బ్రాందొలాచ్చియో అనే బందిపోటు దొంగకు సహాయం చేస్తున్నట్లు ఆర్సో ఆంటన్ తెలుసుకుంటాడు. అతన్నీ అతని సహచరుడినీ కూడా కలుసుకుంటాడు. పొరుగింటి బాప్టిస్ట్ పియాత్రి చనిపోగా పరామర్శకు వెళ్లిన కొలంబా, ఆర్సో ఆంటన్‌లు, తమ విరోధి బారిచీనిని కలుసుకుంటారు. గ్రామాధికారి ఆర్సోకి విరోధాలు మానుకోమని సలహా ఇస్తాడు.

### 14

సావెరియా తిరిగి రావటానికి చాలాసేపు పట్టింది. అర్సో చిరాకు పట్టలేనంతగా అయిపోతున్నదనగా ఆమె రానే వచ్చింది. చేతిలో ఉత్తరం పుచ్చుకుని నడిచి వచ్చింది. వెనకాలే కళ్లు నలుపుకుంటూ చిలినా వస్తోంది; అప్పుడే నిద్రలేచి వచ్చినట్లుంది.

"అమ్మాయి!" అన్నాడు అర్సో. "ఈ వేళప్పుడు ఇక్కడేం చేస్తున్నావు?"

"కొలంబాగారు పిలిపించారు," అన్నది చిలినా.

"ఇప్పుడేం సాహసం తలపెట్టిందో." అనుకున్నాడు ఆర్సో; కాని మిస్ లిడియా ఉత్తరం అందుకుని చదవటం ప్రారంభించాడు. చిలినా పైకి వెళ్ళిపోయింది.

—'మా నాన్నగారికి కొంచెం అస్వస్థతగా ఉంది,' అని వ్రాసింది మిస్ నెవిల్. 'అంతేకాక మీకు వ్రాయాలని ఒకటే ఆత్రంగా ఉండటం బట్టి నేనే ఆయన 'లేఖకురాలిగా' పనిచెయ్యవలసివస్తోంది. ద్వీపమంతా షికారుమీద తిరగటానికి బదులు జ్వరంతో పడుకుని ఉండిపోయారు. మీరేమి చేస్తున్నారో ఇక్కడ నేను ఊహించుకొనవలసివస్తోంది; మీ బాకు కోసం వెతుక్కుంటున్నారా? మీకు దొరకదనే నా ఆశ! మా నాన్నగారికేమో జ్వరం, నాకేమో దిగులుగా ఉంది. ఇక్కడి గ్రామాధికారిగారు మంచి మందు ఇప్పించాడు. రెండు రోజుల్లో కొంచెం ఉపశమించింది. మా నాన్నగారు వేటకి వెడతానంటున్నారు. నేనే వద్దని నిషేధించాను. కొండమీద మీ భవంతి ఎట్లా ఉంది? ఎక్కడెక్కడికి వెళ్ళివచ్చారు? దెయ్యాలేమయినా కనిపించాయా! ఇవన్నీ ఎందుకడుగుతున్నానంటారా? మా నాన్నగారికేమో, జింకలు, పిట్టలూ ఇప్పిస్తామన్నారు.. మీ భవంతి పాతదికదా! కప్పు కూలి మా తలల మీద పడదు గదా అనుకున్నాను!

మరొక విషయం; అక్కడ విరోధాలను గురించి గ్రామాధికారిగారు చెప్పారు. కొన్ని విషయాలు ఊహిస్తే చాలా బాగున్నాయి. 'ఆశుకవయిత్రి' గారితో తుపాకీ చేత్తో పట్టుకుని నుంచుంటే అసలయిన కార్సికన్‌లాగ ఉంటారు! ఆ కార్సికన్ ధోరణి మరీ అధికం అవుతుందా?

చాలా రాసేశాను. విసుగు పుడుతుందేమో! అధికారిగారు వెళ్ళి

41 వ పేజీ చూడండి

# కథ కాని కథలు

## వనమహోత్సవము

ఇంటరు చదివే రోజులవి. వనమహోత్సవాలు జరుపే పద్ధతి అప్పుడప్పుడేవచ్చింది. క్రిందటి సంవత్సరం లాగే మా కాలేజీలో ఆరోజు వనమహోత్సవం జరపాలని దానికి విద్యార్థులందరు హాజరు కావలెనని ప్రకటించారు. అందుకు అందరు హాజరయారు. ప్రిన్సిపాల్ గారు వనమహోత్సవం గురించి వ్యాఖ్యానించిన తరువాత, మొక్కను నాటడానికి బొటానికల్ గార్డన్‌కు వచ్చారు. మొక్క పట్టుకొని ఎక్కడ నాటవలెనని మా లెక్చరర్‌ను అడుగగా, అక్కడే వున్న తోటమాలి "సార్ పోయిన ఏడు మొక్క ఇక్కడనే నాటారు, అందుకని ఇవాళ కూడ ఇక్కడనే తయారు చేశా"నని విన్నవించాడు. అందరు అది విన్న వెంటనే నవ్వడం ప్రారంభించారు. పాపం మాలి బిక్క మొకం వేసుకొని చూస్తూ వుండిపోయాడు.

డి. పి. అప్పాజ్, (సికింద్రాబాద్)

* * *

## గురువుకి పంగనామం!

ఇది నేను యస్. యస్. యల్. సి. చదువుతున్నప్పుడు జరిగింది. ఆరోజే మా క్రొత్త తెలుగు మాష్టరు గారు మా స్కూలుకు వచ్చిరి. మాలో ప్రతివారికి ఆమాష్టరు గారెటువంటి వారో తెలుసుకోవాలని చాల ఉబలాటముగా వుంది. మొదటి పీరియడ్ మాకు తెలుగేగాబట్టి ఆ మాష్టరు గారు మా క్లాసుకే వచ్చారు. ఆ మాష్టరుగారు క్లాసులోనికి ప్రవేశించేటప్పుడు క్లాసులోని పోకిరొకడు హాలంతా ప్రతిధ్వనించేటట్లు కొంచెం హేళనగా "గుడ్ మార్నింగ్ సార్" అన్నాడు. దానికి మాస్టరు గారు చిరుకోపముతో "ఎవడురా వాడు?" అన్నారు. ఆపోకిరి ప్రక్కనున్న యింకొక పోకిరి "గురువుకి పంగనామం పెట్టేవాడు సార్?" అన్నాడు. అంత ఆ మాష్టారే మాత్రం తొణకకపోగా ధీమాతో "గురువుకి పంగనామము పెట్టక లఘువుకి పెడతార్రా పత్తీ చూస్తే నీకు వ్యాకరణ శాస్త్రము బాగా తెలుసల్లే వుందే?" అన్నారు. అందుకు క్లాసంతా నవ్వులతో ప్రతిధ్వనించింది. పాపం దానికా పోకిరి కుర్రాళ్ల ముఖాలు కుంచించుకపోయాయి. అయినా వారూ నవ్వ లేకుండా ఉండలేకపోయారు.

రాయుడు సులోచనాదేవి (చెరుకుపల్లి)

* * *

## "మీ పైవాళ్ళం"

అది నేను మూడవ ఫారము చదివే రోజులు దసరా సెలవలకి నేను, మా నాన్నగారు మా అక్కయ్యగారి ఊగ వెళ్తున్నాము మేము ఎక్కిన కంపార్టుమెంటులో ఇద్దరు పెద్ద మనుషులు అన్ని విషయాలు గురించి మాట్లాడు కొంటున్నారు. వారి మాటలు వినడానికి చాలా సరదాగా ఉన్నాయి. అందులో ఒక పెద్దమనిషి రెండవ వానితో, "మీ యింటి పేరేమిటండీ?" అన్నాడు ఆయన "మా యింటి పేరు బుర్రావారు", "మీ యింటి పేరేమిటి" అన్నాడు దానికి సమాధానంగా మొదటి పెద్దమనిషి, "మేము మీపై వాళ్లమండి" అన్నాడు అక్కడున్న ఒక స్టూడెంటు ఆశ్చర్యంతో "'పిలకా' వారా!" అని ప్రశ్నించాడు, అది వినగానే కంపార్టుమెంటులో ఉన్న వాళ్ళందరూ కడుపు చెక్కలయ్యేలా నవ్వుకున్నారు. ఇంతట్లోకి మొదటి పెద్దమనిషి దిగేవూరు వచ్చింది. ఆయన కోపంతో అందరినైపు చూస్తూ రైలుదిగి వెళ్ళిపోయాడు.

నందివాడ ప్రఫుల్లారాణి (కాకినాడ) ★




'ఇవాళే పిక్చర్ రిలీజ్ కదూ! అందుయా రద్దీగా వుంటుందని ఎవ్వరూ రాలేదు!...'




# జానకి డైరీ

ద్విభాష్యం సూరీడు

చదువుతున్న పుస్తకాన్ని మూసి, సీతాపతి రిస్టువాచీ చూచుకున్నాడు. ఫోంచేసి అరగంట పైగా అయ్యింది. జానకి ఇంకా వంటింట్లోనే ఏవో చప్పుళ్ళు చేస్తోంది. అప్పటికే రెండుసార్లు పిలిచి, విఫలుడయ్యాడు. చప్పుడు కాకుండా వెళ్ళి వంటింట్లోకి తొంగి చూచాడు. మహాలక్ష్మి పటంవద్ద ముగ్గులు పెడుతున్న జానకి అతనికి అపర మహాలక్ష్మిలా కనిపించింది.

"జానకీ !" అని మూడోసారి పిలిచాడు.

పిలుపుకు ఉలిక్కిపడ్డ జానకి, వెనక్కి తిరిగి చూచి నుదుటిపై పట్టిన చెమట ముంజేతితో తుడుచుకుంటూ, "వచ్చేస్తున్నానండీ ! ఫైవ్ మోర్ మినిట్స్ ! రేపు శుక్రవారంగదా ! అందుకనే కొంచెం ఆలస్యమయింది. !" అంటూ తిరిగి తన పనిలో మునిగిపోయింది.

సీతాపతి బుర్ర గోక్కున్నాడు. వెంటనే అతనికో వూహ తట్టింది. గిర్రున వెనక్కి తిరిగి, పడక గదిలోకి వెళ్ళాడు. వీణ ఒళ్ళో పెట్టుకుని 'విరహగీతి' ఆలాపించటం మొదలెట్టాడు "ఫైవ్ మినిట్స్ !" (అయిదు నిముషాలు) అన్న జానకి, రెండు నిముషాలు కాకుండానే అతని ఎదుట ప్రత్యక్షమయింది. ఆమెను చూచి కూడా చూడనట్లు నటించి, అతను వీణ వాయించుతూనే కూర్చున్నాడు. చేతిలో ఉన్న మంచినీళ్ల కూజా బల్లమీద ఉంచి, అతని కెదురుగా కూర్చుంది జానకి.

"కోపమా ?" అతని ముఖంలోకి జాలిగా చూస్తూ అడిగింది.

సీతాపతి బిర్రబిగుసుకు పోదామని ప్రయత్నించాడు.

"లేదు రేపునాకు సంగీతం మాస్టారు వస్తారు. నన్ను పాడుకోనీ !" అన్నాడు బింకంగా.

జానకి "మరి వెళ్తానయితే !" అంటూ లేవబోయింది. తబ్బిబ్బయిన సీతాపతి, ఒక్కసారిగా, వీణ నాపుచేసి, ఆమె చెంగును పట్టుకున్నాడు. సిగ్గుతో ఆమె వెనుకకు చూచింది.

"నిన్నటిపాట ఇంకొకసారి వినిపించవా ?" అంటూ వీణ చేతికిచ్చి, మంచంమీద కూర్చున్నాడు.

"నిన్నటి పాట" అనుకుని, గుర్తుకు తెచ్చుకుని, ఆ పాటలో లీనమై, పాట పూర్తిచేసి, "ఎలా ఉంది ? నిన్నటిలా వచ్చిందా ?" అంటూ మంచంవైపు చూచింది. అప్పటికే సుఖ నిద్రలోనున్న సీతాపతిని చూచి, తన పాట అతనికి లాలి పాట అయినందుకు ఆమె నవ్వుకుంది వీణను వారగా పెట్టి మంచం పక్కనున్న కిటికీ చెంతకు వెళ్ళి కూర్చుంది. 'నైట్ క్వీన్' తన ప్రభావాన్ని చూపిస్తూ సువాసనలు వెదజల్లుతోంది. బయట వెన్నెల పిండారబోసినట్లుంది. జానకి తన చూపు లను చంద్రుని మీంచి, సీతాపతి మీదకు మళ్ళించింది. చంద్రుని వెండి వర్షంలో, అమాయకంగా నిద్రిస్తున్న సీతాపతిలో ఆనాడామెకు క్రొత్త అందం కనుపించింది—

ఆ ప్రశాంత వాతావరణంలో ఆమె మనస్సు గతంలోకి చొచ్చుకొని పోయింది. .

....కాలేజీ రోజుల్లో తాను చేయబోయిన పొరపాటును భగవంతుడు క్షమిస్తాడని కాని, తనకు ఇంత మంచి వ్యక్తిని భర్తగా ప్రసాదిస్తాడని కాని, ఆమె ఎన్నడూ వూహించలేదు— సీతాపతి— తనపట్ల నిజంగా సీతాపతే ! !

....చప్పుడు కాకుండా వెళ్ళి, బీరువాన, తెరిచి, చీరల మధ్య ఉన్న పాతడైరీని తీసికొని

తన మంచంవద్దకు వెళ్లింది. గదిలో లైటు ఆర్పివేసి, మంచం దగ్గరగానున్న టేబుల్ లైట్ వేసుకుంది. చేతిలో నున్న డైరీకేసి చూచుకుంటూ. మంచంపై వాలింది.

డైరీ — డైరీ మనస్సుకు ప్రతిబింబం. ఆమె ఎన్నోసార్లు ఆ డైరీని చించి తగులబెట్టాలనుకున్నా, ఏదో మనోశక్తి ఆమె నాపుచేసేది. ఈసారి తప్పకుండా చించుదామనుకుంటూ ఎప్పటికప్పుడే వాయిదావేస్తూ వచ్చింది. డైరీలో పేజీలు తిప్పుతున్న ఆమె చేతులు ఒక పేజీ దగ్గర ఆగిపోయాయి — ఆవేశపూరిత హృదయంతో అలా ఎన్ని పేజీలు చదివిందో, ఎప్పుడు నిద్రాదేవత వడిలోకి జారిపోయిందో.... మెలకువ వచ్చేసరికి మాత్రం అలారమ్ టైమ్‌పీస్ 'గణగణ' లాడుతోంది.

జానకి ఉలిక్కిపడి లేచింది. అప్పుడే స్నానం చేసి వస్తున్న సీతాపతి ఆమెను చూచి చిన్నగా నవ్వుతూ, "ఏమైనా పీడకల వచ్చిందా ? అంత కంగారుగా లేచావేం ?" అన్నాడు.

"ఏమీలేదు. మీ రెంతసేపయి లేచారోనని భయపడ్డాను." అంది జానకి తత్తరపాటును సవరించుకుంటూ.

"ఆ మాత్రం దానికే అంత భయపడాలా జానకీ ? ఈ రోజు ఆఫీసుకు త్వరగా వెళ్లాలి ! నిన్ను లేపడం ఇష్టంలేక "స్టవ్" కూడా అంటించుకున్నాను. మిగతాపని పూర్తిచేసి కాస్త కాఫీ పట్టుకువస్తావా ?" అంటూ పక్కగదిలోకి వెళ్లిపోయాడు. ప్రక్కమీదనున్న డైరీ చూచి, ఏమి చేయాలో తెలియక, ఎదురుగానున్న పుస్తకాల అరలో కుక్కేసి, వంటింట్లోకి పరుగెత్తింది జానకి

కాఫీతో తిరిగి వచ్చేసరికి, బూటుకూడా వేసుకొని, సిద్ధంగా ఉన్న సీతాపతి అద్దంలో చూస్తూ టై సవరించుకుంటున్నాడు. "గుడ్ !" అంటూ కాఫీ తీసుకు తాగేసి, బుక్ షెల్ఫు వద్దకు వెళ్లాడు.

జానకి గుండెల్లో రాయిపడింది.

పరధ్యానంగా పుస్తకం అరలో నుంచి కొన్ని పుస్తకాలు తీసుకున్న సీతాపతి, వాచివైపు చూచుకొని "టైమయింది. మరినేవస్తా జానకీ !" అంటూ మేడమెట్లు దిగాడు.

ఒక్క గెంతులో జానకి పుస్తకాల అరవద్దకు వెళ్లింది. 'డైరీ' సీతాపతి తీసుకెళ్లిపోయాడు. ఆమె కళ్లు చిమ్మ చీకట్లు కమ్మాయి. ఆ నాటి అతని ప్రవర్తన ఆమెకు ఎందుకో వింతగా కనుపించింది. ఆమె డైరీని అతడు కావాలని తీసుకు వెళ్లాడేమోనని భయపడింది— డైరీ— చదివితే!. ...

కారుతున్న కన్నీళ్లను తుడుచుకుంటూ, మంచంమీద కూలబడింది. ప్రశాంతంగా జరుగుతున్న తన జీవితంలో తానే నిప్పుపెట్టుకున్నట్లుంది. పాడు డైరీని తగులబెట్టైనా ఉండవలసింది. డైరీలోని అతిముఖ్యమైన పేజీలోని విషయం అతడు చూస్తే ఇంకేమైనా ఉందా ! ఆ విషయం ఆమెకు గుర్తుకు వచ్చింది.

—ఆ నాడు ప్రభాత సమయం— అలారమ్ మ్రోగగానే చదువుకుందామనిలేచి టేబుల్ లైట్ వెలిగించింది— దురాన్నుంచి పాటసన్నగా వినిపిస్తోంది. చదువుదామని తీసుకున్న పుస్తకం చేయిజారిపోయింది. మనసు పాటవైపు మ్రొగ్గింది తనకు తెలియకుండానే కాళ్లు గదిదాటి బయటకు వచ్చేశాయి. అలాగని ఆమెకా గానం క్రొత్తగాదు. తనను మైమరపించే శక్తి ఆ పాటలో ఉందో, లేక, 'మధుసూధనరావు'కే ఉందో ఆమెకు తెలియదు. దూరాన్న కనుపిస్తున్న మధుసూదనరావు ఆమె కన్నులకు 'మధుసూదనుడు'లా కనుపించాడు. కాలేజీ ఆటస్థలంలో చివ్వరగా ఉన్న చెట్టుక్రింద భూపాల్‌రాగాన్ని అతి మనోహరంగా ఆలాపిస్తున్నాడు. హస్తాద్రిని చేరుకుంటున్న చందమామ నిశ్చేష్టుడై అతని గానాన్ని వింటున్నాడు. తను మెల్లిగా వెళ్లి ప్రక్కన నిలబడింది. అతను వులిక్కిపడి పాట నాపుచేసి "అరే ! ఇలా వంటరిగా వచ్చావేం జానకీ ?" అన్నాడు. తనకు ఏమని మాట్లాడాలో తెలియలేదు. మవునంగా వెళ్లి అతనికి ఎదురుగా కూర్చుంది. ఒక్కక్షణం నిశ్శబ్దం రాజ్యం చేసింది —జానకి గొంతు సవరించుకొంది.

"ఆ నాడు సంగీత సభ— నీగానం— నన్ను పిచ్చిదాన్నిగా చేసింది. సంగీత మూర్తి వయిన నీవే నా జీవితాధారం కావాలనుకొన్నాను. తరువాత ఎన్నిసార్లు నిన్ను కలుసుకున్నా, ఎంతసేపు నీతో మాట్లాడినా నీ వింత ప్రవర్తనను చూచి నీతో ఈవిషయం చెప్పడానికి భయపడేదాన్ని. ఆ సమయం ఇప్పుడు వచ్చిందని సంతోషిస్తున్నాను." అని తన మనోభావాన్ని వ్యక్త పరచింది. మధుసూదనరావు ఉలిక్కిపడ్డాడు. అతని ముఖం వెలవెల బోయింది. దీర్ఘంగా రెండు నిముషాల పాటు క్రిందకు చూస్తూ ఏదో ఆలోచించి, తడబడుతూ అన్నాడు. "జీవితం అంతకీ ముఖ్యమయిన ఈ విషయం నిర్ణయించుకోడానికి నీవు కొంత గడువు ఇవ్వాలి. సాయంత్రం ఆరు గంటల కల్లా గాంధీ పార్కులో మళ్లీ కలుసుకుందాం." తను నిశ్చేష్ఠురాలయింది. మధుసూదనరావు ప్రవర్తన తన మనసును కలవర పరచింది. అతనితో ఇంకేమీ మాట్లాడలేక పోయింది. అప్రయత్నంగా, ఇద్దరూ హాస్టల్‌వైపు నడిచి పోయారు. ఆనాటి సాయంత్రం పార్కులో జరిగిన సంఘటన— నాటినుండి డైరీ రాయడమే మానుకుంది—

—జానకి బరువుగా నిట్టూర్చింది.

—పార్కులో జరిగిన సంఘటన— మిగిలిన విషయాలూ కూడా రాసి ఉంటే, ఈనాడింత కలవరపడవలసి ఉండేదికాదేమో ! ఇంతకూ తను భయపడ్డమేకాని, సీతాపతి డైరీ ఏ ఉద్దేశ్యంతో తీసుకెళ్లాడో-- ఇతరుల ఉత్తరాలను, డైరీలను చదివే అలవాటు సీతాపతికిలేదు— అయినా తన డైరీయేకదా నని చొరవచేసి చదివితే ?—

—ఏమో ! విధికృతాన్ని మార్చడం ఎవ్వరికీ చేతకాదు. తాను అదృష్టవంతురాలైతే సరేసరి. లేకపోతే

* * *

అప్పటికే రెండుసార్లు మేనేజరుతో ఘర్షణపడ్డ సీతాపతి, మూడవసారి మేనేజరుగారు పిలిచారనేసరికి మండి పడ్డాడు. చేసేదిలేక కావలసిన ఫైలు తీసుకొని మేనేజర్ రూమ్‌లోకి వెళ్లాడు. ఎవరో చేసిన తప్పును తనపై రుద్దడానికి ప్రయత్నిస్తున్న మేనేజర్‌కి ఎలా సమాధాన మివ్వాలో అర్థంకాక తికమక పడుతున్నాడు. ఇంతలో టెలిఫోన్ గణగణ మ్రోగింది. రిసీవర్ని ఎత్తి, 'హలో' అన్న మేనేజరు 'సీతాపతి కావాలా ?. ఒక్క నిముషం !' అంటూ సీతాపతి కందిచ్చాడు. అవతల మాట్లాడే వ్యక్తికి మేనేజర్ ఎదురుగుండా ఎలా సమాధానం ఇవ్వాలో తెలియలేదు. సీతాపతి ముఖం కందగడ్డలాగయింది. 'ఆలస్యమయింది క్షమించండి పంపిస్తాను !' అంటూ ఫోన్ పెట్టేశాడు. తప్పు దొరికితే చాలు పట్టుకుందామని చూస్తున్న మేనేజరు "ఆఫీసు విషయమా ?" అంటూ సీతాపతి వైపు చూచాడు. సీతాపతి కోపాన్ని ఆపుకోలేక పోయాడు. "కాదు, స్వవిషయం! పూర్తిగా నావిషయం" అంటూ చరచరా బయటకు వచ్చేశాడు.

ఎప్పుడూ శాంతమూర్తిలా కనుపించే సీతాపతి, కోపంగా ఏదో రాసుకుపోతూంటే, డిపార్టుమెంటులోని వాళ్లంతా కళ్లప్పగించి చూస్తున్నారు. తను వ్రాసిన చీటిని మడతపెట్టి ప్యూనును పిలిచాడు సీతాపతి. 'ఇంటికెళ్లి అమ్మగారికిచ్చెయ్యి.' అంటూ చీటి అతని చేతికిచ్చాడు. 'టైమప్పుడే రెండయిపోతోంది. ఈ పూట భోజనానికి రానని చెప్పు.' అన్నాడు చేతివాచి చూసుకుంటూ.

* * *

రోజూ పన్నెండు గంటలకే భోజనానికి వచ్చే సీతాపతి ఆ రోజున మధ్యాహ్నం రెండు గంటలైనా రాలేదు. జానకి దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది. భారంగా నిట్టూర్చి మంచంమీద కూలబడింది. ఇంతలో మేడ మెట్లమీద చప్పుడయేసరికి, కొంచెం ముఖకవళికలు మార్చుకొని తలుపు తెరుద్దామని హాలులోకి వెళ్లింది. సీతాపతి బదులు ఆఫీసు ప్యూను ఎదురయేసరికి భారంగా తలుపు తీసింది. గబాలున అతని చేతిలో చీటి లాక్కుంది. అతడు చెప్పేది పూర్తిగా వినకుండానే పడక గదిలోకి వెళ్లి, చీటి ఆతురతగా విప్పింది.

"జానకీ ! పొరపాటు చేశావు. నీవు చేసిన పనికి మేనేజర్ ఎదురుగా అవమానం పొందవలసి వచ్చింది. మొన్న ననగా చెప్పాను ఆ ఫాన్సీ స్టోర్స్ వాడికి డబ్బు చెల్లించమని. ఇంతవరకూ నీ వెందుకియ్యలేదో అర్థం కావటంలేదు. వెంటనే వెళ్లి డబ్బు చెల్లించు !"

జానకి కంటి వెంట గిరుక్కుని నీళ్లు తిరిగాయి. అయితే సీతాపతి డైరీ చదివాడన్నమాట!!! సీతాపతి డైరీ చదివి తనను నిజంగా అపార్థం చేసుకుంటే తిరిగి అతని మనసెలా మార్చాలో అర్థం కాలేదు. మెరపులా ఒక ఆలోచన తట్టింది తాను ఒక కథలో వ్రాసిన సన్నివేశాలను ఆ డైరీలో వ్రాసుకుందంటే నమ్ముతాడేమో ? హృదయంలో చెలరేగుతున్న పెనుతుఫాను ఒక్కసారిగా తగ్గిపోయింది. తాను కాపురానికి వచ్చిన తొలిరోజుల్లోనే, తనకూ సీతాపతికీ మధ్య జరిగే తీయని సంభాషణల్లోనే, తన పొరపాటును అతనితో చెప్పి ఉంటే సీతాపతి మనసారా తనను క్షమించి ఉండేవాడు. ఆ నాడు నిజాన్ని అతని నుండి కప్పిపుచ్చింది కనుకనే ఈనాడింత కలవర పడవలసి వచ్చింది. మనసు ప్రశాంతత నవలంబించింది. ఫాన్సీస్టోర్స్‌లో డబ్బు చెల్లించి, ఇంటికి వచ్చి

38 వ పేజీ చూడండి

## నా అనుభవంలోకెల్లా పెద్దపరిశోధన - 20

# అంతు దొరకని హత్య

### కెప్టెన్ బ్రూస్ సల్లివాన్ (న్యూయార్క్ - యు. యస్. ఏ.)

(గత సంచిక తరువాయి)

ఇలాటి విషయాలు పనీపాటా లేనివాళ్లకి వినోదంగా ఉంటాయి. పైగా అంతా అందమైన ఆడవాళ్ల మయం. బాగానే ఉంది. కానీ మాకీ హత్యానేరాన్ని పరిశోధించే బాధ్యత ఒకటి ఉంది కదా !! హంతకుణ్ణి వెతికి పట్టుకునే కర్తవ్యం ఒకటి ఉంది. నిద్ర, విశ్రాంతి లేకుండా యిరవైనాలుగు గంటలు పనిచేసినా, హతుని గురించి గాని, హత్య కిరణం గురించి గానీ, హంతకుని గురించి గాని, పీసమంతైనా తెలియలేదు.

మా పద్ధతి ప్రకారం దర్యాప్తు ప్రారంభించాము. మా సిబ్బందీ — న్యూయార్కులో ఉన్న నాట్యకత్తెల యిళ్లు సోదా చేసింది. టాక్సీ డ్రైవర్లను, రాత్రి వినోదాలలో మునిగి తేలే వారిని, తెల్లముఖం వేసుకుని తిరిగేవారిని అనుమానించదగిన వాళ్లలా కనుపించిన ప్రతీ వ్యక్తినీ కలుసుకుని ప్రశ్నల వర్షం కురిపించింది (మా సిబ్బంది) కాని, గ్రహించిన విషయం మేమిది వరకు గ్రహించిన విషయానికి చేరింది. మేమిది వరకు గ్రహించిన విషయం పూర్ణానుస్వారం. ఇపుడు చేరిన విషయం ఆ పూర్ణానుస్వారాన్ని బలపరచిం దన్నమాట !!

ఆఫీసులో కుర్చీలో కూర్చుని 'అసలు సెర్జ్ రాబిన్‌స్టెన్‌కి అంతమంది ఆడవాళ్లిలా 'దాసాను దాసు లయ్యారా' అని అబ్బురపడుతుండగా ఫోను గణగణ లాడింది. లేచి, ఫోనందుకున్నాను.

నా చిరకాల మిత్రుడైన పోలీసు రిపోర్టర్ గొంతు ఆనవాలు కట్టాను. "ఆట్టే ఆనందకరం కాని విషయం ఒకటి తెలిసింది. స్మశానంలో సెర్జ్ మీద వెయ్యడానికని పెట్టిన పూలపోగు వెనక దాక్కుని నే నొక విషయం విన్నాను. అతని తల్లి, పెదతల్లీ మాట్లాడుకున్నారు" అన్నాడు.

"మిస్టర్ జాన్ : నేను భోజనానికి 'లిండి'కి వస్తాను. అక్కడ వివరంగా మాట్లాడుకుందాము" అని, బయల్దేరాను.

చిన్న చిన్న అవరోధాలు ఒక ఇరవై, కొంచెం పెద్దవి యాభై తప్పించుకుని, ఆ రోడ్లవెంట పరుగెత్తి, అతన్ని కలుసుకున్నాను. బ్రాడ్వేలో ఒక నృత్యశాలలో ఒక గదిలో కూర్చున్నాము.

"అసలేం జరిగిందంటే" అని ప్రారంభించాడు.

"—ఆ ముసలావిడ నన్ను గమనించలేదు. నేను ఎర్రటి గులాబీల పోగు వెనుక దాక్కున్నాను. జనవరి నెలలో న్యూయార్కులో గులాబీ లెంత ముమ్మరంగా లభిస్తాయో మీకు తెలుసు కదా ! సరే అక్కడ అప్పా చెల్లెళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నారు" అని తిరిగి, అక్కడ వాళ్ళు మాట్లాడుకున్నది చెప్పాడు.

ఆ రాత్రి రాబిన్స్టిన్ తల్లి నాటకం నుంచి వచ్చేసరికి లిఫ్ట్‌లో లైటు లేదట. అలాగ కనుక లేకుండా ఉంటే సెర్జ్ రాబిన్స్టిన్ ఎవరితోనో మాట్లాడుతున్నాడని, తన ఆంతర్యానికి అంతరాయం కలిగించ కూడదని, దాని భావంట! అందుకని ఆమె తన కొడుకును చూసి, "గుడ్ నైట్' అని చెప్పకుండానే తన గదిలోకి వెళ్ళి పడుకుందిట. తరువాత సుమారు ఒంటిగంట ప్రాంతంలో ఏవేవో అరుపులు, మొగ గొంతులు వినిపించి అతని రూముకు వెళ్ళి ఏమీ తేలక, అదేదో పీడకల అని సరిపెట్టుకుందట !

ఈ విషయం ఆమె తన అక్కగారితో చెప్పి "ఇంతవరకూ మరో ప్రాణికి చెప్పలేదు సుమా !" అని చెప్పడం జాన్ విన్నాడట.

* * *

భోజనం ముగించుకుని, రాబిన్‌స్టెన్ భవనానికి వెళ్ళాము. ఆమెను పఠన మందిరంలో కలుసుకున్నాము. "ఓహో మీరా !" అంటూ అతి కష్టంమీద ఆమె కుర్చీలోంచి లేచింది.

"నేను మానసికంగా చాలా దెబ్బతిన్నాను. నిలదొక్కుకోలేకపోయాను. ఆనాడు పోలీసులకు ఏం చెప్పాలో నాకే తెలీదు." అంది.

"అది సరే ! పోలీసులకు మీరారోజున చెప్పని విశేషా లేవైనా ఉంటే ఇప్పుడు చెప్పండి" అన్నాను.

ఆమె కళ్ళు మెరిశాయి.

"ఉంది : గోధుమ వర్ణం దుస్తులు వేసుకున్న ఒక యువతి నాలుగో అంతస్తునుంచి మూడో అంతస్తుకు లిఫ్ట్‌లో దిగడం చూశాను. ఆ నాడు నాకీ విషయం చెప్పాలని తోచలేదు పైగా సెర్జ్ కోసం ఆడవాళ్ళు రావడం అనేది కొత్త విషయమేమీకాదు" అని చెప్పింది.

ఆనక ఆమె అక్క ఎజెనాని కలుసుకున్నాము. ఆమె మరో కొత్త కథ చెప్పింది. "రాత్రి ఒంటి గంటకి నేను లేచాను. నా గదిలో లైటు ఎవరో వేశారు. కళ్ళు తెరచేసరికి గోధుమ వర్ణం దుస్తులు ధరించిన ఆమె (ఎవరో ?) కనిపించింది. అంతే నన్ను చూసి ఏమీ మాట్లాడకుండా ఠక్కున లైట్లార్పేసి, అంతర్థానమై పోయింది" అని ఆవిడ చెప్పింది.

ఇది మరో సమస్యగా తయారయ్యింది. ఈ గోధుమ రంగు దుస్తులు స్త్రీ ఎవరో??

'నివోలారూ' నుండి సెర్జ్‌ని, ఎస్టిల్‌ని, సెర్జ్ భవనంలో దిగవిడచిన టాక్సీ డ్రైవరు 'ఎర్నెస్టోలా మేడికా'ని కలుసుకున్నాను. అతను వారిని దిగవిడిచినపుడు టైము సుమారు ఒంటి గంట అయ్యిందని చెప్పాడు. పైగా ఎస్టిల్ వేసుకున్న

35 వ పేజీ చూడండి

'ఏమిటండీ! మీ బియ్యంలో రాళ్లు...ఏరేందుకు కష్టంగా ఉంది.'
'అదేవిటిసార్! ఏరేందుకు సులువుగా నల్లరాళ్ళు కలిపానుగా.'

## గ్రహస్థితి

మిథునంలో రాహువు, సింహకన్యలలో బుధుడు, కన్యలో సూర్యుడు, కన్యతులలో శుక్రుడు, తులలో అంగారకుడు, ధనస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, మీనమేష వృషభ మిథునాలలో చంద్రుడు.

**4-10-1963 శుక్రవారము మొదలు**
**10-10-1963 గురువారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

వ్యవహార రంగంలో ఒక్కొక్క ఘట్టంలో శ్రమపడి ఫలితం పొందగలుగుతారు. ఆదాయమును మించిన ఖర్చులు ఉంటవి. పదిమందిలో గౌరవం లభిస్తుంది. పెద్ద మొత్తాలలో ధనం వినియోగించవలసిన అవసరం ఏర్పడుతుంది. ఈ సమయంలో నౌకరులతో చిన్నచిన్న తగాదాలు వస్తుంటవి. "తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టే" రకం మనుష్యులవలన మనశ్శాంతి లోపిస్తుంది. ప్రయాణాలు చేయగలుగుతారు. క్రొత్త ప్రయత్నాలకు తగినంత ఉత్సాహం కలుగదు. కాని, కార్యరంగంలో ప్రవేశించక తప్పదు. వ్రాతలలో పొరపాట్లు రాగల సమయం. 8, 9 తేదీలలో ఆదుర్దా కలిగే సంఘటనలు కార్యభారము.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

స్నేహము, స్వతంత్రము మొదలయిన విషయాలలో మితంగా ఉండటం అవసరం. ఎదటివారి నిష్ఠూరాలను సహించుకొనవలసిన సమయం. అధికారులను కలుసుకొనటం వంటి పనులు అనుకూలించవు. బంధుమిత్రులకు మాట చెప్పిన ప్రకారం ఖచ్చితంగా జరుపలేకపోతారు. మంచి మాటలతో మిమ్ములను నిర్బంధించినట్లుగా ప్రవర్తించే వారు తటస్థ పడతారు. ప్రస్తుతం ఆదాయం కూడా సంతృప్తిగా కనుపించదు. పిల్లల అనారోగ్యాదికారణాలు చికాకును కలిగిస్తవి. వ్యవహారాలలో మంచితనం అవసరం. గౌరవం లభిస్తుంది. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి. 4, 5 తేదీలలో కారణం తెలియని ఆందోళన, సంచారము.

* * *

### మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఈ సమయంలో ఏ పని జరిగినా ముందుగా ప్రయత్నం అనేది ఉండదు. దైవానుగ్రహం వల్ల పదిమందియొక్క మంచితనము, ఆదాయము, ప్రశాంతముగా కార్యం నెరవేరే అవకాశము లభిస్తవి. బంధువులు వస్తారు. సుఖ సంతోషాలతో కాలం జరుగుతుంది. అయితే దేహం అసౌఖ్యంగా ఉన్నదనే అసంతృప్తి మాత్రం తోస్తుంది. మీవలన సహాయం పొందుటకు ఎదురుచూచేవారుంటారు. ఒకటి రెండు సమయాలలో ఇతరుల వ్యవహారాలలో తలదూర్చవలసి వస్తుంది. అకస్మాత్తుగా వస్తువులు పోగల సమయం. తగినంత కారణం లేకపోయినా ఉద్రేకపడతారు. 5, 6 తేదీలలో ధనలాభం. దైవకార్యాలు.




**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

శ్రమ కనుపిస్తుంది. ఇతరులమీద అధికారం చెలాయించ తగిన సమయంకాదు. కుటుంబంలో సుఖ సంతోషాలు లభిస్తవి. అధికారులవల్ల మేలు కలుగుతుందనే ఆశ పెట్టుకోవద్దు. ఆర్థిక స్థితి బాగుంటుంది. మిమ్ములను గురించి అపవాదులు ప్రచారం కాదగిన సమయం. అప్పులు కొనటం వంటి పనులలో సంతృప్తికరంగా ఉండదు. మీ యోగక్షేమాలు విచారిస్తూ మీ కార్యక్రమాలకు ఇబ్బంది కలిగించేవారు ఉంటారు. వ్యాపార వృత్తులలో ఫలితంకన్నా కష్టమే అధికంగా ఉంటుంది. వారాంతంలో అయినవారివల్ల మీ గౌరవానికి భంగం కలిగేటట్లు తోస్తుంది. 6, 7 తేదీలలో కార్యసిద్ధి.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

బాహ్య విషయాలలో చాలా దర్పంగా జరుగుతుంది. మనశ్శాంతి మాత్రం తక్కువ అనే చెప్పాలి. కొన్ని సమయాలలో సాహసంతో కూడిన ఆలోచనలు చేస్తారు. ప్రసంగాలలో హెచ్చు తగ్గులు రాగల అవకాశాలున్నవి. అయితే దైవానుగ్రహం వల్ల మీ అంతస్తును కాపాడుకొంటారు. కుటుంబంలో అనారోగ్యాలు, అభిప్రాయభేదాలు మీ ఓర్పును పరీక్షించగల సమయం. దూరమందున్న బంధుమిత్రుల వద్ద మంచి సంతోష వార్తలు తెలుస్తవి. వృత్తిలో శ్రమ పెరుగుతుంది. ఒక సందర్భంలో ఇతరుల సలహా, సహాయములను వినియోగించుకోలేకపోతారు. 7, 8 తేదీలలో శుభవార్తలు, ధనవ్యయం.

## ఈ వారము ధరలు

పసుపుధర పెరిగే అవకాశమున్నది. వేరుశనగపప్పు ధర మందీ అవుతుంది. నూనెధర మామూలుగా ఉంటుంది. కర్పూరము ధర ముందు పెరిగి తగ్గుతుంది. మిర్చిధర నిలకడగా ఉండదు.

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ఈ సమయంలో తరచు శత్రుభయం కనుపిస్తుంది. భాగస్తులతో కలసి చేయుపనులలో కార్యనిర్ణయం అవతలివారికి విడవటం అవసరం. ఏ సమయంలో ఎటు మొగ్గుతారో తెలియని స్నేహితులవల్ల బాధపడవలసి వస్తుంది. ముందు ఫలితం వూహించటానికి అవకాశం లేని సాహసమైన పనులలో దిగవద్దు. పైకి గొప్పగా కనుపించే సంఘ కార్యాలలో సంబంధం ఏర్పడుతుంది. ప్రతివిషయాన్నీ తీవ్రంగా యోచించగలరు. కాని, ఒక నిర్ణయం చేయలేకపోతారు. ఆదాయం బాగానే ఉంటుంది. అయితే ఖర్చులు తప్పించుకొనటానికి వీలుకాని బాధ్యతలు పెరుగుతవి. 9, 10 తేదీలలో అపవాదులు, కార్యభంగం.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ఈ సమయంలో పట్టుదల అవసరం. కాని పని అంటూ ఉండదు. అయితే పోటీని ఎదుర్కొనవలసి ఉంటుంది. అధికారులను మెప్పించ గలుగుతారు. వృత్తి వ్యాపారాలలో దైవికంగా ఏర్పడే సమస్యలను సమర్థించుకొని గౌరవం దక్కించుకొన గలుగుతారు. ఎంత ఆదాయం వచ్చినా ఖర్చులు ఎదురుచూస్తూ ఉంటవి. ప్రస్తుతం స్నేహితులు మీకు అనుకూలించక పోవచ్చు. ఏ సందర్భంలోనైనా ముందు జాగ్రత్త, రహస్యము కాపాడుకొనటము అవసరం. వారం రెండవ భాగంలో మీవల్ల పనులు జరుపుకొని తప్పుకొని తిరిగేవారు ఉంటారు. దైవకార్యాలు సుఖంగా జరుగుతవి. 9, 10 తేదీలలో బంధు విరోధం. వృత్తిలో అలసట, సంచారము.

* * *

### వృశ్చికం :

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

మనోధైర్యం బాగుంటుంది. పదిమందిలో మెప్పు పొందతగిన కాలం. కొన్ని సమయాలలో శక్తికి మించిన పనులను ఆరంభించ గలుగుతారు. అధికారులతో కలహాలు వచ్చి సర్దుబాటు అవుతవి. అకస్మాత్తుగా తెలియని పనులలో ప్రవే

శించి దండగ ఖర్చులను భరిస్తారు. బంధువులను గురించి దుర్వార్తలు తెలుస్తవి. వృత్తిలో సాధారణమైన అభ్యంతరాలు ఎదురు వస్తూంటవి. కాని, ఎక్కడికక్కడ క్రొత్త మార్గాన్ని అనుసరిస్తూ ముందుకు పోగలుగుతారు. అగ్ని, ఆయుధాలు మొదలయినవాని విషయంలో జాగ్రత్తగా ఉండండి. ఈ సమయంలో స్నేహితులు వృద్ధి అవుతారు. 8,9 తేదీలలో మనస్సులో అలజడి, వృథా ప్రయత్నాలు.

*   *   *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ సమయంలో సుఖం ఉండదు. ఆరంభించిన పనులను త్వరగా తెముల్చుకొనలేకపోతారు. వృత్తి ఉద్యోగాలలో మామూలు నడకకు భంగం ఉండదు. మిమ్ములను దూషించేవారు, భూషించేవారు కూడా ఉంటారు. అయితే వారిని లెక్కకు తీసుకొని మీ ఆలోచనలను, ప్రయత్నాలను మానుకోవద్దు. సంఘంలో పలుకుబడి పెరుగుతుంది. స్నేహితులకు సహాయం చేయ గలుగుతారు. ప్రయాణం చేయుగల అవకాశాలున్నవి. మీవల్ల జరిగే చిన్నచిన్న పొరపాట్లు కూడా మనస్సుకు బాధాకరంగా తయారవుతవి. బంధువులవల్ల నిష్ఠురాలు వస్తవి. అప్పులు పెరగకుండా చూచుకొనండి. 7, 8 తేదీలలో అసౌఖ్యం, ధనలాభం.

*   *   *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా., శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

వృత్తిలో మీరు ప్రయత్నం చేసినా ముందుకు సాగుతూ మధ్యమధ్య మెలికపడుతూ ఉంటుంది. విలువగల వస్తువులమీద ధనం వెచ్చించి సమయంలో బాధపడతారు. ఆదాయం బాగుంటుంది. లాభవార్తలు తెలుస్తవి. గొప్పగొప్ప ఆశలు చూపి మిమ్ములను నమ్మించటానికి ప్రయత్నించే వారు ఉంటారు. ఈ వారం పిల్లల అనారోగ్యాలవల్లను, మితి మించిన ఖర్చులవల్లను తరుచు నిరుత్సాహం కలుగుతుంది. శుభకార్య ప్రయత్నాలు కొంత వరకు అనుకూలించినట్లే కనుపిస్తవి. కోర్టు కచేరీలలో ప్రతిబంధకాలు అధికం అవుతవి. 6, 7 తేదీలలో మంచివారితో స్నేహం, శ్రమ వలన కార్యసిద్ధి.

*   *   *

## కుంభం :

**(ధనిష 3, 4 పా., శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

గ్రహస్థితి బాగున్నది. వృత్తిలోను బంధు మిత్రులలోను గౌరవం పెరుగుతుంది. సమయంలో నిష్కర్షగా మాట్లాడ గలుగుతారు. ఇతరులకు న్యాయం చేకూర్చే నిమిత్తం బాధ్యతలు పైన వేసుకొంటారు. మీ ఆరోగ్యం అంతగా బాగుండదు. ప్రత్యక్షంగా చిక్కులు ఏమీ లేక పోయినా మనస్సులో అనేక ఆలోచనలు వస్తూ ఉంటవి. పుణ్యకార్యాలు నెరవేరుతవి. ప్రయాణాలు అనుకూలిస్తవి. మొదట కొంత అసంతృప్తి కనుపించినా మీ పనులకు భంగం లేకుండా ధన సహాయం లభిస్తుంది. వారాంతంలో దేహ అసౌఖ్యం కనుపిస్తుంది. వృత్తిలో మార్పులు, 5, 6 తేదీలలో సంతోషవార్తలు, వస్తు నష్టము.

*   *   *

## మీనం:

**(పూ. భాద్ర 4 పా., ఉ. భాద్ర, రేవతి.)**

ఈ వారంలో అప్పుడప్పుడు శత్రుభావం ఎదురు పడుతు ఉంటుంది. గౌరవం నిలుపుకొంటారు. సంఘ కార్యాలలో వ్యయ ప్రయాసలు ఉంటవి. సుఖంగా ఉండటానికి వీలుకాదు. ఎప్పుడూ ఏదో ఒక కార్యక్రమం కనిపిస్తూ ఉంటుంది. వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. విలువగల వస్తువులు కొంటారు. కుటుంబంలో తలపెట్టిన కార్యక్రమాలు మధ్యలో నిలిచి ఉంటవి. వ్యవహార రంగంలో చురుకుగా యోచించలేక పోతారు. ఇతరులవద్ద నుంచి ఎదురు చూస్తున్న ధనం లభిస్తుంది. ఒక సమయంలో మీకు అనుకూలంగా మాట్లాడిన వారే మిమ్ములను నిరుత్సాహ పరుస్తారు. 4, 5 తేదీలలో ఆదాయవృద్ధి, సంతోషవార్తలు. 






ప్రపంచంలో కొన్నిచోట్ల అనావృష్టివల్ల ఎడారులు ఏర్పడితే మరికొన్నిచోట్ల అతివృష్టివల్ల వరదలువచ్చి, అనేకమంది జనులు బాధ పడుత్త్నారు. ఈ అతివృష్టి మేఘాల్ని ఎడారులవైపు తోలేస్తే బాగుండునని అనిపిస్తుంది. కాని, ఆ విషయం సృష్టికర్త చెవిని వేసేందుకు ఎవరికీ శక్తిలేకపోవడంవల్ల, ఎడారులు అలాగే ఎండి పోతున్నాయి. సృష్టిలో ఇటువంటి లోపాలు చాలా ఉన్నాయి. ఒక వంక ఎదిగిన ఆడపిల్లలకు పెళ్ళి చెయ్యలేక, కొందరు తలిదండ్రులు బాధ పడుతూంటే, మరొకవైపు ముప్ఫైఏళ్ళు వచ్చినా పెళ్ళి చేసుకోకుండా కాలం గడుపుతున్న బ్రహ్మచారు లున్నారు. అటువంటివాళ్లలో ఒకడు కేశవరావు.

రోజూ అయిష్టంగా, విసుక్కుంటూ, సహించని హొటల్ భోజనంతోనే సుమారు ఎనిమిదేళ్ల బట్టీ కాలం గడుపుతున్నాడుగాని, అంతకన్నా రుచికరమైన భోజనంకోసం అతను ప్రయత్నం చెయ్యలేదు. అతను పనిచేసే ఆఫీసులో చాలామంది అతని నొకయింటివాణ్ణి చేద్దామని చూశారుగాని, అసలా ప్రసక్తి వచ్చేసరికే, అతను తన గురించి అటువంటి అపోహ లేమీ పెట్టుకోవద్దనీ, తనసలు పెళ్లి చేసుకోననీ స్పష్టంగా చెప్పేసి, ఎదుటివారి కంతకన్నా ఎక్కువ మాట్లాడడాని కవకాశం ఇచ్చేవాడుకాదు.

కేశవరావు పెళ్ళి చేసుకోక పోవడానికి కారణాలేమిటా అని అతను పనిచేసే ఆఫీసులో, అతని తోటి ఉద్యోగస్థుల మధ్య చాలాసార్లు అతను లేనప్పుడు చర్చ జరిగింది. అతనిలో ఒక్కటి తప్ప, పెళ్ళి కొడుకుకి కావలసిన లక్షణాలన్నీ ఉన్నాయి. అందం ఉంది. అతను మంచి స్ఫురద్రూపి అని చెప్పవచ్చు. డబ్బువుంది. ఒక ఇల్లూ, పొలమూ కాక నెలకి మూడు వందలు ముట్టే మంచి ఉద్యోగం ఉంది. అతని తండ్రి చనిపోయి పదేళ్లయింది. తల్లి ఒక్కర్తే. పొలం ఉన్న పల్లెటూరులో ఉంది. అతనికి అన్న దమ్ములూ, అక్క చెల్లెళ్లూ ఎవరూ లేరు. ఇక ఆ ఒక్క లోపమూ ఏమిటంటే, పెళ్ళి చేసుకోవాలనే ఇచ్ఛ లేకపోవడం.

అలాగని కేశవరావు, నారీద్వేషి అనిగాని, స్త్రీ విముఖుడనిగాని అనలేం. అతనికి మంచి కళాపిపాసవుంది. చక్కని బొమ్మలు గీస్తాడు. మంచి మంచి కథలు రాస్తాడు. సౌందర్యాన్ని చక్కగా విమర్శిస్తాడు. సన్నిహిత స్నేహితులెప్పుడైనా ఈ ప్రశ్నను కదిపిదే, తనకు వివాహం చేసుకోకూడదనే పట్టుదల ఏమీ లేదనీ, కాని ఇంతవరకూ తను ఒంటరితనంవల్ల బాధ పడడంగాని, ఏ స్త్రీనైనా చూసి మనస్సు చలించడంగాని జరగలేదని, అందువల్ల వివాహం అవసరమనే ఉద్దేశం తనకు కలుగలేదని, అందువలననే వివాహం చేసుకోవటం లేదనీ చెప్పాడు.

ఆ జవాబులో నిగూఢమైవున్న ఒక మనస్తత్వ రహస్యాన్ని, అతని స్నేహితుడైన మాధవరావు కనిపెట్టాడు. మాధవరావుది విశాఖపట్నం. అతను కూడా కేశవరావులాగే రైల్వే ఉద్యోగంచేస్తూ, ఖరగ్‌పూర్‌లో ఉంటున్నాడు. సుమారు ఏడాది నుండి ఇద్దరికీ ప్రాణ స్నేహం కలిసింది. మాధవరావుకి పాతికేళ్లుంటాయి. ఇద్దరి అభిరుచుల లోనూ చాలావరకూ సారూప్యత ఉండడంవల్ల ఈ ఏడాది కాలంలోనూ వారి పరిచయం చాలా శీఘ్రంగా అభివృద్ధి చెందింది. మాధవరావు కనిపెట్టిన రహస్యమల్లా—కేశవరావును ఇంతవరకూ ఏ స్త్రీ కూడా కదిలించలేదనీ, అందువల్లనే అతడు వివాహానికి విముఖుడుగా ఉన్నాడనీ, అతనిని కదిలించే స్త్రీ తారసపడిననాడు అతను తప్పక వివాహం చేసుకుంటాడనీ. ఎటువంటి స్త్రీ కేశవరావును కదిలించగలదు? అన్న విషయం గురించి కేశవరావుయొక్క అభిప్రాయ మేమిటో తెలుసుకున్నాడు.

స్త్రీకి విద్య అవసరమనీ, స్త్రీలు కూడా పురుషులతో సరి సమానంగా ఉద్యోగం చేయాలనీ, కాని అంతమాత్రాన వారిలోని స్త్రీ సహజమైన లజ్జా, లావణ్యం మాత్రం కోలుపోక, ఇంటి పనులను శ్రద్ధగా చెయ్యడం, లలితకళల నభ్యసించడం, భర్త యెడల భక్తి ప్రపత్తులను కలిగి యుండడం మొదలైన లక్షణాలు ఉండాలని కేశవరావు చెప్తూండేవాడు. సరిగ్గా ఈ లక్షణాలన్నీ కలిగిన వ్యక్తి తారసిల్లిననాడు కేశవరావు వివాహం చేసుకుని తీరతాడనే నిర్ణయానికి మాధవరావు వచ్చాడు.

కొందరు తామొక విషయం కనిపెట్టి, “ఓహో!” అనుకుని వూరుకుంటారు. మరి కొందరు ఆ విషయంయొక్క పర్యవసానం ఏదో తేల్చడానికి చాలా తాపత్రయ పడతారు. మాధవరావుకి కేశవరావుని ఏదోవిధంగా ఒక ఇంటివాణ్ణి చెయ్యాలనే కాంక్ష పట్టుకుంది. అందుకు ఒక చిన్న పథకం కూడా ఆలోచించాడు. తద్వారా చాలా సమస్యలు పరిష్కారం అవుతాయనుకున్నాడు.

ఒకనాడు తన తండ్రివద్దనుంచి వచ్చిన ఉత్తరం పట్టుకుని మాధవరావు, కేశవరావువద్దకు వెళ్ళాడు.




“కేశవరావుగారూ మీరీ సాయం నాకు చేసి తీరాలి” అన్నాడు గదిలోకి ప్రవేశిస్తూనే మాధవరావు.

“ఏమిటండీ అది?” అని ప్రశ్నించాడు కేశవరావు.

“మళ్లీ మా నాన్నగారివద్ద నుంచి ఉత్తరం వచ్చింది వెంటనే రమ్మని. ఒక మంచి సంబంధం చూశారట. నేను వెళ్లి పిల్లని చూసుకోవాలిట.”

“అయితే వెళ్లండి.”

“వెళ్లడం సులభమేకాని, ఆ సంబంధం చేసుకోనని మా నాన్నగారికి చెప్పడం ఎలాగ? నేను ఏమైనాసరే మా మేనత్త కూతురు కమలనేగాని

! ప్రస్థానం..''



...రమ

వివాహం చేసుకోకూడదని నిశ్చయించుకున్నాను. అందుకు మా నాన్నగారు ఒప్పుకోరు.''

"గట్టిగా మీ నాన్నగారితో మీ మనస్సులోని విషయం చెప్పెయ్యా కూడదా?'' అన్నాడు ఈజీ ఛైరులో కూచుని సిగరెట్టు పొగ వదుల్తూ కేశవరావు.

"ఆ ధైర్యం మా ఇంట్లో ఎవరికీలేదు. అందుకే నేను మీ సహాయం అర్థిస్తున్నాను. మీరు కూడా నాతో వచ్చి, మా నాన్నగారితో మాట్లాడి నా మనసులోని విషయానికి ఆయన్ను ఒప్పించాలి.''

"బాగుంది. మీ విషయంలో నేను కలుగజేసుకున్నందుకు ఆయనకు కోపం వస్తే?'' అని అడ్డు ప్రశ్న వేశాడు కేశవరావు.

"అలా కోపం రాకుండా చెప్పగల శక్తి మీలో వుంది. కాబట్టే మిమ్మల్ని నాతో రమ్మంటున్నాను'' అన్నాడు మాధవరావు నవ్వుతూ. అతని పొగడ్తకు కేశవరావు కూడా నవ్వాడు.

"ఇంతకీ నే నిప్పుడు మీతో రావడానికి ఏదైనా కారణం, సందర్భం ఉండాలికదా?'' అన్నాడు కేశవరావు.

"అందుకు తగిన కారణం నే నాలోచించాను. నే నిదివరలో చాలాసార్లు మన స్నేహం గురించి మా నాన్నగారికి రాశాను. అందువల్ల నేను వివాహం చేసుకోబోయే అమ్మాయిని నేనేగాక మా స్నేహితులు కూడా చూడాలని రాశాను. అందువల్ల ప్రస్తుతం వాళ్లు ఏర్పాటు చేస్తున్న సంబంధం చూడడానికి నాతోపాటు మీరు కూడా రావడం సహజం'' అన్నాడు మాధవరావు.

మిత్రుడియొక్క ఈ విపరీతమైన కోర్కెను మొదట్లో నిరాకరించజూచినా, క్రమంగా మాధవరావుయొక్క ప్రార్థనవల్లా, ఒత్తిడివల్లా, చివరకు అతనితో విశాఖపట్నం వాళ్లింటికి వెళ్ళడానికి ఒప్పుకున్నాడు కేశవరావు. తల్లితండ్రుల యెడల పుత్రులకు వినయ విధేయతలవసరమే కాని వివాహ విషయంలో అంత నిర్బంధం పనికిరాదనే, అభిప్రాయం కేశవరావుది. అయినా మాధవరావు తన తండ్రి మాటను ముఖాముఖీ ఖండించలేక, అందుకు తన సహాయం అర్థిస్తున్నాడని, కేశవరావు గ్రహించాడు.

రెండు రోజులు గడిచాక, ఇద్దరూ ఆఫీసుకి సెలవుపెట్టి విశాఖపట్టణం చేరుకున్నారు. దొండపర్తిలో ఒక చిన్న డాబాముందు వారి జట్కా ఆగింది. ఇద్దరూ లోపలికి వెళ్ళగానే, హాలులో మాధవరావు తండ్రి దయానిధిగారు ఎదురుపడి పల్కరించారు. తన స్నేహితుణ్ణి పరిచయంచేసి మాధవరావు లోపలికి వెళ్లాడు. దయానిధి కేశవరావుతో చాలా సరదాగా మాట్లాడుతూ, ఖరగ్‌పూరు విశేషాలడుగ నారంభించారు. ఆయన చాలా సహృదయతగల మనిషిలా కన్పించారు. కేశవరావుకి. ఒక పావుగంటలో కాఫీ వచ్చింది. అంటే కాఫీ కప్పు తనముందు బల్లమీద ఉండడం మాత్రం గమనించాడు కేశవరావు.

"ఇదిగో ఈమె నా రెండవ కుమార్తె విమల. బి. ఏ. పాసయింది. అగ్రికల్చరల్ ఆఫీసులో పని చేస్తోంది'' అని దయానిధిగారు చెప్తూంటే, మెల్లిగా తలెత్తి చూశాడు కేశవరావు. "నమస్తే'' అంది విమల. ఆమెకు ఇరవై రెండేళ్లు ఉంటాయి సన్నగా, నాజూకుగా ఉంది. మొహం కొంచెం కోలగా ఉంటుంది. కళ్లు పెద్దవి. ఆమెవైపు ఒక్క క్షణం చూసి తల దించేసుకున్నాడు కేశవరావు. "నమస్తే'' అని ఆమెకు ప్రతి నమస్కారం చేశాడు.

దయానిధిగారు కేశవరావుని అతని స్వంత విషయాలడుగ నారంభించాడు. ఆయన లావుపాటి మనిషి. మొహం ఎర్రగా, బొద్దు మీసాలతో నెరిసిన జుట్టుతో గాంభీర్యాన్ని ప్రకటించినా, నిరంతరం చిన్న మందహాసం మెరుస్తూ, ఎదుటివారియందు స్నేహభావాన్ని ప్రకటిస్తూ వుంటుంది. విమల కాఫీ కప్పు ఒక్కడపెట్టి వెళ్ళిపోయింది. మాధవరావువచ్చి, కేశవరావును స్నానం చెయ్యమని చెప్పాడు. కాఫీ త్రాగిన కేశవరావు స్నానానికి లేచాడు.

స్నానం, భోజనం ముగించుకొని మధ్యాహ్నం కాస్త విశ్రాంతికోసం హాలు ప్రక్కన గదిలో మిత్రులిద్దరూ మంచాలమీద నడుం వాల్చారు. కేశవరావుకు ఆ ఇంట్లో వారందరూ తననొక ప్రత్యేక అభిమానంతో చూస్తున్నట్లనిపించింది. విమల మొహంలో తనని చూసినప్పుడల్లా చిన్న సిగ్గు తొంగిచూడడం, దయానిధిగారు తన గురించి, ఆస్తి, ఉద్యోగాల వివరాలూ, తల్లితండ్రుల గురించీ అడగడం కేశవరావు మనసులో చిన్న అనుమానం మొలకెత్తింపజేసింది. ఒకవేళ తనను విమలకు తగిన వరుడిగా నిర్ణయించుకుంటున్నారేమో వీళ్ళు? అసలు మాధవరావు తననదే ఉద్దేశంతో తీసుకువచ్చాడేమో? కేశవరావు తనలో తను నవ్వుకున్నాడు. సాయంకాలం మాధవరావూ, కేశవరావూ సముద్రం వైపు షికారు వెళ్దామని బయల్దేరారు. మాధవరావు విమలను కూడా తమతో రమ్మన్నాడు. ముగ్గురూ సముద్రపు ఒడ్డున నడుస్తూ, చాలా దూరం వెళ్లారు. మొదట్లో ముగ్గురి మధ్యా సంభాషణ, బెరుకుగా నడిచినా, క్రమంగా ఉత్సాహవంతంగా సాగింది.

సముద్రపు ఒడ్డున చాలా దూరం నడిచి ఒక ప్రశాంతమైన ప్రదేశంలో ముగ్గురూ ఇసుకలో కూర్చున్నారు. ఎదురుగా, ఒక దానివెంట ఒకటి తరుముకు వస్తున్న అలలు, వాటి వెనకాల గంభీరంగా ఆకాశంలోకి వ్యాపించిన సముద్రాన్నీ చూస్తూ ఉంటే, వారి మనసులు ఉల్లాసంతో ఉప్పొంగ నారంభించాయి. కేశవరావు సాధారణంగా ఆడవాళ్ల ఎదుట, స్వేచ్ఛగా మెసలలేడు. కాని విమల ఎదుట అతని కేమీ క్రొత్తనిపించలేదు. ఎందువల్లనంటే, ఆమెలో ఒక సరళత ఉంది. ఆమె కళ్లలో ఒక స్వచ్ఛమైన స్నేహవాంఛ కన్పించింది. కేశవరావు అభిరుచులు, పాటలలోనూ, సినిమాలలోనూ, పుస్తకాలలోనూ సరిగ్గా విమల అభిరుచులతో ఏకీభవించాయి. అలా ఏకీభవించాయన్న విషయం ఆమె ప్రత్యేకించి చెప్పలేదు. కానీ, ఆమె కళ్ళూ, ఆ కళ్లలో ఒక విధమైన మెరుపూ 'అవున'న్నట్లు తలూపడం, ఆ విషయాన్ని స్పష్టం చేశాయి. కొద్దిసేపు సంభాషణ నడిచేసరికి, చాలా విషయాలలో విమల కెటువంటి అభిప్రాయాలున్నాయో, కేశవరావుకి కూడా అవే అభిప్రాయాలున్నాయని తేలింది. ముఖ్యంగా వివాహ విషయంలో, విమల కూడా కేశవరావులాగే, వివాహం చేసుకోకుండా ఉందామనే ఉద్దేశంతోనే ఉంది. దానికి కారణం ఆమెలో ఇంకా చదువుకోవాలనీ, జీవితంలో ఒక ఔన్నత్యపథాన్నందాలనీ, సాధారణ జీవితంతో తృప్తి పడకూడదనీ, సహృదయతలేని పురుషులు, స్త్రీల అభివృద్ధి కాటంకం కలిగిస్తారనీ, మొదలైన అనేక భావాలు. వాటిని కేశవరావు తెలుసుకున్నాక, ఆమెయందతనికి చాలా గౌరవం కలిగింది.

ఆ సాయంకాలమంతా వారి ముగ్గురి మధ్యా అనేక సాధారణ విషయాలమీద చర్చ జరిగింది. రాత్రి 7 గంటలు దాటాక మళ్లీ ముగ్గురూ కొంతదూరం సముద్రాన్ని చూసుకుంటూ, తరువాత వూరిలోకీ నడవసాగారు.

## ఆమె రూపవతి... ఆమె పాండ్స్‌ను వాడుతుంది




### మృదువైన, యువ్వనవంతమైన ముఖ చర్మమునకు

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి—

### అది జిగురుగా లేకుండా దివ్యముగా ఉంటుంది!

పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మీ ముఖమును మృదువుగా మరియు మనోహరముగా చేస్తుంది ... ముఖముమీద ఉన్న నల్లని కాయలను మరియు చిన్న చిన్న కళంకములను పోగొట్టుకొనుటకు సహాయ పడుతుంది. పౌడరును అద్దుకొనే ముందు రాసుకొనుటకు అది దివ్య ముగా ఉంటుంది! నలుగురిలోనూ ఆకర్షణీయముగా కనపడుటకు పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ ఫేస్ పౌడరును వాడండి. అది మీ చర్మపు రంగులో కలిసిపోతుంది. ఏకరీతిగా అంటుకొంటుంది మరియు చిన్న చిన్న లోపములను కప్పుతుంది.

### పాండ్స్ కోల్డ్ క్రీమ్




ప్రతి రాత్రి. పాండ్స్ కోల్డ్ క్రీమ్‌ను ముఖముమీద, మెడ చుట్టూ రాయండి. రెండు నిమిషముల తరువాత ఎక్కువగా అంటుకొన్న క్రీమ్‌ను తుడిచివేయండి. అది నీటితో తొలగిపోని, ముఖముమీది దుమ్మును మరియు పాత పౌడరు మొదలగు వాటిని తొలగిస్తుంది!

చిస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో స్థాపించబడినది)

ఇంటికి వచ్చాక దయానిధిగారు మాధవరావుతో "రామారావుగారు ఇంతవరకూ నీ కోసం ఎదురు చూసి, ఇప్పుడే వెళ్ళిపోయారురా" అన్నారు.

"రామారావుగారు ఎవరు?" అనడిగాడు మాధవరావు.

"నువ్వు చూడబోయేది ఆయన కూతుర్నేనూ" అని జవాబిచ్చారు దయానిధిగారు. మాధవరావు, "ఓహో!" అని కేశవరావువైపు చూసి చిరునవ్వు నవ్వాడు. కేశవరావు 'కానీ' అన్నట్లు తలపంకించాడు. దయానిధిగారు మర్నాడు ప్రొద్దున్న పది గంటలకు పెళ్ళి చూపులు ఏర్పాటు చేయబడ్డాయని చెప్పారు.

కేశవరావూ, మాధవరావూ తమలో తాము సంప్రదించుకుని ఒక నిర్ణయానికి వచ్చారు. అదేమిటంటే పెళ్ళి చూపులయ్యాక 'పిల్ల నచ్చిందా?' అని దయానిధిగా రడిగినప్పుడు మాధవరావు తనకు పిల్ల నచ్చలేదని చెప్పి, అప్పుడు తనకు తన మేనత్త కూతురు కమలనే చేసుకోవాలనుందని తన మనోరథాన్ని బయటపెట్టి, కేశవరావు సహాయంతో దయానిధిగారిని ఒప్పించాలని.

ఆ రాత్రి భోజనాలయి, పక్కమీదకు చేరిన కేశవరావుకు చాలాసేపు నిద్ర పట్టలేదు. 'విమల' గురించిన ఆలోచనలు క్రమంగా అతని మనసు నాక్రమించాయి. తననింతవరకూ ఏ స్త్రీ కూడా ఆకర్షించలేదు. ప్రొద్దున్న విమలను చూసినప్పుడు కూడా తనలో ఏ చలనమూ కలుగలేదు. కానీ సాయంకాలం సముద్రపు ఒడ్డున్న ఆమె కళ్ళలోని అందం తన హృదయాన్నాక్రమించుకుంది. ఆమెలో ఏదో ఒక శక్తి తనలో అంతవరకూ మేల్కొనని ప్రణయ వాంఛల నుద్దీపింపజేసింది ఆమెది విశాల హృదయమనీ, చక్కని మనసనీ తెలుస్తోంది. తననసలు ఆమె వరిస్తుందా? అన్న సందేహం కూడా కలిగినా, కేశవరావు మనసులో ఆమె రూపం కదలాడి, తను ఎప్పటికైనా వివాహం చేసుకుంటే ఆమెనే చేసుకోవాలనే నిర్ణయానికి వచ్చాడతను. కాని ఆ విషయం ఎలా కదపాలా? ఆమె మనసు తెలుసుకోవడ మెలాగా? అని చాలాసేపు ఆలోచించాడు.

మన పురాణాలన్నీ నిజం కావని కొందరు ఆధునికులు వాదించి, అసలు దేవతలు లేరని కూడా అనచ్చు. కడంవాళ్ళ సంగతి ఎలాగున్నా, 'మన్మథుడి' గురించి మట్టుకు ఆధునికులకు అంత తెలియదనే చెప్పాలి. అతని బాణాల మహత్యం, చవిచూచిన వాడికేగాని పైవాళ్ళకు తెలియదు. ఒక వంక కేశవరావు, విమల గురించి ఆలోచించి క్రమంగా ప్రేమికుడి స్థితికి—వస్తూంటే, అదే ఇంట్లో మరొక గదిలో మంచంపైన దొర్లుతూ నిద్ర పట్టక విమల కూడా అదే అవస్థ ననుభవిస్తోంది. ఆమె మనస్సంతా కేశవరావుతో నిండి పోయింది. ఎందుకోగాని అతనిలో ఒక ప్రత్యేక సహృదయత ఆమెకు కన్పించింది. ఆమెకు నచ్చిన రూపమేకాక, ఆమె నాకర్షించిన ప్రశాంతత వుంది. అతనివి తెలివైన అభిప్రాయాలు. అతను మాట్లాడుతూంటే తన మనోభావాల్ని, ఎవరో పైకి వెల్లడిస్తున్నట్లుంది. ఇంతా చేస్తే, అతనితో పరిచయం కొద్దిసేపు మాత్రమే. అయినా సరే—ఆ సముద్రపు టొడ్డున ఇసుక తిప్పల్లో కూచొని సంభాషణలో మైమరిచి, తన హృదయమే అతని వద్దకు వెళ్ళిపోయిందన్న విషయం గమనించలేకపోయింది కాని—

అతనే గనక ఇష్టపడితే, అతనితో వివా....."ఛ! నోర్ముయ్" అంది ఆమె మనసు, హృదయంతో! గబుక్కున తలగడా మొహంమీదికి లాక్కుంది విమల!

ఇలా మన్మథుడు రాత్రల్లా వాళ్ళిద్దర్నీ అల్లరిపెట్టి, తెల్లవారుజామున మధుర స్వప్నాలలో కొద్దిసేపు నిద్ర పోయేటట్టుచేసి, తెల్లవారకుండా లేపేశాడు. మర్నాడు ప్రొద్దున్న లేచిన దగ్గర్నుంచీ విమలకోసం కేశవరావు కళ్ళు ఎదురు చూడసాగాయి. అతని మర్యాదల విషయంలో విమల ప్రత్యేక శ్రద్ధ వహించింది.

మాధవరావు కొద్దిగా ఆలస్యంగా లేచినా, కాఫీ త్రాగడం అయ్యాక అతని బుర్ర వేగంగా పని చెయ్య నారంభించింది. కేశవరావు మొహంలోని కొత్త ఉత్సాహం అతను పసిగట్టాడు.

ప్రొద్దున్న పది గంటలకు మాధవరావూ, కేశవరావూ పెళ్ళి చూపులకు బయల్దేరారు. తక్కిన వారంతా అంతకుముందే ఆ పిల్లనుచూసి ఉన్నారు కాబట్టి, వారు వెళ్లలేదు. పెళ్ళికూతురు తండ్రి పేరు రామారావుగారు. ఆయన కొద్దిగా స్థితిపరుడు. ఆయనకు ఒక్కర్తే ఆడపిల్ల. నలుగు రబ్బాయిలు. అయిదారువేల దాకా కట్నం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు. మాధవరావు తల్లి తండ్రులు ఆ కట్నాని కాశపడి ఈ పెళ్ళి చేసుకోమని మాధవరావుని బలవంతం చేస్తున్నారు. ఆ కట్నంతో విమల పెళ్ళి అయిుందనిపిద్దామని వారి తాపత్రయం.

డాబా తోటలోవున్న ఒక మేడలో రామారావుగా రుంటున్నారు. ఆయన తనకున్న భూవసతిలో కొంత భూమిని అమ్మి వ్యాపారం చేస్తున్నారు. అది అంతగా కలిసి రాలేదు. ఆయన కొంతవరకూ అమాయకుడనే చెప్పాలి. మనుష్యుల్ని సులభంగా నమ్ముతాడు. అందువల్ల వ్యాపారం దెబ్బతింది. కొంత డబ్బు నష్టపోగా, చేతిలో పదివేలు మిగిలింది. దానితో కూతురిపెళ్ళి చెయ్యాలని ఆయన కోరిక.

మాధవరావు పెళ్ళి కూతుర్నంత పరీక్షగా చూడలేదు. కాని, మొత్తంమీద చక్కనిపిల్లేనని గ్రహించాడు. ఆమె. పి. యూ. సి. చదువుతోంది. కేశవరావు నిదానంగా ఆమెను చూసాడు. ఆమెలో అతని కేలోపమూ కన్పించలేదు. రామారావుగారు, తన కూతురి తెలివి తేటల గురించీ, పనులలో నేర్పు గురించీ చెప్పారు. ఒక పావుగంట గడిచాక, మాధవరావు. కేశవరావు లిద్దరూ ఆయనవద్ద సెలవు పుచ్చుకుని తిరిగి వచ్చేసారు. దారిలో ఇద్దరూ నవ్వుకున్నారు.

"మనం వచ్చిన పనైంది" అన్నాడు కేశవరావు.

"ఇంకా సగం వుంది" అన్నాడు మాధవరావు.

ఇంటికి రాగానే మాధవరావుని దయానిధిగారు, "పిల్ల ఎలా ఉంది?" అని అడిగారు. "బాగులేదు" అని తలవంచుకుని లోపలికి వెళ్ళిపోయాడు మాధవరావు. దయానిధిగారు చిన్నబుచ్చుకున్నారు. "ఇహ మీ పెళ్లిళ్ళు చెయ్యడం నా వల్లకాదు" అన్నా రాయన కోపంగా, తుఫాన్ చెలరేగిన మనఃస్థితిలో.

కేశవరావు ఆయన కెదురుగా కూర్చున్నాడు. "పిల్ల కేమండీ. లక్షణంగా ఉంది" అన్నాడు. దయానిధిగారతని వైపు తిరిగి, "మరి వాడల్లా అంటున్నాడే?" అని అడిగాడు.

"అబ్బే. అది పిల్లలోపం కాదు. అతని లోపం. అతనికి ఇంతకుముందే మరొక పిల్ల నచ్చింది. అందువల్ల ఈ పిల్ల నచ్చలేదు."

"ఏమిటీ? మరొక పిల్ల నచ్చిందా? ఎవరా పిల్ల?"

"అతని మేనత్త కూతురు కమలట."

"ఆ!" అని ఆశ్చర్యపోయారు దయానిధిగారు. ఉప్పొంగి వస్తున్న కోపాన్నాపుకుంటూ, "కమలనా? వీడా?" అని అరిచాడు.

"మీరలా కోపం తెచ్చుకోకుండా ఉంటే, నేను రెండు ముక్కలు చెబుతాను వినండి. మీ అబ్బాయి కమలను ప్రేమించిన సంగతి మీకు తెలిస్తే మీరు కోప్పడతారని అతను చాలా భయపడుతున్నాడు. అసలిక్కడికి రాననీ, తనకు కమల ఎలాగా దక్కదు కాబట్టి జీవితం అంటే తనకు విరక్తి పుట్టిందనీ, ఆత్మహత్య చేసుకుంటాననీ, ఒకనాడు రాత్రి పటా



బట్టాడు. అప్పుడు నేనతనికి ఎన్నో విధాల నచ్చ చెప్పి, 'నీ కన్న తండ్రి ఎప్పటికైనా నీ మేలే కోరుతారు, భయపడవద్ద'ని చెప్పి, అతనిని తీసుకు వచ్చాను. తెలివితక్కువనుకోండీ, ఉద్రేక మను కోండీ, పసితనమనుకోండి. ఎంతైనా అతను మీ అబ్బాయి. అతను సుఖంగా ఉండడమే మీకు కావాలి. అతను బాధ పడ్తే మీకేం లాభం?''

దయానిధిగారు క్రమంగా మెత్తబడ్డారు. కేశవరావు మాటలు ఆయనకు సబబుగానే తోచాయి

## "ఆలస్యం అమృతం..."

కాని, అంతలో మంచి కట్నంతో వచ్చిన సంబంధం వద్దంటున్నాడని కొడుకుమీద ఆయనకు కోపం వచ్చింది. ''చూడండీ, మీరన్నది నిజమే. వాడి మేనత్త కూతుర్ని వాడు వరించచ్చు. కాని వాళ్ళకు దమ్మిడీ ఆస్తి లేదు. కట్నం అసలివ్వలేరు. నేను విమలకు పెళ్ళి చెయ్యాలి. వీడీ సంబంధానికి ఒప్పుకుంటాడేమో, ఆ కట్నంతో దాని పెళ్ళి చేద్దామనుకున్నాను. కాని వీడా కమల్ని పెళ్ళి చేసుకుంటే, ఏం డబ్బొస్తుంది? నేనేమీ భాగ్యవంతుణ్ణి కాను'' అని ఆయన అంటూంటే గుమ్మం ప్రక్కగా నిల్చుని వింటున్న విమల మనస్సుడికిపోయింది. తనసలు పెళ్ళి చేసుకోనని చెబ్దామనుకుంది. కానీ, తానేమీ అనకుండా, కేశవరావు, ''పోనీ, విమలను కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవడానికి ఒక యువకుడు అంగీకరిస్తే మీ సమస్య తీరినట్లేనా?'' అన్నాడు.

''అలా అయితే ఫరవాలేదు'' అన్నారు దయానిధిగారు. వారిద్దరి మాటలు వింటున్న విమల మనసులో ఆత్రుతా, ఆనందం ఆవరించాయి.

''మీ కభ్యంతరం లేకపోతే నేను ఆమెను వివాహం చేసుకుంటాను'' అన్నాడు కేశవరావు. గుమ్మం ప్రక్కన నిల్చున్న విమల వంటింట్లోకి పరుగు తీసింది. దయానిధిగారి మొహం వికసించింది.

అప్పుడే ముందుగదిలోకి వస్తున్న మాధవరావు, ''కంగ్రాట్యులేషన్స్ కేశవరావుగారూ!'' అన్నాడు నవ్వుతూ. దయానిధిగారు ఈ విషయాన్ని భార్యతో చెప్పడానికి లోపలికి వెళ్ళారు.

''ఇప్పుడు మీ వివాహానికి అడ్డు లేదు'' అన్నాడు కేశవరావు మాధవరావుతో. తనకోసం ఎంతో శ్రమ తీసుకుని తన తరఫున వాదించినందుకు, కాబోయే బావగారిని విపరీతంగా అభినందించాడు మాధవరావు.

ఆరోజు సాయంకాలం మళ్ళీ ముగ్గురూ షికారుకి బయల్దేరారు. ఆ ఘడియలు ఎలా గడిచాయో వారికే తెలియదు. విమలా, కేశవరావులకు తమ చుట్టూ వున్న ప్రపంచం కొత్తగా కన్పించ సాగింది. సముద్రపు టొడ్డున ముగ్గురూ కూచుని మాట్లాడుకుంటూండగా మాధవరావు తనకు వూళ్ళో పనుందని, మళ్ళీ కొద్ది సేపట్లో వస్తాననీ చెప్పి వెళ్ళాడు. తమకు లభించిన ఏకాంతంలో కేశవరావూ, విమలా స్వేచ్ఛగా మాట్లాడుకో నారంభించారు. తను విమల మనస్సును తెలుసుకోకుండా తొందర పడ్డానేమో అని భయపడ్డ కేశవరావు విమలను ఆమె హృదయాన్ని విప్పి చెప్పమని అడిగాడు. ఆమె తనకెట్టి అభ్యంతరమూ లేదని తెలియజేసింది. ఇద్దరూ ఇంత త్వరగా ఒకరి నొకరు అర్థం చేసుకున్నందుకు ఆశ్చర్యానందాలు వెలిబుచ్చుకున్నారు. కేశవరావు తను ఇంత కాలం, విమలవంటి స్త్రీని చూడ గలుగుతానని అనుకోలేదనీ, ఆమెను చూశాక, తానొక నూత్నానుభవాన్ని పొందానని చెప్పాడు. విమల తన మనసులోని భావాలన్నిటినీ మాటలతో చెప్పలేకపోయినా, ఆమె కళ్ళు మాత్రం, ఆమె మనసుని పూర్తిగా కేశవరావుకి చెప్పేశాయి. వారి హృదయాలలోని విషయాలు చెప్పుకోవడానికి, అటువంటి సాయంకాలాలెన్నున్నా చాలవనిపించింది. వాటిని భవిష్యత్తుకు వాయిదావేసి, మాధవరావు రాగానే ఇద్దరూ లేచారు. ఇంటికి వెళ్ళడానికి.

మర్నాడు కేశవరావు, దయానిధిగారితో, తను తన తల్లి వద్దకు వెళ్ళి ఈ విషయం చెప్పివస్తాననీ, ఆమెతో మాట్లాడాక వివాహానికి ముహూర్తం నిశ్చయించవచ్చుననీ చెప్పాడు. దయానిధిగారు వీలైనంత తొందరలో విమల వివాహం జరగాలనీ, కేశవరావుని అందుకు తగిన ప్రయత్నాలన్నీ చెయ్య

మనీ చెప్పారు. ఆరోజు మధ్యాహ్నమే బయల్దేరి కేశవరావు తన తల్లివున్న రాజుపేట అనే పల్లెటూరు వెళ్ళాడు. ఆ వూరు విశాఖపట్నానికి ముప్ఫై మైళ్ల దూరంలోఉంది. అతను సాధారణంగా ఏడాదికి ఒకసారో రెండుసార్లో ఆ వూరు వెళ్తాడు అతను వెళ్ళినప్పుడల్లా అతని తల్లి, అతనిని వివాహం చేసుకోమని వేధిస్తుంది. ఆమె పూర్వాచార పరాయణురాలు. కేశవరావు ప్రతి సారీ తన తల్లితో తను వివాహం చేసుకోదల్చుకోలేదని చెప్తుండేవాడు. ఆమె చాలా బాధ పడేది.

ఈసారి తను వివాహం చేసుకోబోతున్నానని చెప్తే తన తల్లి తప్పక సంతోషిస్తుం దనుకున్నాడు. అతను చెప్పబోయే మాట అతని నోటినుంచి వెలువడకుండానే ఆమె ప్రారంభించింది. ఆమెకు ఏభై ఏళ్లు దాటాయి. నెరసిన తలతో, నల్లగా ఉండే ఆమె మొహం, కొడుకు వివాహం గురించిన దిగులుతో ముడతలు పడినట్లై, చూసేవారికి ఆమె విచారంగా ఉన్నట్లు కన్పిస్తుంది.

“నిన్ను నే నొక కోరిక కోరుతున్నారా నాయనా తల్లిని కాబట్టి ఆమాత్రం కోరడంలో తప్పేమీ లేదనుకుంటాను. నువ్వా కోరిక తీరుస్తావని ఒట్టివ్వాలి” అందామె.

తన వివాహం గురించే ఆమె కోరుతుందని కేశవరావుకు తెలుసు “అలాగేనమ్మా నీ కోరిక తప్పక తీరుస్తా. నేనూ వివాహం చేసుకుంటాననే చెప్పడానికి వచ్చాను” అన్నాడు.

ఆమె మొహం వికసించింది. “ఎన్నాళ్లకు విన్నానురా నీ నోట ఈ మాట! నీకు తగిన సంబంధం సిద్ధంగా ఉంది. పిల్ల బంగారపు బొమ్మలా ఉంది, చదువుకుంటోంది కూడాను. ఇవాళ ప్రొద్దున్నే వాళ్లకు మాటిచ్చాను” అందావిడ సంతోషంతో.

కేశవరావు త్రుళ్ళిపడ్డాడు. “మాటా! ఎవరికి?” అన్నాడు ఆశ్చర్యంతోనూ, భయంతోనూ.

“మనవాళ్లే. నాకు వరుసకు అన్నవుతాడు. విశాఖపట్నంలో డాబా తోటలో ఉంటున్నారు రామారావని. ఆయన కూతురు పి. యూ. సి. చదువుతోంది. మీ ఇద్దరికీ వయసులో తేడా ఎక్కువే అయినా పిల్ల ఏపరిగా బాగుంది. ఇవాళ ప్రొద్దున్న వాళ్లు మనింటికి వచ్చారు. కూతుర్ని తీసుకొచ్చి నా కాళ్ళమీద పడేశాడు. దాని బాధ్యత నాదేనని. ఎంతో బ్రతిమాలాడు. అతని స్థితి చూసి జాలివేసి మాటిచ్చాను. తప్పకుండా నా కోడల్ని చేసుకుంటానని. నా మాట నిలబెట్తావని నీమీద నాకు ధైర్యం ఉంది.”

కేశవరావుకి భూమి తల్లక్రిందులయింది. ఇది నిజమేనా? కలా? రామారావుగారి అమ్మాయిని తను వివాహం చేసుకోవాలా? అందుకు తన తల్లి మాటిచ్చిందా? తను తల్లి మాటని కాదంటాడా? లేక విమలను నిరాకరిస్తాడా? ఇటు తనను కని, పెంచి పోషించి తనమీదే ఆశలన్నీ పెట్టుకున్న తల్లిని కాదంటాడా? అటు తన హృదయాన్నపహరించిన విమలను కాదంటాడా? అసలు దయానిధిగారికి తనిచ్చిన వాగ్దానం సంగతేమిటి?

ఆలోచనలన్నీ ఒక్కసారి మనసు నావరించుకొని అతనికి ఆలోచించే శక్తిని కూడా లేకుండా చేశాయి. తన జవాబుకోసం ఎదురు చూస్తున్న తల్లివైపు చూసి, “నన్నడక్కుండా మాటెందుకిచ్చావమ్మా?” అన్నాడు, బాధగా.

“నేనన్నీ ఆలోచించి, నీ సుఖం కోరే చేశానురా. నా మాట విన్నందుకు నువ్వెప్పటికీ విచారించవు” అందామె కొడుకుయందు తనకుగల వాత్సల్యాన్ని వ్యక్తపరుస్తూ.

తన మనసులోని విషయం ఆమెతో చెప్పలేదు. ఎలాగో ఆ రాత్రి అక్కడ గడిపి, ప్రొద్దున్నే ఖరగ్‌పూర్ బయల్దేరాడు కేశవరావు. అతను వెళ్ళేముందర, తల్లి మళ్లీ కదిపింది. “ముహూర్తం వెంటనే పెట్టిస్తానురా” అంది.

కేశవరావు మెల్లిగా ఆలోచిస్తూ, “రెండు మూడు నెలలు వ్యవధి కావాలమ్మా. నేనుత్తరం రాస్తాను. తరువాత పెట్టిద్దువుగాని” అన్నాడు. ఆమె అలాగేనంది. తను చెప్పిన విషయం గురించి కొడుకు అంత ఉత్సాహంగా లేడని ఆమె గ్రహించింది. కాని, కారణం వూహించలేకపోయింది.

తిన్నగా ఖరగ్‌పూర్ చేరుకున్న కేశవరావుకి వారం రోజులవరకూ ఏమీ తోచలేదు. పెళ్ళి చేసుకోకూడ దనుకున్నంత కాలం జీవితం సాఫీగా గడిచింది. పెళ్ళి చేసుకుందామనుకోగానే అనుకోని సమస్య లెదురయ్యాయి. తల్లి మాటను తోసి వెయ్యడం అతనివల్లకాదు. ఆమె తనయందు పూర్ణ విశ్వాసంతో వాగ్దాన మిచ్చింది. కాని, తన హృదయం విమలకు దూరమై, బ్రతికేకంటే జీవితాన్ని త్యజించడమే మేలనిపిస్తోంది. అతను పిరికివాడై, జీవితంనుండి పారిపోదామనుకోడంలేదు

---

మాష్టారు: రైలు లేటుగా వచ్చును ఇదే కాలంరా.

రాము: తద్ధర్మ కాలం సార్!

రామయ్య (ఏలూరు)

---

కానీ అతనిని మించిన సమస్యలతని కెదురయ్యాయి. తను త్యాగం చెయ్యగలడు—తల్లి కోసం, కాని, విమల సంగతి? ఆమెకు తను ద్రోహం చేసినట్లు కాదూ?

మాధవరావు, విశాఖపట్నంలో వారం రోజుల దాకా ఉండి, కేశవరావు మళ్ళీ తమ ఇంటికి రాకపోయేసరికి, తిన్నగా ఖరగ్‌పూర్ వచ్చేశాడు. వచ్చిన వెంటనే అతను వాకబు చేస్తే తెలిసిందేమిటంటే కేశవరావు ఆఫీసుకి సెలవుపెట్టి వూళ్లోనే ఉంటున్నాడని. అతని రూముకి సాయంకాలం మాధవరావు వెళ్ళే రూము తాళం వేసుంది.

వరుసగా మూడు రోజులు ప్రొద్దున్నా, సాయంకాలం అతని గురించి తిరగ్గా మాధవరావుకి, ఒకనాటి రాత్రి ఎనిమిది గంటలకు రూములో దొరికాడు కేశవరావు. మాసిన గడ్డంతో, చిక్కి దిగులుగా ఉన్న అతన్ని చూసేసరికి మాధవరావుకి బాధా, ఆశ్చర్యం కలిగాయి. కేశవరావు అతనితో మునుపటిలా మాట్లాడలేదు. తన మనసు బాగులేదనీ, తన సహార్యం చేసుకోవద్దనీ మాధవరావుతో చెప్పాడు. కేశవరావు ఏదో పెద్ద ‘షాకు’ తిన్నాడనీ, దాని నుండి తేరుకునే దాకా అతనితో వివాహవిషయం మాట్లాడ కూడదనీ మాధవరావు అనుకున్నాడు.

పదిహేను రోజులు గడిచాయి కేశవరావు, స్నేహితులతో మునుపటిలా తిరగడం మానేశాడు. మాధవరావుని తప్పించుకు తిరుగుతున్నాడు. అతని విషయం తన తల్లి దండ్రులకు మాధవరావు వ్రాసి, వారిని ఖంగారు పడవద్దనీ, కొద్ది రోజులలో అసలు విషయమేమిటో కనుక్కుని వ్రాస్తానని వ్రాసాడు. ఏదో సంఘటన అనుకోనిది జరగడంవల్ల కేశవరావు చాలా మనఃక్లేశాన్ననుభవిస్తున్నాడనీ అందువలన కొద్ది రోజులు ఓపిక పట్టమని మాధవరావు దయానిధిగారికి వ్రాశాడు.

మరొక పదిహేను రోజులు గడిచాయి. కేశవరావు ఆలోచించి, ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. ఇహ తను ఇలా ప్రవర్తించడం సబబు కాదు. జరిగినదంతా మాధవరావుకి తెలియబర్చాలి. విమల తన నొక నీచుడిగా భావించవచ్చు. ఇటు తన తల్లినీ తృప్తి పరచలేడు తను. అందుకని ఎప్పటి లాగే తను వివాహం చేసుకోకుండా ఉండడమే మంచిదనుకున్నాడు.

బరువైన హృదయంతో ఆ రోజు సాయంకాలం బయల్దేరి మాధవరావు రూమువద్దకు వెళ్లాడు కేశవరావు. తన సుఖానికీ, ప్రేమకూ ఆ క్షణంతో అంతిమ వీడ్కోలివ్వదల్చుకున్నాడు. విమలతో, తనను మర్చిపొమ్మని చెప్పమని చెప్దామనుకున్నాడు. తన స్థితికి లోకం పరిహసిస్తుందనుకుని, మూసివున్నమాధవరావు రూము తలుపులూ, వాటికి వేసిన తాళం చూశాడు. ప్రక్కవారిని కనుక్కోగా, నాల్గురోజుల క్రితమే మాధవరావు విశాఖపట్నం వెళ్ళిపోయాడని చెప్పారు. వికలమైన మనసుతో తిరిగి పోయాడు కేశవరావు.

మరునాడు తన రూములో కూర్చుని వివరంగా దయానిధిగారిపేర ఒక ఉత్తరం రాయడం ప్రారంభించాడు కేశవరావు. అందులో తన తల్లి రామారావుగారి కిచ్చిన వాగ్దానం వల్ల పరిస్థితు లెలా తారుమారయినదీ వివరించ సాగాడు. చివరికి తను వివాహం చేసుకోకూడదనే నిశ్చయానికి వచ్చిన సంగతి రాస్తూంటే “సార్!” అన్న కేక విన్పించింది. పోస్టుమాన్ ఒక శుభలేఖిచ్చాడు.

ఆ శుభలేఖను చూసి నిర్ఘాంతపోయాడు కేశవరావు. అది మాధవరావుయొక్క పెళ్ళి శుభలేఖ! మాధవరావుకీ, రామారావుగా రమ్మాయి సంధ్యారాణికీ వివాహం! కేశవరావు ముందర నమ్మలేకపోయాడు. ఇది ఎలా సంభవమా? అని ఆలోచించాడు. కొద్ది సేపాలోచించాక అతని కొక ఆలోచన తట్టింది. బహుశా మాధవరావు తన కోసం చేస్తున్న త్యాగమేమో ఇది! తన చెల్లెలి సుఖం కోసం, తను వివాహం చేసుకోదల్చిన కమలను మానేసి, మాధవరావు ఈ అమ్మాయిని వివాహం చేసుకుంటున్నాడా? మరి రామారావుగారు తన కూతుర్ని ఎలా అతని కిస్తున్నారు? తన తల్లికి ఇచ్చిన మాటేమయింది? పెళ్ళికి సరిగ్గా మూడు రోజుల వ్యవధివుంది. కేశవరావు వెంటనే వాల్తేరు బయల్దేరాడు.

వాల్తేరులో దయానిధిగారింటి వద్ద జటా లోంచి దిగిన కేశవరావుకి, దయానిధిగా రెదురుపడి, “రావోయ్! నీ కోసమే చూస్తున్నాం” అని లోపలికి తీసుకెళ్లారు. మాధవరావు అతనిని చూసి “మీతో మాట్లాడాలి, రండి” అని ఒక గదిలోకి తీసికెళ్లాడు. “శుభలేఖ అందిందా?” అని

గాడు మాధవరావు, కేశవరావును.

"అందుకే వచ్చాను. నాకోసం మీ రిలా చెయ్యడం బాగులేదు. నన్ను మీరంతా క్షమించి........" అని కేశవరావు ఏదో అనబోతూం టే, మాధవరావు, "మీకోసం నేనేమీ చెయ్యటం లేదు" అన్నాడు.

"మరి ఈ వివాహం మీ రెందుకు చేసుకో వాలి? మీ హృదయం, మీ మేనత్త కూతురి కర్పిత మైనప్పుడు మీ రామెను మాని, ఈ వివాహం చేసుకోడం, మా కోసం కాదా?"

"నేను, కమల విషయంలో నా మనసు మార్చు కున్న పరిస్థితి తరువాత చెప్తాను. కాని ఈ వివా

# "ఆలస్యం అమృతం..."

హం నేను చేసుకోవడంలో మీకోసం చేసిన దేమిటో నాకు బోధపడటంలేదు" అన్నాడు మాధవరావు.

"మీరంటున్నది నిజమేనా? మీ కేమీ తెలి యదా?" అని కేశవరావు అడిగాడు. మాధవరావు తన కేమీ తెలియదని చెప్పాక, కేశవరావు సవిస్త రంగా జరిగినదంతా చెప్పాడు. అది విని మాధవ రావు, "చిత్రంగావుంది. అయితే ఇందుకేనా మీరా విధంగా దిగులు పడింది?" అనడిగాడు.

"అవును. ఇప్పుడు మీరీ వివాహం కెందుకు ఒప్పుకున్నారో చెప్పండి?" అనడిగాడు కేశవరావు.

"ఇదీ కారణం" అని ఒక ఉత్తరాన్ని మాధవ రావు తన పెట్లోంచి తీసి, కేశవరావు కిచ్చాడు. అది, కమల, మాధవరావుకి రాసిన ఉత్తరం. 'బావా! నన్ను నువ్వమితంగా ప్రేమిస్తున్నావని నాకు తెలుసు. నీ హృదయంలో ఈ ఉత్తరంతో ఎంత చిచ్చును రగుల్కొల్పుతున్నానో, నేనూహించ గలను. కానీ, ఇంకా నీ దగ్గర విషయాలు దాచి, నిన్ను మభ్యపరచి, చివరకు నిన్ను మోసం చెయ్యడం కన్నా అసలు విషయం ముందే చెప్పడం మంచిది. నేను నా క్లాసు మేటయిన శ్రీహరిగారిని వివాహ మాడదల్చుకున్నాను. ఆయనకూ, నాకూ సుమారు సంవత్సరంనుండి స్నేహం ప్రారంభమై, అది అను కోని పరిణామాలకు దారి తీసింది. నువ్వీ ఉత్తరం చదివే వేళకు, మే మిద్దరం రిజిస్ట్రరాఫీసు వదలి వస్తూంటాం. నన్ను క్షమించమని కోరే అర్హత నాకు లేదని తెలుసు. కమల' అని ఉన్న ఉత్తరం చూసి కేశవరావు చాలా నొచ్చుకున్నాడు.

"ఈ ఉత్తరం నేను ఖరగ్‌పూర్‌లో ఉండగానే అందింది. వెంటనే వాల్తేరు వచ్చి జరిగిందంతా నాన్నగారికి చెప్పి, నాకు ఇక ఏ సంబంధమైనా చేసు కోవడానికి అభ్యంతరం లేదని చెప్పాను. ఆయన వెంటనే రామారావుగారిని కలుసుకుని ఈ వివాహం ఏర్పాటు చేశారు. మరి మీ సంగతి ఆయనేమీ చెప్పలేదు."

"తక్కినది నేను చెప్తాను విను" అన్నారు అంతకుముందే ఆ గదిలోకి ప్రవేశించిన దయానిధి గారు. "రామారావుగారు నాతో నీ విషయం చెప్పారు. అప్పుడు నువ్వు విమలను చేసుకుంటానన్న విషయం చెప్పాను. అప్పు డాయనా నేనూ రాజూపేట వెళ్ళి మీ తల్లిగారిచేత, నువ్వు విమలను చేసుకునేం దుకు ఒప్పించాము. మా వాడికి రామారావుగా రమ్మాయితో వివాహం నిశ్చయ పరిచాం. ఈ పెళ్ళికి మీ అమ్మగారు కూడా వస్తామన్నారు" అన్నా రాయన కేశవరావుతో.

ఇంతలో వారి ఇంటిముందు జట్కా ఆగింది. అందులోంచి కేశవరావు, తల్లి దిగింది. దయా నిధిగారూ, మాధవరావూ, కేశవరావూ, ఆమె కెదు రుగా వెళ్ళి లోపలికి తీసుకు వచ్చారు. ఆమె లోపలి వస్తూనే "ఏదీ నా కోడలు?" అని అడిగింది.

దయానిధిగారి భార్య విమలను తీసుకువచ్చి చూపించింది. ఆమె విమలను చూసి, చాలా సంతోషించింది.

"మరి రామారావుగారికి వాగ్దాన మిచ్చా నన్నావు కదా, ఈ పెళ్ళి కెలా ఒప్పుకున్నావ్" అనడిగాడు కేశవరావు.

"ఒరేయ్ నీ పెళ్ళి ఇప్పటికే ఆలస్యమైంది. ఇంకా ఆలస్యమైపోతుందేమోనని అలా అన్నాను. వెయ్యి అబద్ధాలాడి ఒక ఇల్లు నిలబెట్టమన్నారు. నే నాడింది ఒక్క అబద్ధమే" అందావిడ.

అందరూ నవ్వారు.

"ఆలస్యం అమృతమ్......" అని కేశవరావు అనబోతుంటే

"అమృతమే మిగిలింది!" అంది విమల. మళ్లీ అంతా నవ్వారు. ★

# అంతు దొరకని హత్య

25 వ పేజీ తరువాయి

దుస్తులు నాకు చెప్పిందికదా ! అతను సెర్జ్ ఇంటి దగ్గర కారాపేసరికి, అక్కడ మరో రెండు ఖాళీకార్లున్నాయని కూడా చెప్పాడు.

మేమింకా ఈ విధంగా నానా యతనలూ పడుతుండగానే ఆ ముసలి అప్పచెల్లెళ్ళు తమ కథలు మార్చారు. ఆ గోధుమరంగు దుస్తులేసుకున్న అమ్మాయి వచ్చినపుడు టైము ఒంటిగంటయ్యుండదేమో అన్నారు. అసలామెను చూశామో లేదో అన్న ఒకే ఒక అనుమానం అన్నారు. సెర్జ్ భౌతిక దేహం తీసుకుపోడానికి వచ్చిన ఆంబులెన్సు తాలూకు మనిషిని పగలు చూసి, అలా భ్రమ పడ్డామేమో అన్నారు. ఆ ఆడపిల్లలా కనుపించినవాడు ఒకవేళ నౌకరు మార్టర్ ఏమో అన్నారు. లేకపోతే ఆమె ఏ భూతమైనా అయ్యుండవచ్చేమో అన్నారు. మా బుర్ర వాడెక్కింది. వీళ్లిద్దరూ నిజాన్ని కప్పిపుచ్చడానికి ఈ నాటకం ఆడుతున్నారో, లేక, మానసిక నిశ్చలతపోయి ఇలా మాట్లాడుతున్నారో అనే అనుమానం వచ్చింది.

మా కంతవరకూ ఏ విధమైన విశేషం, వివరం తెలియనేలేదు. బయలుదేరిన చోటే ఉన్నాము. ఖహా ఇలా లాభంలేదనీ, అతను రాసిన వీలునామా చూస్తే, అసలతని హత్యకి కొంత సంబంధం దొరకవచ్చుననిపించింది.

అతని తరఫు లాయర్ (న్యాయవాది) ఎడ్వర్డ్ జె. ఎన్నిన్‌ని కలుసుకున్నాము.

"మీరు ఈ కేసు అంతు ఛస్తే కనుక్కోలేరు." అని ఆయన పందెం వేసినవాడిలా హేళన చేశాడు.

విల్లు చూశాము.

రాబిన్‌స్టైన్ తల్లి బ్రతికినన్నాళ్ళూ నెలకు 1,000 డాలర్లు వచ్చేలాగ, మార్టర్‌కు, బెట్టీ రీడ్‌కు, మేరీ పయేన్‌కు, థియోడోర్ స్కల్డ్ అనే వ్యాపారంలో వాటాదారునికి ఒక్కొక్కరికి 10,000 డాలర్లు వచ్చేలాగ, తన మొదటి భార్య సంతానం — డయోన్ (తొమ్మిదేళ్ల పిల్ల) శాండ్రా (తొమ్మిదేళ్ళ పిల్ల)లకు వారికి యాభై ఏళ్లు వచ్చేవరకు ఒక్కొక్కరికీ నెలకు 500 డాలర్లు చొప్పున వచ్చేటట్టు ఆనక యస్టేటు మొత్తానికి అధికారులయ్యేటట్టు రాశాడు. దానధర్మాలకి ఏ మాత్రం రాయలేదు. తన మాజీ భార్య లారియట్‌కి కూడా ఏమాత్రం రాయలేదు.

మరో రోజు స్టాన్లీ—టి— స్టాన్లీ అనే అతన్ని కలుసుకున్నాము. అతని యొక్క తెలివి తేటలు, దిట్టతనము మమ్మల్నెంతో ఆకర్షించినయి. కాని నిష్ప్రయోజనమే అయ్యింది. మేమూహించిన పద్ధతిలోనే అతనూ ఒక వూహాగానం చేశాడు. సెర్జ్ జీవితంతో సంబంధం ఉన్న ఆడవాళ్ళలో ఏ ఒక్కతెకు కూడా అతని మరణంతో జోక్యం లేదని చెప్పాడు. వారందరూ అతని దగ్గరనుంచి ఒక విందుభోజనము, చక్కని రాత్రి, మంచి బహుమతుల కన్నా కోరరు. అవి వాళ్ళకి కుప్పలు తెప్పలుగా ముట్టి ఉంటాయి. కనుక ఈ హత్య ఎవరో కావాలని, దానిమీద కొంత లాభం ఉండేవారు చేశారనేది నిర్వివాదం అని అతను సిద్ధాంతీకరించాడు. పైగా ఎవరో ఒకరిచేత హంతకుడు నియోగింపబడి హత్య చేసి ఉండాలని కూడా అతనే అభిప్రాయపడ్డాడు.

ఇది గనుక నిజమైతే హంతకుని నియోగించిన వాళ్ళెవరు ? యూరప్‌లో ఉండే రోజుల్లో రాబిన్‌స్టైన్ చిన్ననాటి స్నేహితుడయినా, స్టాన్లీ ఈ విషయంలో మాకన్నా ఎక్కువ వూహించలేక పోయాడు. కాని అతను కొంచెం ఎక్కువగా వూహించగలిగాడు. రాబిన్‌స్టైన్ ఆఫీసు ఫైళ్ళన్నీ వివరంగా చదివితే హత్యకి కారణాలు దొరక వచ్చుననీ, అతని చావువల్ల ఎవరికైనా వ్యాపార రీత్యా లాభం ఉండచ్చుననీ పైగా తన నెవరో బెదిరించారని, కానీ తను 'రక్షణ' నియమించుకోడానికి ఇష్టపడడనీ రాబిన్‌స్టైన్ తనతో చెప్పాడని స్టాన్లీ తెలియజేశాడు.

స్టాన్లీ సూచించిన పద్ధతి మాకు నచ్చింది. మా సిబ్బందిలో ఆరుగురు ఒక గ్రూపుగా ఏర్పడి సెర్జ్ ఆఫీసు ఫైళ్ళను వెతకడం ప్రారంభించారు. ఒక పెద్ద బల్ల ముందు కూర్చుని, ప్రతీఫైలు నిశితంగా పరీక్షించి, 'అనుమానితుల జాబితా' తయారు చేశారు. అతని వ్యాపారానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలు కొన్ని లక్షలకు పైగా ఉన్నాయి. అవేగాక వందలకొద్దీ ప్రేమ లేఖలు, కన్నీటితో నిండిన ప్రేమ గాథలు ఉన్నాయి.

ఇద్దరు వ్యక్తులు. ఇద్దరికీ దృష్టి ఆనదు. ఒక ఆట చూస్తున్నారు. అది 'క్రికెట్' అన్నాడు ఒకతను. కాదు 'బేస్ బాల్' అన్నాడు. వాస్తవానికి అది హాకీ. మర్నాడు రేడియోలో విని కాని వారు ధ్రువపరుచుకో లేదు.

యు. ఇందిర (మద్రాసు)

వెయ్యిమంది అనుమానితుల పేర్లు రాసిన ఆరు పేజీల ఉద్గ్రంథం మాకు చేరింది. అది చూసి మేము కొయ్యబారి పోయాము. ఇంతమందినీ అనుమానించాలా అనే అనుమానం వచ్చింది. ఏది ఏమైనా సెర్జ్ రాబిన్‌స్టైన్‌కు వ్యాపార రీత్యాగాని, స్నేహరీత్యాగాని సంబంధమున్న మనుష్యులు ఆ వెయ్యిమందిలోనే ఉండాలి అనుకున్నాము. మరొక జట్టు ఆ జాబితా ప్రకారం మనుష్యులను ఎంచి, ప్రశ్నించడం ప్రారంభించింది.

నేను నా గదికి చేరేసరికి అర్ధరాత్రయ్యింది. చాలా అలసటగానూ, చికాకుగాను ఉంది. నీలాకాశం మీద నక్షత్రాలు మిలమిల్లాడుతూ, "హంతకుడెవరో మాకు తెలుసులే ! మాకు తెలుసులే !! తెలుసులే ! ! !" అంటూన్నట్టున్నాయి. విశ్వంలో సెర్జ్‌ని చంపినవాడు ఎక్కడో ఒక మూల ఉండి తీరాలన్నది నిర్వివాదం. కాని అతనెక్కడున్నాడు ? అన్నదే వాదాంశం. ఆ హంతకుణ్ణి వూహించడం ప్రారంభించాను. అద్దం ముందు వయ్యారంగా కూర్చుని, తన జుట్టు దువ్వుకుంటూ చిరు నవ్వు లొలికించే సుందరాంగా ? రాబిన్‌స్టైన్‌ని వ్యాపార లాభంకోసం చంపిన మరో వ్యాపారి నిద్రలేక, విస్కీసీసా చేతో పట్టుకుని మథనపడుతుంటాడా ? ఈనా వూహాగానం మూడవ ఎవెన్యూలో (బహుశా రాబిన్‌స్టైన్ని చంపి దొంగిలించిన) డబ్బుతో విస్కీ కొంటున్న దారి దోపిడిగాడి మీదకు మళ్ళింది.

"బాగా తెలియని వాటిని నిశ్చయంగా వూహించుకోడంలో అర్థంలేదు" అని నచ్చచెప్పుకున్నాను. కనుక తెలిసిన వాటిని కొంచెం ఎక్కువ తెలుసుకుంటే మంచిది అని నిర్ణయించుకున్నాను. ఈ రెండ్రోజుల్లో సెర్జ్ రాబిన్‌స్టైన్ని గురించి కొన్ని కొత్త విషయాలు తేలాయి.

మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం రాబిన్‌స్టైన్ తండ్రి— డిమిటర్ రాబిన్‌స్టైన్ — సైంట్‌పీటర్స్‌లో ఉన్న ఫ్రాంకో— రష్యన్ బ్యాంకుకు ప్రసిడెంటుగా పనిచేశాడు. 1918 వ సంవత్సరంలో, పదేళ్ళ వయస్సున్న సెర్జిని తీసుకుని, రష్యా నుంచి ఫిన్లండ్ — అక్కడ నుంచి స్వీడన్‌కు పారిపోయాడు. ఆయన పారిపోయి వచ్చినపుడు వీలైనంత ధనం తనతో తెచ్చుకోవడంవల్ల సెర్జ్ నిరాటంకంగా కేమ్‌బ్రిడ్జ్ యూనివర్సిటీలో ఎకనామిక్స్ పట్టం పుచ్చుకుని, ఆనక స్విట్జర్లండ్‌లో నివాసం ఏర్పరచుకున్నాడు.

సెర్జి కూడా తన తండ్రి అడుగుజాడలలో నడిచి, డబ్బు సంపాదించడంలో తండ్రికన్నా ఘనుడనిపించుకున్నాడు. కానీ అతను వూరు, పేరు లేని వాడు. షాంగ్‌హైకి పోర్చుగీసు పాస్‌పోర్టుతో వచ్చాడు. అక్కడ అతను తన తెలివితేటలనుపయోగించి బంగారము, స్టాక్ వ్యాపారం ప్రారంభించి, రష్యా సరుకులు చైనాలో అమ్మి డబ్బు గడించి, ఆనక తన తెలివితేటలు ఇంకా ఎక్కువవ్వాలంటే అమెరికా వెళ్ళాలని తీర్మానించుకున్నాడు.

అమెరికాలో —'విదేశాలనుంచి వచ్చేవారి వివరాలు సేకరించు శాఖ'కి సెర్జి పోర్చుగీసు దేశానికి గాని, మరియే దేశానికి గాని చెందనివాడని తెలిసింది. పైగా అక్రమ పద్ధతిలో ఒక స్త్రీకి పుట్టినవాడని కూడా అభియోగం చేసింది. కానీ సెర్జ్ ధనం, పలుకుబడి వాటిని జయించాయి. అతను అమెరికాలో ఉండి పోయాడు. తరువాత యుద్ధ సమయంలో అతన్ని వెళ్ళగొట్టడం ఎవరి తరము కాలేదు.

సెర్జ్ రాబిన్‌స్టైన్ కాలం వృథా చెయ్యకుండా తన డబ్బు చాలా వ్యాపారాల్లో పెట్టేశాడు. దాదాపు ముప్ఫై కంపెనీలలో తన ప్రమేయం వుండేలా చేసుకున్నాడు. యుద్ధ కాలంలో అతను తెలివిని ఉపయోగించి కెనడా స్టాక్ మార్కెట్‌లోను, నూనె, తదితర వాట్లలోను తన డబ్బును పెట్టి — మూడంతలు కాకపోతే, రెండంతలు లాభాలను సంపాదించి, తన ధనాన్ని మూడు పెట్టి గుణించి గడించాడు.

యుద్ధంలో డబ్బు గడించి, 1941లో లారియట్ కిల్‌బర్న్ అనే ఆమెను వివాహం చేసుకున్నాడు. ఆనక డయోన్, శాండ్రా అనే ఇద్దరు పిల్లల తండ్రి అయ్యాడు. కానీ అతను ఏ దేశి

యుడో తెలుపే) పత్రాన్ని దాచిపెట్టాడన్న నేరం అతని మీద ఆరోపించి న్యాయశాఖ వారు అతన్ని ఆక్షేపించారు. సెర్జ్ లంచంపెట్టి చూశాడు. ఆ శాఖవారిని భయపెట్టాడు. మభ్య పెట్టాడు. బెదిరించాడు. ఎన్ని చేసినా అతని కేసు రూపు మాయలేదు. చివరి కతను 1948 వరకు అజ్ఞాత వాసం (జైలు) గడపవలసి వచ్చింది.

అతను జైల్లోంచి బయట పడ్డాడు. జైల్లోకి

# అంతుదొరకని హత్య

వెళ్లిన సెర్జ్‌కి, బయటికి వచ్చిన సెర్జ్‌కి చాలా తేడా ఉంది. ఇదివరకులాగా కాక, అతను గంభీరుడయ్యాడు. దేశం నుంచి ఛస్తే కదలకూడదన్న పట్టుదల ఎక్కువ చేసుకున్నాడు. సోవియట్ రష్యా సెర్జ్‌ని తమ దేశానికి రమ్మని ఆహ్వానించనందువల్ల సెర్జ్ మాతృభూమి సోవియట్ రష్యా కాదని తేలడంవల్ల న్యాయశాఖ వారు ఇరుకున పడ్డారు.

1949లో లారియట్ తన భర్త సెర్జ్ నుండి విడాకులు పొంది, తన పిల్లలను తీసుకుని వేరుపడి పోయింది. కొన్నాళ్లు గడిచాక ఆమె జాన్ లాక్వుడ్ అనే అతన్ని వివాహం చేసుకుని కాలిఫోర్నియాలో స్థిరపడిందని తెలిసి, మా శాఖలో కొందరు అక్కడికి వెళ్ళి ఆమె మాజీ భర్త హత్యకి సంబంధించిన వివరాలు దొరుకుతాయేమోనని వ్యర్థ ప్రయత్నాలు చేశారు.

1949వ సంవత్సరం అతని (రాబిన్‌స్టెన్)కి అచ్చిరాలేదు. న్యాయశాఖవారు చాలా నెమ్మదిగా తమ ప్రయత్నం కొనసాగించారు. —యుద్ధ సమయంలో అతని అవినీతి సంపూర్ణంగా తెలుసుకున్న అమెరికా అతన్ని వెళ్ళగొట్టాలని నిర్ణయించుకుంది. తను ఏ దేశానికయితే అతిథిగా ఉంటున్నాడో ఆ దేశాన్ని దోచుకున్నాడు. ఆశగా డబ్బు, దస్కం పోగుచేసుకున్నాడు. అవినీతి మార్గాలను అనుసరించాడు. కానీ తనని ఆదరించిన దేశానికి ఏమాత్రం మేలు చెయ్యలేదు. అమెరికా అధికార వర్గాలు అతని ఏడుపు పెడబొబ్బలను లక్ష్యపెట్టలేదు.

"నేను పన్నుల రూపేణా అమెరికాకు బోలెడు ధనం ఇస్తున్నాను— అది చాలదా ఏం ?" అని సెర్జ్ ఘోషించాడు.

మూడేళ్ళు గడిచేసరికి అతన్ని దేశ బహిష్కరణ చేసే సన్నాహాలు బలమై పోయాయి. తన దేశానికి సంబంధించిన పత్రాలు దాచాడు అనే నేరం అతని మీద బనాయించారు. కానీ అతను లొంగలేదు. కోర్టుమీద విరుచుకు పడ్డాడు. అతని కేసు జరుగుతున్న కాలంలో కూడా అతను తన వ్యాపారం మానలేదు. ఆ వ్యాపారం అతనికి కొన్ని మిలియన్ల డాలర్లు సంపాదించి పెట్టింది.

1954 లో దేశబహిష్కరణ జరిగిన వ్యక్తుల జాబితాలో అతని పేరు కూడా పెట్టారు. సెర్జ్ చెక్కు చెదరలేదు. పైగా సుప్రీంకోర్టుకు వెళతానని బెదరించాడు. ఈలోగా అతనికి బ్లయర్ హోల్డింగ్ కార్పొరేషను— 3,500,000 డాలర్ల నష్ట పరిహారం కోసం దావా వేసింది.

ఈ సమయంలోనే ఒకనాడు అతని సౌధంలోకి రాయితో కూడిన ఒక ఉత్తరం గాజు తలుపులోంచి ఎవరో విసిరారు.

"నిన్ను ఇప్పటికే చాలాసార్లు హెచ్చరించాము. ఇప్పటి కయినా ఊరు వదలి పోకపోతే ఫలితం అనుభవించవలసి వస్తుంది" అని ఉంది అందులో.

ఇది జరిగిన మూడు వారాలయ్యాక ఒకనాడు ఒక అజ్ఞాత వ్యక్తి సెర్జ్ ముఖం బద్దలయ్యేలా కొట్టి, ఒళ్ళు హూనం చేశాడు.

ఈ విషయాలు అతను పోలీసులకు రిపోర్టు ఇవ్వలేదు. లేనిపోని రిపోర్టుల వల్ల అధికారుల దృష్టి తనమీద తెచ్చుకుని, కొరివితో తల గోక్కోడం తప్ప ప్రయోజనం ఉండదని భావించాడు.

అతను తన్నులు తిన్న కొద్దిరోజులకే ఒక టెలిగ్రాం అతనింటికి వచ్చింది.

"—సౌమ్యుడుగా ఉండి, మన మనస్పర్థలు, తదితర విషయాలు చక్క బెట్టడానికి ప్రయత్నించు— ఇట్లు : యల్" అని ఉంది.

"ఎవడీ యల్ ?"

స్టాన్లీ— టి— స్టాన్లీ రాబిన్‌స్టైన్ ఫైళ్ళు తిరగతోడి ఆ 'యల్' అనేవాడు ఇమాన్యూల్ లైబర్‌మన్ అయ్యుండాలని అభిప్రాయ పడ్డాడు. అతని వ్యవహార నామం లెస్టర్ అనీ, సుమారు ముప్ఫయి అయిదేళ్ళుండవచ్చనీ, సెర్జ్‌మీద 75,000 డాలర్లకు ఒకదావా వేశాడనీ ఆరాలు తీశాము.

తనకు వచ్చే బెదరింపులు, బ్లాక్ మెయిల్స్ నుంచి కాపాడమని సెర్జ్ పోలీసుశాఖని కోరిన వైనం పోలీసు ఫైళ్ళలో ఉంది. జిల్లా ఎటార్నీ ఆఫీసు (లా ఆఫీసు) నుండి ఇద్దరు వ్యక్తులు అతని ఇంట్లో రహస్యంగా ప్రవేశించి, ఈ కోటీశ్వరునికి, లెస్టర్ లైబర్‌మెన్‌కి జరిగిన వాగ్వాదన విన్నారు. 533,000 డాలర్లు బలాత్కారంగా లాక్కున్నారనే నేరం మీద లెస్టర్‌ని, అతని అనుచరులిద్దరిని అరెస్టు చేశారు. తరువాత జామీను మీద వదిలేశారు.

రెండు వారాలు పోయాక కెనడా వ్యాపార భాగస్తులవద్ద నుంచి అతని కొక రహస్య లేఖ వచ్చింది. "దీనికంతకు ఫలితం వేరే ఉండనే ఉంది" అని అందులో ఉంది.

ఆ లెస్టర్ని కనుక్కోవాలి, పట్టుకోవాలని ఇక మేము ఆలోచించాము. సెర్జ్ రాబిన్‌స్టైన్ హత్యకు ఆరు గంటలు ముందు 'లాస్ ఏన్జిల్స్'లో ఒక హోటలు ముందు లెస్టర్‌ని మా శాఖవారు పట్టుకున్నారు. లెస్టర్‌కు హత్య ఎవరు చేశారో అన్న విషయం తెలియక పోయినా, ఎవరికి సెర్జ్‌ని హత్య చేసే అవసరం ఉంది అనే విషయం తెలుసు. మేమూ అతని అభిప్రాయంతో ఏకీభవించాము. డబ్బు దాచుకున్నవారిని అన్యాయం చేసి ఆ డబ్బు కాజేసే వాడనీ, అందువల్ల నిజానికి వందలకు వందలు అమెరికా వారు అతని మీద పగతీర్చుకోడానికి కంకణాలు కట్టుకు కూర్చున్నారని చెప్పాడు.

"దీనికంతకు ఫలితం వేరే ఉండనే ఉంది" అని అశుభాన్ని లేఖద్వారా సూచించిన కెనడా వ్యక్తిని కలుసుకున్నాము. "రాబిన్‌స్టైన్ చాలా గొప్పవాడేకాని, ఒక్క చెడ్డ గుణం మాత్రం వుంది. అతను ఏ ఒక్కనితోనూ స్నేహం నిలుపుకోలేడు. ఛటుక్కున ఎంతవానితోనయినా విరోధం పెట్టుకునేవాడు. దానికేమంత కారణం కూడా ఉండదు" అని చెప్పాడు. లీ బ్రూక్స్ అనే అతను కెనడియన్ స్టాక్స్‌లో వ్యాపారనీ, అతనికీ, రాబిన్‌స్టైన్‌కి విరోధం ఉండేదని చెప్పాడు.

ఈమాటమీద నిష్ప్రయోజనంగా బ్రూక్స్‌ని కలుసుకోడంకోసం ఒక గంటగడిపాము. రాబిన్‌స్టైన్‌ని రెండేళ్ళక్రితం ఒకే ఒక్కసారి చూశానని అతను చెప్పాడు. లోగడ లాంగ్‌ఫోర్టు హత్యలో అతన్ని పోలీసులు అనుమానించినా, రాబిన్‌స్టైన్ విషయంలో అతను చెప్పింది సమ్మతంగానే ఉంది.

రాబిన్‌స్టైన్ హత్య గావింపబడిన ఐదోరోజున అతని హత్య వివరాలు ఎంతవరకు ప్రోగు చేశామో అనే విషయం తేల్చుకోడానికి సమావేశమయ్యాము. ఆ సమావేశానికి వచ్చిన వారంతా నిరుత్సాహమైన, విశ్రాంతిలేని, ఆత్రం, ఆనందంలేని ముఖాల వాళ్ళే అని అనక తప్పదు. గెడ్డాలు తడుముకున్నాము. బుర్రలు గోక్కున్నాము. ఏమీ తేలనేలేదు.

**అంతవరకూ మా అనుమానితుల జాబితాలో** ఏడువందల పేర్లు చేరాయి. అందర్నీ ప్రశ్నించాము.

మా సిబ్బందిలో కొత్తగా వచ్చినతను "నాకు తెలిసినంతవరకు, సెర్జ్‌రాబిన్‌స్టైన్ మిత్రులనబడే వారెవ్వరూలేరు" అని ఉద్ఘాటించాడు. ఈ పాటమే మిదివరకు పాడినదే!!

కొన్నాళ్ళు గడిచాక, బార్బరాకుక్ అనే ఒక ఉద్యోగం, సద్యోగంలేని నటివచ్చి (లోగడ మేము ఆమెను ప్రశ్నించాము) కొన్ని కొత్త విషయాలు చెప్తానంది. ఆమె తనిష్టం వచ్చినట్టు చెప్పిన విషయాలన్నీ పత్రికా ప్రతినిధులు ఆశతో ఏరుకుని, ప్రచురించుకున్నారు. వారెన్ని విధాలుగా ఏవేవి రాసినా ఆమెకు కోపం కలగనేలేదు.

"మీకు తెలియవలసిన ముఖ్యమైన విషయం ఒకటి వుంది" అంటూ ప్రారంభించి, "జాక్ రోజర్స్, పాట్‌రే (సెర్జ్ సెక్రటరీ) ఇద్దరూ ఒకే నివాసంలో ఉండేవారు. కొన్నాళ్ళపాటు సెర్జ్ మిత్రబృందంలో ఒకతె. పైగా ఆమెను అతను చాలా అధికంగా ప్రేమించాడు" అంటూ తన కథనాన్ని ఆపి, కుర్చీలోంచి లేచి కిటికీ వద్దకు వెళ్ళి నిలబడి, నాటకాల ఫక్కీలో మాకేసి ఒక కోణంలో చూసింది.

**"నేనింతవరకూ ఎన్నడూ ప్రేమలో పడలేదు" అన్నది ఒక తార.**

**"మరెక్కడపడ్డావు?" అన్నాడు పరధ్యానంగా ప్రొడ్యూసర్.**

**"ప్రొడ్యూసర్ వలలో" నన్నదామె కోపంగా!**

మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చుని అందమైన తన ముఖానికి అమాయకతను పూసి, మరింత అందంగా నవ్వుతూ, "కాని, ఎవరి రహస్యాలనూ రచ్చకీడ్వకూడదనే నియమం నాకుంది. అందుకని నేను చెప్పలేకపోయాను" అంది.

నాకు చిర్రెత్తిపోయింది. "అనకేమయ్యింది? సెర్జ్ ఏమన్నాడు. ఊ చెప్పండి" అన్నాను కోపంగా అరుస్తూ.

"సెర్జ్‌కి ఎందుకో పాట్‌రేమీద అనుమానం పుట్టింది. ఆమె పడకగదిలోవున్న ఫోనుకు టేప్ రికార్డర్ పెడదామనుకునే స్థితిలోకి వచ్చాడు" అని మళ్ళీ మూగగా కూర్చుంది. చివరికి ఆమె చెప్పిన కథ సారాంశం వంట పట్టించుకున్నాము.

"ఒకనాటి రాత్రి ఆమె గదిలో ఫోనుకు తగిలించిన రికార్డు 'టేపు' వినిపించాడు. పాట్‌రే ఎవరో ఒక స్త్రీతో మాట్లాడుతోంది. అవతలివైపు ఆమె పేరు మాత్రం స్పష్టంగా వినపడలేదు. కానీ, ఆ—అవతలి వైపు ఎవరున్నారో తెలియకపోయినా, ఆ వున్నవారు మాత్రం హంతకునితో ఉన్నారు అని మాత్రం స్పష్టం అవుతోంది. 'అతను తల్చుకుంటే వాళ్ళందర్నీ చంపెయ్యగలడు' అని ఒక మాట వినబడింది. దీనర్థం నాకంతగా తెలియకపోయినా మీకు ఉపయోగం ఉండచ్చు" అని చెప్పింది.

నిజానికి మాకు కావలసినది అదే! హంతకుడు దొరక్కేకదా ఈ అవస్థలు? మళ్ళా పాట్‌రేని కలుసుకున్నాము. **ఈసారి ఆమె ధోరణి మారింది.**

ఆమె మత్తుగా నవ్వుతూ, "హంతకుడెవరో చాలా భయంకరుడు. మనుష్యులను చంపడమే కాకుండా, చీల్చి చెండాడి, భూస్థాపితం కూడా చేస్తాడు" అంది.

సెర్జ్ ఇంట్లోవున్న రికార్డులు వినాలనుకున్నాము. ఒక టేపు దొరికింది. దాన్ని చాలాసార్లు వేశాము. ఎవరో ప్రభుత్వాధికారికి, పాట్‌రేకి మధ్య చిన్న వాగ్యుద్ధంలావుంది. వారి మధ్య నేవో అసూయలు, ద్వేషాలున్నట్టు కనబడ్డాయేతప్ప, సెర్జ్ రాబిన్‌స్టైన్‌గురించి ఒక్క ముక్క కూడా వినబడలేదు.

మేము బుర్రకి పని కల్పించాము. తన ఆడ స్నేహితులలో ఏ ఒక్క స్నేహితురాలి ద్వారానయినా 'వలస పోయినవారి సమాచార శాఖ'గాని, 'న్యాయ శాఖ'గాని కూపీలు తీయిస్తున్నారేమో! ఇంత మందిలో ఎవరైనా గూఢచారిణి ఉందేమో అన్న అనుమానం సెర్జ్‌కి కలిగి ఉంటుందనుకున్నాము. లేక తనను దేశంనుంచి వెళ్ళగొట్టాలని ప్రయత్నించే శాఖలో అధికారిని సెర్జ్ రాబిన్‌స్టైన్ లోబరచుకుని, బ్లాక్‌మెయిల్‌చేస్తూ తనను తను రక్షించుకున్నాడా? అనే అనుమానం కూడా వచ్చింది. అలా అయితే ఆశాఖ అధికారి సెర్జ్ పోరు పడలేక, చంపే అవకాశం ఉండవచ్చు.

బజార్లో పేపర్లమ్ముకునే కుర్రకుంకిడికాయిని మొదలు సెర్జ్ ఆస్తి కాపాడేవాని వరకూ కొన్ని వేల మందిని ప్రశ్నించాము. ఈ పరంపరలో మాకు సెర్జ్ జీవితంలో కొన్ని తమాషాలు తెలిశాయి.

సెర్జ్ తన తల్లికోసం 'ఎక్స్‌రే' తియ్యడానికి ఒక ఎలక్ట్రో కార్డియోగ్రాఫ్ కొన్నాడనీ, అతనితల్లి హృదయభాగం ఎక్స్‌రే తీశాక, ఆ వివరాలు సెర్జ్‌కి చెప్పాక, అతను ఫీజు ఇవ్వనని మొరాయించాడనీ, అదేమంటే నీకు తెలిసినంత నాకూ తెలుసని బుకాయించాడనీ ఒక డాక్టరు చెప్పాడు.

ఒక కొట్లాటలో రాబిన్‌స్టైన్ ముక్కు ఎముక విరిగిపోయిందనీ, ఆ విరిగిన ముక్కును సరిచేశాక, సరిచేసిన ముక్కు అందంగా ఉండడానికి ప్లాసిక్ సర్జరీ చేయించుకున్నాడనీ, తత్ఫలితంగా ముక్కుతో సులభంగా గాలి పీల్చలేకపోయేవాడనీ మరొక డాక్టరో చెప్పాడు.

రాబిన్‌స్టైన్ నోటిమీద పాలాస్త్రి వంటిది వేసినంతమాత్రానికే అతను చనిపోవడానికి ఇదో కారణమనుకున్నాము. అతన్నావిధంగా చేసి చంపవచ్చున హంతకునికి నిర్ధారణగా తెలిసివుండి తీరాలి.

మా పోలీసుశాఖ వ్యూహాల ప్రకారం ఏ విధమై అనుమానితుడూ దొరకనేలేదు. ప్రతీచోటా, ప్ర వ్యక్తి అనుమానించదగినవాడిలా కనపడుతూ ఉన్నాడు. ఇంతా కష్టపడి, సెర్జ్‌తో స్నేహము ప్రతీ ఆడమనిషినీ అనుమానించి, వాళ్ళ చుట్టూ తిరిగి, నానా తంటాలుపడినది అందర్నీ నిరపరాలుగా ఎంచి విడిచి పెట్టడానికేనా?

"రాబిన్‌స్టైన్ వ్యాపార సరళిలో పరులచేత ఛీ అనిపించుకోడానికి కారణాలు తెలియాలంటే వీళ్ళ కలుసుకోవచ్చు" అంటూ మాకు సహాయం చే స్టాన్లీ—టి—స్టాన్లీ ఒక పది పేరులున్న జా మా కిచ్చాడు. ఆ జాబితాని సెర్జ్‌రాబిన్‌స్టైన్ నా మార్చర్ చూసి, "అరెరె!! వీళ్ళందరూ చాలా మనుష్యులు. రెండు మూడేళ్ళనుంచి వీళ్ళ

# అంతుదొరకని హత్య

బంగళా [illegible] రానేలేదు. ఫోనైనా ఎన్నడూ చెయ్యలేదు. రాబిన్‌స్టైన్‌తో వారికి ఏ విధమైన సంబంధం లేనేలేదు'' అని ఉద్ఘాటించాడు.

మళ్ళీ మా కథ చుట్టు తిరిగి మొదటి కొచ్చింది. రాబిన్‌స్టైన్ 'ఆడ స్నేహితు'లను తిరిగి కలుసుకుని ప్రశ్నించడం ప్రారంభించాము.

జాక్ రోజర్స్ కాలిఫోర్నియాలో కనబడింది. అతనిని గురించిన వివరాలేమీ తనకు తెలియవనీ, కుతూహలమూ లేదనీ, తనకు ఆ గత జీవితాన్ని స్మరణకు తేవద్దనీ ఆమె చెప్పింది.

*　　　*　　　*

ఒక పొట్టి మనిషివచ్చి జిగురు 'టేపు' చుక్కల మందు (కంటిమందు) కొన్నాడని — లెక్సింటన్ 49 లో ఉన్న ఒక షాపతను చెప్పాడు.

ఆ వ్యక్తి కొన్న టేపు హతుని మరణానికి ఉపయోగపడిన టేపు ఒకటే కొలతలు, ఆకారం ఉన్నంత మాత్రాన్న అతనే హత్య చేశాడని చెప్పలేం కదా! పైగా ఆ షాపువాడు ఆ పొట్టివాణ్ణి మళ్ళీ ఎన్నడూ చూడలేదట! న్యూయార్కులోవున్న కొన్ని మిలియన్ల జనాభాలోఉన్న పొట్టి వాళ్ళలో మనకు కావలసిన పొట్టివాణ్ణి ఎంచాలి అనే విషయం తల్చుకునేసరికి నడుం విరిగిపోయింది.

"రాబిన్‌స్టైన్‌కి ఏమైనా మందు ప్రయోగం చేశారా?'' అని ఆ షాపువాడు అడిగాడు. అది ఒక పాయింటే!! డాక్టర్ రిపోర్టు మేమనుకున్నట్టుగా లేదు. ఇంత జగజెట్టీ అయిన రాబిన్‌స్టైన్ని అసలు ఎలా చంపగలిగారా అని మేం ఆశ్చర్యపడ్డాము.

చాలా గొప్పరోజైన ఫిబ్రవరి 14 వ తేదీ మాకూ గొప్ప రోజు అయ్యింది. పత్రికా ప్రతినిధులకు, పత్రికాధికారులకు మేమంటే చులకన భావం పుట్టి, అసలీ కేసు కావాలనే మేము కప్పి పుచ్చుతున్నామని తెగేసి ఉద్ఘాటించారు. ప్రచురించారు. మేం వడ్డపాట్లు, నిద్రలేక తిరిగిన తిరుగుడు చికాకుపడి పిచ్చెత్తినట్టు తిరిగిన తిరుగుడు, భంగపడి నొచ్చుకున్న వైనాలు ఇవన్నీ మాలో మాకు తెలుసుగాని, పరాయి వాళ్ళకి ఎలా తెలుస్తుంది. వాళ్ళవల్ల జనం మామీద విరుచుకురపడ్డారు. "మమ్మల్ని విసిగించకండి. మేము చాలా గొడవల్లో ఉన్నాము'' అనడం తప్ప మేమేవిూ సమాధానాలు చెప్పలేకపోయాము.

ఉన్నట్టుండి ఆశాజ్యోతి నీలం కాంతులతో మాకు కన్పించింది. ఇహ ఈ కేసు పరిష్కారానికి వచ్చినట్టే అని ఆనందించాము.

హెర్మన్‌స్కాల్ట్జ అనే అతను తనకై తానే ఒక సాక్ష్యం పట్టుకు వచ్చాడు. అతను చెప్పిన కథనం వల్ల అనుమానం తనమీదకే వచ్చేలావుంది. అతను తనీ కేసు పరిష్కారం చేసేవాడిలా ఆనందించాడు.

లియోసైన్ (ఒక రకం కారు) ని అద్దెకు తోలేవాడిననీ, అదిగాక, ఎవరెవరో మనుష్యులు కనబడని వారి ఆజ్ఞలను పాటించి, మనుష్యులను ఎత్తుకుపోవడమే వ్యాపారంగా పెట్టుకున్నవారికి అండగా కూడా ఉన్నాననీ, స్కాల్ట్జ మాతో చెప్పి, నిరూపించుకోడానికి తన మందిరానికి తీసుకువెళ్ళి — జిగురు టేపులు వాటంతటవిగా పైకొచ్చే కత్తులూ, వాకులూ, తుపాకులు, తాళ్ళూ అవన్నీ మాపించాడు.

ఇవన్నీ మాకు ఆశ్చర్యంగా కనుపించాయి. ఆ జిగురు టేపు వగైరాలన్నీ రాబిన్‌స్టైన్ హత్యకు ఉపయోగించిన వాటిలాగానే ఉన్నాయి. అంతమాత్రం చేత హంతకుడు దొరికినట్టు కాదుగదా! స్కాల్ట్జని చూస్తే హత్యలుచేసే దిట్టలా కనుపించలేదు. కొన్ని వారాలు గడిచాక, "బహుశా మా ముఠాలో ఎవరైనా ఈ హత్య చేసి ఉండవచ్చు'' అన్నాడతను.

"తొందరగా చెయ్యడంవల్ల తొందరపాటు కనుపిస్తోంది. ఏమ్టి? నేనా? బాబోయ్! నేనేపాపం ఎరుగనండోయ్! నన్ను నమ్మండి. నేను రాబిన్‌స్టైన్‌ని హత్య చెయ్యలేదు. అందుకు నాకు సాక్ష్యంకూడా ఉంది'' అంటూ నానాగోలా చేశాడు.

అతనే చేసినా, హత్యా సమయంలో అతను మరొకచోట ఉన్నట్టు ప్రబల సాక్ష్యం ఉంది.

మేము వెంటనే అతన్ని అరెస్టుచేసి, 25000 డాలర్ల జామీనుమీద వదులుతామని చెప్పాము. (బహుశా అతనంత ధనం తేలేడని వూహించి.) చివరికి అతను మాతో ఏమీ మాట్లాడలేదు. ఏ విషయం నోరెత్తి చెప్పనేలేదు. అతనికి సంబంధించిన వారైనా రంగంలోకి వస్తారేమో అని ఎదురు చూశాము.

ఎవ్వరూ రంగంలోకి రాలేదు.

డిశంబరు 25 వ తేదీన దిన పత్రికలవారికి మరో సంబరంవంటి విషయం దొరికింది.

రాబిన్‌స్టైన్ ఇంటికి కాపలా చాలా రోజులు ఉంచి, చివరికి తీసేశాము. నికరంగా మేము కాపలా తీసేశాక, అతని ఇంటిమీద ఎవరో దాడి చేశారు. రాబిన్‌స్టైన్ గదిలో ఎవరో ఒక వ్యక్తి జొరపడి, అతని పడకగదిలో జొరపడ్డాడు. అది అర్ధరాత్రి. ఆ వచ్చినది దొంగా? లేక హంతకుడా? లేక హంతకురాలా? ఆమెకు లేక అతనికి ఆ ఇంట్లో కావలిసిన దేమిటి?

ఆ ఆగంతకుడు (లేక—కురాలు) ఎవరో అంతు చిక్కకుండా నేర్పుగా తప్పించుకున్నాడు.

1955 మే 19 వ తేదీనాడు స్టాన్లీ— టి— స్టాన్లీ తన రూములో చనిపోయి ఉన్ననాడు కూడా మేమింకా ఆ కేసును పరిశోధిస్తూనే ఉన్నాము. అతని చావు గుండె ఆగడంవల్ల సంభవించిందని డాక్టరు తేల్చాడు. అతను చాలా పిరికిగుండె వాడని ధృవపడింది. ఈ కేసు మొత్తమంతా కొరకరాని కొయ్యగా తయారయ్యింది.

ఈ విషయం జరిగి పద్దెనిమిది నెలలయినా కేసు మొదటి స్థితిలోనే ఉంది. ఇంతమటుకు తేలనే తేలలేదు. కనుక చదువరీ—నువ్వి హత్యాకాండని పరిశోధించి, లక్షాధికారి, ప్రేమింపబడని ప్రేమికుడు సెర్జ్ రాబిన్‌స్టైన్ని చంపిన వ్యక్తిని కనుక్కున్నట్లయితే 25,000 డాలర్లు నీకు బహుమతి లభిస్తుంది.

రాబిన్‌స్టైన్ సాంవత్సరికంనాడు అమెరికాలో వున్న దిన పత్రికలన్నీ అతన్ని గురించి ఒక చిన్న కథని ప్రచురించాయి. స్టెల్లా రాబిన్‌స్టైన్ 'పితృదేవతల రోజు'న ప్రఖ్యాత అపరాధ పరిశోధకులం అని గర్వపడేవారినందర్నీ, తన స్నేహితులమ కొందర్నీ ఆ బంగళాలో సమావేశ వరచింది.

అక్కడకు హాజరైన వారియందు (ఆమెకు గల) నమ్మకంతో—రాబిన్‌స్టైన్ హత్య సందర్భంలో (హతుని మైమరపించి, మైమరచిన) అనుమానితుల పేర్లు నాలుగు తెల్పబడ్డాయనీ, అదేగాక లండన్‌లో ఒక 'చిరునామా' కూడా తెలియజెయ్యబడిందని ఒక దిన పత్రిక ప్రకటించింది. ★

---

# జానకి డైరీ

23 వ పేజీ తరువాయి

కలం కాగితం తీసుకుని వ్రాయండం మొదలు పెట్టింది—

సాయంత్రం అయిదున్నర గంటలయేసరికి ఆఫీసు వాతావరణం ప్రశాంతత నవలంబించింది. తన డిపార్టుమెంటులో ఒకళ్ళిద్దరు తప్ప ఎంతో మందిలేరు. మీాదనున్న ఫేను చల్లగాలి నిస్తోంది. దీక్షణంగా ఏదో ఫైలు లిరగేస్తున్న సీతాపతి భుజంపై ఎవరో తట్టారు. పైకి చూచిన సీతాపతి ఆశ్చర్యంగా లేచి నించున్నాడు.

"అయామ్ సారీ సీతాపతి ! అనవసరంగా )కు కోపం తెప్పించాను. తప్పు నీదికాదని తెలి)ంది. నిన్ననవసరంగా అన్నందుకు చాలా బాధ డ్డాను. మరోలా అనుకోక'' అన్నాడు మేనేజర్ ప్పుతూ.

సీతాపతి పరమానంద భరితుడయ్యాడు. )నేజరు తనంత తాను వచ్చి అలా అంటాడని కలలోకూడా అనుకోలేదు. ఆయనకు తిరిగి ఏదో సమాధానం ఇద్దామనుకుంటూండగానే మేనేజర్ వెళ్ళి పోయాడు. అంతవరకు చిరాకుగా నున్న సీతాపతి మనసు ఒక్కసారిగా తేలిక పడింది. తప్పు తనది కాకపోయినా, మేనేజర్‌తో అనవసరంగా ఘర్షణ పడవలసి వచ్చినందుకు ఎందుకో అతని మనసు పాడయింది. తాను అంతకోపం తెచ్చుకోవలసిన పనిలేదు కూడాను. ఏదో పొరపాటు బడ్డాడు మేనేజరు. తనకంటె పై అధికారి కనుక పిలిచి అడిగాడు. తన పొరపాటును తెలుసుకున్నాక, తనంత తాను వచ్చి ఒప్పుకున్నాడు. తన అమాయకత్వం వలన తెలివిలక్కువ తనం వలన సీతాపతే అనవసరపు కోపానికి దాసుడై పోయాడు.

తను కోపంగా మేనేజరు రూమ్ నుండి బయటకు వచ్చి చీటీ వ్రాస్తున్నప్పుడు డిపార్టుమెంటులోని వాళ్ళంతా తనవైపే కళ్ళప్పగించి చూచారు. ఆ దృశ్యం గుర్తుకు వచ్చేసరికి సీతాపతి సిగ్గుపడిపోయాడు. తనకు కోపం అంటే ఎలాగుంటుందో తెలియందని ఎన్నిసార్లో, ఎందరితోనో చెప్పేవాడు. అతని గురించి అందరూ అలాగే చెప్పుకునేవారు కూడాను. తనకు అంత కోపం వచ్చిందంటే తానే నమ్మలేక పోయాడు. జానకికి వ్రాసిన ఉత్తరం జ్ఞాపకం వచ్చింది. తాను భోజనానికి వెళ్లలేకపోయినందుకే జానకి ఎంతో బాధపడుతూ ఉంటుంది. బహుశా ఆమె కూడా భోంచేసి ఉండదు. అలాంటి సమయంలో అంత కఠినమైన ఉత్తరం ఆమెకు వ్రాస్తే ఆమె ఎంత బాధపడి ఉంటుందో ! ఆ చీటిలో 'ప్రియమైన జానకీ !' అనైనా వ్రాయలేక పోయాడు. ఆఫీసులో కలిగిన చిరాకు జానకి మీాద చూపించటం తన మూర్ఖత్వాన్ని వెల్లడి

చేస్తోంది. మరవు ఎవరికైనా వస్తుంది. పాడు మనిషి ! ఆ ఫాన్సీస్టోర్స్‌వాడు ఆఫీసుకే ఫోన్ చేయాలా ? రెండు రోజు లాలస్యమైతే మాత్రం తనను నమ్మలేడా ! జానకిపై తనకంత కోపం రప్పించడానికి వాడే కారణం. అతిసున్నితమైన జానకి హృదయం ఎంతలా కలవరపడుతోందో ? తను వెంటనే వెళ్లి ఆమెను క్షమార్పణ కోసం వేడుకోవాలి !

కలవరపడుతున్న హృదయంలో తన కెదురుగా మన్న ఫైలు మూసి కుర్చీలోంచి లేచాడు సీతాపతి. ఆఫీసు నుండి బయటకు పోతున్న మానేజర్ సీతాపతివైపు చూచాడు. "నిన్ననేవో పుస్తకాలు తెమ్మన్నాను. తెచ్చావా సీతాపతి !"

"ఓ ! అయాప్ సారీసర్ ! ఇవ్వడం మరచాను. ఇదుగో" అంటూ తన డ్రాయర్‌లోంచి కొన్ని పుస్తకాలు బయటకు తీసి మేనేజర్ చేతిలో పెట్టాడు. ఒక్కొక్క పుస్తకాన్నే విడివిడిగా చూస్తున్న మేనేజరు, "నీ డైరీ కూడా నాకిచ్చేస్తున్నావే !" అంటూ ఒక పాతడైరీ తీసి అతని టేబుల్ మీద ఉంచాడు. ఒక్కసారిగా ఉలిక్కిపడ్డ సీతాపతి, "థాంక్యూ, సర్ !" అంటూ ఆ డైరీ తీసికొని తన డ్రాయర్‌లో ఉంచేసుకున్నాడు. "థాంక్యూ సీతాపతీ !" అంటూ మేనేజరు పుస్తకాలు తీసుకుని వెళ్లిపోయాడు.

సీతాపతి గుండెలు దడదడా కొట్టుకున్నాయి. డైరీని బయటకు తీసి ఒక్కసారి చూచాడు. మళ్లీ వెంటనే డ్రాయిర్లో పెట్టేశాడు. ఎంత పొరపాటు జరిగింది ! పాపం జానకి ఎంత కలవరపడిపోతోందో ! ఏ వస్తువును తను తిరిగి చూడకూడదనుకున్నాడో, అదే తన కళ్ళెదుట స్వేచ్ఛగా కనుపిస్తుంది — క్షమించరాని పొరపాటు చేశాడు.

'పొరపాటు' జానకిదికాదు. తనదే ! కుమిలి కృశించిపోతున్న జానకి హృదయాన్ని శాంత పరచాలంటే తనేమి చేయాలో అర్థం కాలేదు. తను డైరీ తీసుకు వచ్చేసినట్లు ఆమెకు తెలియదేమో! తెలియకుండా ఎలా ఉంటుంది ? పాపం ముందు రాత్రి చదివి పొరపాటుగా ఆ అరలో పెట్టి ఉంటుంది. అందుకనే తను పుస్తకాలకోసం అర దగ్గరకు వెళ్ళేసరికి కంగారు పడింది కూడా ఇంటివద్ద తప్పకుండా జానకి బాధపడుతూ ఉంటుంది. ఆమె మనసు శాంతింప జేయాలంటే ఒకటే మార్గం. తానిన్నాళ్లు దాచి ఉంచిన విషయాన్ని ఆమెకు చెప్పేయాలి ! అవును. అంతే— పెళ్లయిన నాటినుండి ఇంతవరకు ఆమెనొక కఠినమైన మాటకూడా అని యెరుగను. తన పరుషమైన వాక్యాలు చదువుకుని ఆమె ఎంత బాధపడి ఉంటుందో ! ఆమెనెలా లాలించాలో ఆలోచించి, కలం, కాగితం తీసి వ్రాయడం మొదలుపెట్టాడు.

ఉత్తరాన్ని పూర్తిచేసి మడత పెడుతుండగా ఆఫీసు గడియారం ఆరు గంటలూ కొట్టేసింది. మనసు కొంచెం శాంత పడింది. ఫైల్సు అన్నింటినీ డ్రాయర్‌లో పెట్టి, డైరీతీసుకొని, బయల్దేరాడు.

* * *

చప్పుడు కాకుండా మేడమెట్లు ఎక్కిన సీతాపతి హాలు తలుపు తెరచి ఉండడం, హాలులో జానకి లేకపోవడం చూచి కంగారు పడ్డాడు. మెల్లిగా వెళ్లి పడకగదిలోకి తొంగి చూచాడు. ఒక్క క్షణం అలాగే నిలబడి పోయాడు— సీతాపతి పటాన్ని బల్లమీద ఉంచి మవునంగా కూర్చుంది జానకి— ఆమె కళ్లవెంట నీళ్లు చెక్కిళ్ల మీదుగా ఆతనికి వ్రాసిఉంచిన ఉత్తరంపై పడుతున్నాయి. ఆమె అవస్థను పూర్తిగా అర్థం చేసుకున్న సీతాపతి గుండె చెరువయ్యింది. 'జానకీ ! అని గట్టిగా పిలుద్దామనుకున్నాడు. నోరు పెగల్లేదు. కాని తన చెయ్యి తలుపుపై శబ్దం చేసింది. అలజడికి ఉలిక్కిపడ్డ జానకి కళ్లనీళ్లు తుడుచుకుంటూ వెనక్కు తిరిగి చూచింది. అమాయకంగా గుమ్మం వద్ద నిలబడ్డ సీతాపతిని చూచి నిశ్చేష్టురాలయింది. అప్రయత్నంగా లేచి నిలబడింది. ఆమె కళ్లల్లోకి చూస్తూ సీతాపతి ఆమె వద్దకు వెళ్లాడు. చేతిలో నున్న ఉత్తరాన్ని ఆమె చేతిలో పెట్టాడు. ఆశ్చర్యంతో జానకి ఆ ఉత్తరాన్ని అందుకుంది. బల్లపై తను ఉంచిన ఉత్తరాన్ని కళ్లతో అతనికి చూపించి, మవునంగా హాలులోకి వెళ్లిపోయింది. అనుకోకుండానే సీతాపతి కుర్చీలో కూలబడ్డాడు.

హాలులోకి వెళ్లిన జానకి సీతాపతి వ్రాసిన ఉత్తరాన్ని వణకుతున్న చేతుల్తో విప్పింది.

"ప్రియురాలు జానకిని నీపతి ఆశీర్వదించి వ్రాయునది—జానకీ! నీ హృదయాన్ని ఎంతగానో

రాజు :— నువ్వు యిన్ని పుస్తకాలు కొంటావ్ ? ఎందుకేనా పనికొస్తాయా ?

రావు — ఆహా ! పత్రికలన్నీ వీశెల్లెక్కనా, పుస్తకాలన్నీ పేజీ ల్లెక్కనా అమ్మేయడానికి పని కొస్తాయి.

జగన్ (ఉప్పూరు)

హింసించినవే నొక అమూల్యమైన వాగ్దానాన్ని త్రోసిపుచ్చాను. ఇంతవరకు ఆ వాగ్దానం గురించి చెప్పనవసరం లేకపోయింది. ఇప్పుడు చెప్పకపోతే నా మనసుకు శాంతి కల్గదు.

నీవు కాపరానికివచ్చి, అప్పటికి పదిహేను రోజులు కూడా పూర్తిగా అయిఉండదు. ఆఫీసు అంతకీ ఒక్కడే నాకు స్నేహితుడుగా ఉండేవాడు. అతని పేరు గోపాలరావు. నేను ఆఫీసులో చేరిన దగ్గరనుండీ మా ఇద్దరి మధ్యా చాలా విషయాల్లో పోలికలుండడం మూలంగా ఇద్దరం చాలా స్నేహంగా ఉండేవాళ్ళం. ఒకనాడు హోటల్లో ఇద్దరం కబుర్లు చెప్పుకుంటున్నాం. తన కాలేజీ జీవితంలోని అనుభవాలను చెప్పుకు పోతున్నాడు గోపాలరావు. జానకి అనే అమ్మాయి, మధుసూదనరావు అనే అబ్బాయి ప్రేమించుకున్నారని, మరీ దారుణంగా కనుపించేవాళ్ల ప్రవర్తనను చూచి కాలేజీ విద్యార్థులంతా అలజడి చేశారనీ, అలజడి చేసిన విద్యార్థులను కొందర్ని ప్రిన్సిపాల్ గారు డిస్మిస్ చేశారనీ అతడు చెప్పుకుపోతోంటే ఎందుకో నాలో అనవసరపు అనుమానం కలిగింది. ఎవరా జానకి, ఏ సంవత్సరాల్లో చదివింది, ఏవ్వారి అమ్మాయి అని అంతా ఆరాతీశాను. నా అనుమానం నిజమై పోయింది.

సంగీతం 'పాడా' ఎగా నచ్చునని గోపాలరావు చెప్పడంతోనే నీవే ఆ జానకివని తెలుసుకొని తెల్లబోయాను. నా ముఖ కవళికలను చూచిన గోపాలరావు ఇంక అంతటితో ఆ విషయం చాలించాడు. నా అనుమానాన్ని తీర్చుకుందుకు ఎన్ని ప్రశ్నలు వేయాలో అన్నీ వేశాను. అయితే గోపాలరావు ఎదురుగా మాత్రం ఆ జానకి భర్తను నేనే నని తెలిపోలేదు.

భగ్న హృదయంతో బీచిరోడ్డమ్మట నడుస్తూ వస్తున్న నా మెదడులో రైళ్లు పరుగెత్తాయి. జరిగిన పొరపాటును ఎలా సరిదిద్దుకోవడమో అర్థం కాలేదు. నీ అందాన్ని చూచి మురిసి పోయాను. నీ గానకళా నైపుణ్యాన్ని చూచి, నీవు నాకు సర్వవిధాలా తగిన సతీమణి వనుకుని ఆనందించాను. నీకు మనసారా నా హృదయాన్ని ఇచ్చాను. అలాంటి నీపై ఇంత కఠినమైన అపవాదు విన్న నాకు ఏమిచెయ్యడానికీ పాలుపోలేదు. గోపాలరావు ఎందుకబద్ధం ఆడతాడు. పైగా అతను చెప్పిన జానకి వేరేమో అనుకుందికి కూడా ఏ మాత్రం సావకాశంలేదు. కాని నీతో గడిపిన పదిహేను రోజుల్లోనూ నాకు ఏ విధమైన అనుమానమూ కల్గగకపోవడంవలన, నీమనసు ప్రశాంతంగా కనుపించడం వలన గోపాలరావు మాటలను నమ్మడానికీ మనసొప్పలేదు. తిన్నగా వెళ్లి, ఆ కాలేజి ప్రిన్సిపాల్‌ని కలుసుకొని జరిగిన సంగతంతా తెలుసుకుందామనుకున్నాను. చిన్నతనంలో తెలియక ఏవో పొరపాట్లు చేస్తోంటాం ! అలాంటిదే, నీ పొరపాటుకూడానేమో అనుకున్నాను. కాని 'మరీ దారుణంగా కనుపించే వాళ్ల ప్రవర్తన' అని గోపాలరావు అన్న మాట గుర్తుకు వచ్చేసరికి నీ మీద అసహ్యభావం కలిగింది. తిరిగి నీ ముఖం ఎలా చూడాలో తెలియలేదు. పిచ్చెత్తిన వాడిలా బీచిరోడ్డమ్మట వస్తున్న నన్ను వెనుక నుండి ఎవరో 'ఏయ్, మిస్టర్ !' అని పిలిచారు. వెనుదిరిగి చూచాను. 'మీతో చిన్న విషయం మాట్లాడాలి ! కొంచెం ఇలా వస్తారా ?' అన్నాడతను మదరాసు నగరంలో ప్రతిరోజూ ఇలాంటి వ్యక్తులొచ్చి, ఏవో తమ కష్టాలన్నీ చెప్పుకొని, బస్ ఛార్జీకి ఒక పావలా ఇమ్మని అడగటం పరిపాటి మూలంగా అలాంటివాడే ఇతడూ అనుకొని వి పించుకోకుండా ముందుకు నడవ బోయాడు.

'ఏయ్ మిస్టర్ ! నేను చెప్పేది మీరు కా వినాలి !' అంటూ కొంచెం పరుషంగా మాట డిన ఆ వ్యక్తివంక ఆశ్చర్యంగా చూచాను.

'మీరు జానకి భర్త సీతాపతికదూ ?' అతడడగడంతో అతడు నేనూహించినలాంటి వ్య కాదని తెలుసుకుని, 'అవును మీకెలా తెలుసు ఇంతకూ మీరెవరు ?' అని ప్రశ్నించాను.

'అదంతా చెప్పడానికి అయిదు నిముషా పడుతుంది. కొంచెం ఇలా కూర్చోండి.' అంటూ నన్నొక బెంచీమీద కూర్చోబెట్టాడు. ద మైన కంఠంతో చెప్పుకుపోసాగాడు.

'నా పేరు మధుసూదనరావు. మా చెల్లె సీతకూ నాకూ రెండేళ్ళే తేడా ఉండేది. గానకళా పిపాస. మేమిద్దరం ఒకే గురువువద్ద నేర్చుకున్నాం ఇంటర్మీడియట్ వరకు ఒకేక్లాసు చదువుకునేవాళ్లం. తెలివితేటల్లో నన్ను మి తుందని అందరూ నన్ను చిన్నబుచ్చేవారు. నా చెల్లి ప్రాణంతో సమంగా చూడను

# జానకి డైరీ

ఏ విషయంలోనూ నన్ను వ్యతిరేకించేదికాదు. మా యిద్దర్నీ చూసి, కాలేజీ అంతా మురిసిపోయే వారు. అందరి దృష్టి ఆమెను కొట్టినట్లు యింది. టైఫాయిడ్ వచ్చి, మతి కోల్పోయింది. పిచ్చిదానిగామారి, ఒకనాటి రాత్రి మా కెవ్వరికీ తెలియకుండగా ఎచ్చటకో పారిపోయింది. ఆమె కోసం ఎంతగానో గాలించాము. ఎక్కడా కనుపించకపోయేసరికి నిస్పృహ చెందాము. నా చెల్లె లేమయిందో, ఎక్కడుందో ఈ నాటికి తెలియదు. పరీక్షా ఫలితాలువచ్చాయి. మేమిద్దరం ఫస్టు క్లాసులో ప్యాసయామనీ చెప్పారు. నా మనో వ్యధకు అంతులేదు. ఆమెగూర్చి నిద్రాహారాలు లేకుండా మళ్ళీ వెదికాను.

మనో వ్యాకులతతో కృశించిపోయే నన్ను మానాన్న గారు ఓదార్చి, గట్టి ప్రయత్నంతో తిరిగి కాలేజీలో చేర్చారు. భగవదనుగ్రహం వలన ఎలాగో ఆమెను మరచిపోగలిగాను. మేమిద్దరం కలిసి ఇచ్చిన సంగీత కచేరీలు, ఇంకా నాకు గుర్తుకు వస్తుంటాయి. ఒకనాడు క్లాసు పూర్తి కాగానే వరండాలో తిరుగుతున్న నేను దూరం నుండి మా క్లాసువైపే వస్తున్న జానకిని చూచి తడబడ్డాను. నా చెల్లెలు సీతయే తిరిగి వచ్చిందనుకున్నాను. జానకి మురమ్మూర్తులా సీతను పోలి ఉంది. ఆమె నడకను చూచి, ఊహ నిజమే ననుకున్నాను. కాని ఆమె మా క్లాసు సమీపించేసరికి తెలుసుకున్నాను ఆమె నా చెల్లి కాదని. ప్రతి లక్షణంలోనూ న చెల్లెల్ని గుర్తుకు తెస్తున్న ఆ అమ్మాయి ఆ నాడే మా క్లాసులో చేరిందని తెలుసుకొని పరమానంద భరితుణ్ణయాను. ఆమెతో స్నేహం చేసుకుందుకు శాయశక్తులా ప్రయత్నించాను. జానకి సంగీత కళాపిపాసి అని తెలిసి ఒకనాడామె వద్దకు వెళ్ళి, సాంస్కృతిక కోత్సవాలలో మేమిద్దరం కలిసి సంగీత పోటీకి పేరివ్వాలని కోరుకున్నాను. ఆ నాడామెతో పాడుతూ నా చెల్లెల్ని చూచినట్లు భావించాను నా స్నేహాన్ని జానకి అపార్థం చేసుకోబోయింది. ఒకనాటి ప్రభాత సమయంలో నేను గానం చేస్తుండగా ఒంటరిగా వచ్చి నా ప్రక్కన కూర్చుని, నన్ను తన జీవితాధారంగా చేసుకోవాలని ఆమె కోరుకున్నట్లు చెప్పింది.

"ఆశ్చర్య చకితుడనై, బాధపడిన మనస్సుతో వెంటనే అక్కడ నుండిడి లేచి, ఆ నాటి సాయంత్రం పార్కులో కలుసుకోమని ముభావంగా చెప్పి హాస్టలుకు వెళ్ళిపోయాను. ఆ నాటి సాయంత్రం, పార్కులో నా మనోభావాన్ని విని నిశ్చేష్టురాలయిన జానకి ఏడుస్తూ వెళ్ళిపోయింది. మళ్ళీ మేమిద్దరం ఎన్నడూ కలుసనేలేదు. అంతవరకూ మేము చనువుగా ప్రవర్తించడం చూచి, కొందరు కాలేజి విద్యార్థులు అసూయతో మా ఇద్దరిపై లేనిపోని విషయాలెన్నో కాలేజీ గోడల నిండా వ్రాశారు. ఉదయం లేస్తూనే ఆ వ్రాతలు చూచి అసహ్యించుకొని ఆ నాటి నుండీ కాలేజీకి స్వస్తి చెప్పాను. ఒకనాడామెకు ఒక ఉత్తరం వ్రాస్తూ నేనెప్పుడూ ఆమె క్షేమాన్నే కోరతాననీ, ఆమె జీవితం సుఖవంతం చేయడానికి శాయశక్తులా పాటు బడతాననీ, ఆమె ఆనందమయి

సంసార జీవితం గడుపుతోందని వినేదాకా నా మన సుకు శాంతి యుండదని, ధైర్యంతో సట్సా సంపాదించుకోమని హితబోధ చేశాను.

మొన్న మొన్ననే ఆమె నుండి ఒక లేఖ నందుకున్నాను. 'అన్నయ్యా!' అంటూ ముచ్చ టగా నన్ను సంబోధించిన ఆ ఉత్తరం ద్వారా మీ మంచితనాన్ని, మీ ఉద్యోగాన్ని, మీ ఆశయా లనూ తెలుసుకొని మురిసిపోయాను. అంటూ నీవు వ్రాసిన ఉత్తరం నా చేతులో ఉంచాడు.

మధ్యాహ్నం హోటల్లో, మీకూ మీ స్నేహి తునికీ మధ్య సంభాషణ వినే అవకాశం లభిం చింది. మీ ముఖకవళికలను మీ ఎదురుగానే కూర్చుని చూచాను. బహుశా మీరు నన్ను గమ నించి ఉండరు. మీ హృదయంలో చెలరేగే కలవరం నాకు తెలుసు. ఆమెను నేనే విధంగా తలంచలేదు. దైవ సాక్షిగా మీకీ విషయం చెప్తు న్నాను. దయయుంచి నన్ను నమ్మండి. సత్యం, ధర్మం ఈ రెండింటి విలువ పూర్తిగా తెలిసిన మీరు నా వాక్యాలలో సత్యాన్ని కనుగొంటారని విశ్వసిస్తున్నాను. ఆమె సౌఖ్యమే నా జీవిత లక్ష్యం. సున్నితమైన హృదయాన్ని పువ్వులలో పెట్టి పెంచుకోవాలన్నా, అనవసరపు అనుమానా లతో ఆమెను బాధించాలన్నా, మీ చేతుల్లోనే ఉంది. ఆమె తెలియక చేయబోయిన పొరపాటును క్షమించి కరుణతో ఏలుకుంటే పోయిన చెల్లిని ఒక్కసారిగా మరచి నా మనసులోని శాశ్వత వ్యథను పోగొట్టుకుంటాను. విద్యావంతులయిన మీరు నా కోర్కెను తీర్చమని ఇంకోసారి ప్రతి మాలు కుంటున్నాను.''

అతని కంఠం అటుపైన మాట్లాడలేక పోయింది. అతని కళ్ల వెంబడి నీళ్లు జలజలా రాలాయి. అప్రయత్నంగా నా నోరు పలికింది.

"మీమీద నాకు పూర్ణ విశ్వాసం ఉంది. జానకి ఎప్పుడూ నాకు జానకే!''

"ధన్యుడను సీతాపతీ! నిష్కల్మష మయిన మీ హృదయానికి ఇవే నా జోహార్లు!'' అంటూ అతనానందంతో వెళ్లిపోయాడు.

తేలికబడిన హృదయంతో ఇంటికి వచ్చేసరికి నీవు నాకు ఆహ్లాదకరంగా స్వాగత మిచ్చావు. ఆనా డతనికి నేనిచ్చిన వాగ్దానాన్ని నీకింతవరకు చెప్పక పోయినా, చెల్లించుకుంటూ వచ్చాను. ఒకనాడు నీవింట్లో లేని సమయంలో పొరపాటున నీ డైరీ నా కంట బడింది. ఇష్టం లేకపోయినా పూర్తిగా చదివేశాను. మధుసూదనరావుమీద పూర్తి నమ్మ కం కలిగింది. నీ డైరీ మళ్లీ నా కంటబడకూడ దనుకున్నాను. అది నా కంట బడినట్లు నీకు తెలియకూడదనుకున్నాను. కాని ఈ నాడు జరిగిన ఈ పొరపాటువలన నీ హృదయాన్నెంతో క్షోభింప జేశాను. నన్ను క్షమించానని నీవు చెప్పేదాకా నా మనసు శాంతించదు. నన్ను క్షమించినట్లు యితే నీ వీణను ప్రయోగించు. అప్పుడే నీ దగ్గరకు రాగలుతాను.''

జానకి హృదయం ఆనందంతో పొంగి పోయింది. సీతాపతి ఎంత మహాసుభావుడో గదా అని మనసులో మురిసి పోయింది.

ఆమె వ్రాసిన ఉత్తరం సీతాపతికి క్రొత్తగా కనుపించలేదు. జరిగిన విషయాన్ని దాచి పుచ్చ కుండా ఈ నాటికి జానకి వ్యక్తపరచినందుకు సంతోషించాడు. 'సత్యమే వజయతే!' అని వ్రాసిన ఆమె మాటలతని హృదయంలోని లోతుల నందు కున్నాయి. కిటికీలో నుండి బయటకు చూచాడు చందమామ వెండి వర్షం కురిపిస్తున్నాడు. వెనుకనుండి వీణ మ్రోగింది. తన్మయుడైన సీతా పతి తన దృష్టిని చందమామపై నుండి మరల్చి వెనుదిరిగి చూచాడు. కిటికీ ప్రక్క కూర్చున్న జానకి దేహంపై కలువరేని కిరణాలు ప్రకా శిస్తున్నాయి. పిల్లవాయువుల ప్రభావంతో ఆమె ముంగురులు సంతోషంగా ఊగుతున్నాయి. సహజంగా రూపవతి అయిన ఆమె, ఆ రంగు కిరణాల మధ్య ఒక దేవతా స్వరూపంలా కనుపిం చింది. చప్పుడు కాకుండావెళ్లి వెనుకనుండి ఆమె చేతులు పట్టుకున్నాడు. వీణ నాపుచేసి, జానకి అతని హృదయంపై వాలింది. ★

---

పోవాలట. ఇంకా ఎక్కువ రాసేం దుకు వ్యవధిలేదు. కొలంబాగారిని కొంచెం 'బుచ్చియో' చేసి పెట్టమని అడగటానికి సాహసిస్తున్నాను. ఆవిడకి నా శుభాకాంక్షలు అందచెయ్యండి. ఆవిడ బాకు నాకు చాలా ఉప యోగంగా ఉంది—నే చదువుతున్న నవల పేజీలు చింపటానికి బాగా పనికివస్తోంది. అయితే ఈ విని యోగం చాలా నీచంగా కన్పిస్తోం దనే భయం కూడా ఉంది!

మా నాన్నగారు అడిగినట్లు రాయ మన్నారు. గ్రామాధికారి మాటలు వినండి. మంచివాడిలాగ ఉన్నాడు. మీకోసం కష్టపడటానికి కూడా సిద్ధంగా ఉన్నాడనిపిస్తుంది.'

ఇలాగే మరికొంత వ్రాసి ఉంది. మిస్ లిడియా తన లేఖ ఇలా ముగిం చింది.

'ఇప్పటికి నాలుగు పేజీలు రాశాను చూశారుగా! నాకే విసుగు పుడు తోంది. అందుకనే మీరు నాకు ఉత్తరం రాసినట్లయితే పెద్దది రాయటానికి అనుమతి ఇస్తున్నాను.

## కొలంబా

20 వ పేజీ తరువాయి

ఇంతవరకూ మీరు క్షేమంగా పియత్ర నెరా-భవంతి చేరినట్లు కబురు రాలేదేమా అని ఆశ్చర్యపడు తున్నాను.

లిడియా.'

'చివరిమాట — గ్రామాధికారి చెప్పినట్లు చెయ్యమన్నాను. మీరు అలా చేసి నాకు సంతోషం కలిగిస్తా రని ఎదురు చూస్తున్నాను.'—

ఆర్సో ఈ ఉత్తరం మూడు నాలుగు సార్లు చదివాడు. ఒక్కొక్క సారీ అతని భావపరంపర లెక్కలే నన్ని విధాలుగా పోయాయి. ఎన్నో వ్యాఖ్యలు చేసుకున్నాడు. తర్వాత ఒక దీర్ఘమయిన సమాధానం తయారుచేశాడు. అది సవెరియాకి ఇచ్చి, గ్రామంలో అదేరాత్రి అజాచ్చియోకి బయలుదేరి వెడు తున్న ఒక వ్యక్తి ద్వారా పంప మన్నాడు. మిస్ లిడియా లేఖ అతని మనస్సుని బాగా మార్చివేసింది. ఇప్పుడు చాలా ఉల్లాసంగా ఉంది అతనికి. తన చెల్లెలు కనిపిస్తుం దేమో నని కొంత సేపు కాచుకుని చూశాడు. ఆమె ఎంతకీ క్రిందికి దిగి రాకపోయే సరికి తనగదికి వెళ్లిపోయి పడు కున్నాడు. ఎంత కాలంనుంచో ఉన్న గుండె బరువు తగ్గిపోయి నట్లయింది.

చిలినాకి రహస్యంగా ఏదో చెప్పి పంపింది కొలంబా. తను ఏవేవో కాగితాలు చదువుతూ చాలా సేపు మేలుకునే ఉండిపోయింది. తెల్లవా టానికి కొంచెంకాలం మిగిలి ఉం నగా ఆమె కిటికీమీద ఎవరో చిన చిన్నగా రాళ్లు విసిరిన శబ్దాలు వి పించాయి; కొలంబా లేచి క్రిం తోటలోకి వెళ్లింది. వెనక వైపు ఉన్న ఒక తలుపు తెరిచింది. లో లికి ఇద్దరు మగవారు వచ్చా చూడటానికి కొంచెం అనవ గానే ఉన్నారు. అన్నిటికన ముందు ఆమె వారి భోజనం సం విచారించి ఏర్పాటు చేసి వీరెవరో త్వరలోనే మనకి స్తుంది...

(ఇంకా ఉ

వళ్లు ఒణికి పోతూంది. మాట రావడంలేదు. "లేకుంటే ఎంతసేపు తలుపు బాదడం ! ఇరుగు పొరుగు ఇళ్లవాళ్లు చూస్తే ఏమనుకుంటారు ? నా పరువు తీయాలనా ?" హుంకరిస్తున్నాడు పెద్దబావ ! అతనికి వచ్చిన కోపం. పరువు పోతూందన్న భయం చూస్తే నవ్వొచ్చింది సీతకి. "నువ్వు రెండు మూడు గంటలకి రావచ్చు. కాని ఆ సంగతి పక్కింటి వాళ్లకి తెలియకూడదు. అవునా ? నువ్వు నీ పెళ్లాన్ని కొట్టవచ్చు, తిట్ట వచ్చు. అది పక్కింటి వాళ్లకి తెలియకూడదు అవునా ? ఏం బావా !" సీతకి కోపం పోయింది. బావ నైతికపు విలువలకి నవ్వువచ్చింది. ఎదు రించి సమాధానం చెప్పేసరికి రెచ్చిపోయిన బావ ఏం చెయ్యాలా, అని చూస్తున్నాడు.. చవితి చంద్రుడిలా సన్నగా నవ్వు తూంది సీత. బావంటే భయంలేదు... అందుకే ఆ నవ్వు. కాని తనని హేళన చేస్తూందనుకున్నాడు బావ మగవాడికి పెడర్థాలు తీయడానికి జన్మతహా హక్కుంది.... 'సిగ్గులేక నవ్వుతావేం నీలాంటి పీడల మూలాన్నే మొగాళ్లు ఇళ్లు పట్టకుండా తిరిగేది.... మొద్దు నిద్దరా నువ్వూ' విసుక్కుంటూ లోపలి గదిలోకి నడిచాడు... 'నేను పీడనా ! నన్ను చూడలేక ఇల్లు పట్టకుండా తిరుగుతున్నావా ?' దారికడ్డం వెళ్లి నిలదీసి అడిగింది సీత. 'కోటు వదలు' అంటూ విదిలించాడు. 'చెప్పు నువ్వన్నదేమిటి ? నన్ని అడవిలో పడేసి నువ్వి అపరాత్రికి ఇంటికి రావ డానికి కారణం నేనా ?.... బావా, నేను పాత సీతని. కాదా ?' కోపంలోనే ప్రాధేయపడింది సీత 'చూడు. ఇంతరాత్రికి వచ్చినా నువ్వు నన్నేం ఆదరించావు ? నిలదీసి అడుగుతున్నావు.... అదే కాంతం అయితేనా ? ఆప్యాయంగా ఆహ్వాని స్తుంది. మంచంమీద కూర్చోపెట్టి అలసట తీస్తుంది. గంధం పూస్తుంది. మల్లెల దండలు కడుతుంది. చిలిపి కబుర్లు చెప్పి ఇదే స్వర్గం అనిపి స్తుంది. నువ్వో ! నిద్రముఖం నువ్వూ !' చీద రించుకుని పక్కకి నడిచాడు. కాని సీతకి ఈ దెబ్బ పిడి నెత్తిన పడ్డట్టయింది.... అతని కోటు వదలలేదు.... వదలమని పక్కకి తోసేసి వెళ్లి పోయాడు పెద్ద బావ.....మారుమాట అడలేక కిందని పడ్డ సీత అలాగే పడుకుంది. ఏమిటి తను విన్నది ? వూహించుకుందా ? తన చెవులే తన్ని మోసం చేయడం లేదుకదా ?....

పడి పోయిన సీతని ఏ భూమాతా తన వడిలోకి తీసుకోలేదు. కాస్సేపటికి పెద్దబావకే అనుమానం వచ్చింది— ఇలా పడిపోయిందేమిటీ అని. దగ్గ రికి వచ్చి చూశాడు. చూస్తూనే వున్నాయి సీత కళ్లు. కాని ఏమిటో చూస్తున్నాయి. 'సీతా ?' అని. అతి నెమ్మదిగా పిలిచాడు. పలకలేదు సీత. పాపం ! తనకోసం ఎదురు చూసి అలిసి నిద్ర పోయింది. కోపంలో చెయ్యి చేసుకున్నాను— అని తనలో తానుగా బాధపడ్డాడు. 'సీతా' అంటూ ఆప్యాయంగా వెన్ను నిమిరాడు. ఆ స్పర్శకి గత జీవితం అంతా మారు పల్కింది సీతలో. 'బావా' అంటూ అతని ఒడిలో తలదూర్చి భోరున ఏడ్చింది. ఆ ఏడ్పు దేనికి ? గతాన్ని తలుచు కుని. సుందర స్వప్నంలాంటి గతాన్ని తల్చుకుని.

# పిచ్చిదానా!....

19 వ పేజీ తరువాయి

ఆ ఏడ్పు ఎందుకు ? వర్తమానాన్ని తల్చుకుని – పీడకలలా తయారై వూపిరి సలపనీయకుండా చేస్తున్న వర్తమానాన్ని తల్చుకుని.... సీత భోరున ఏడ్చింది. "బావా ఎందుకిలా మారిపోయావు ? నన్నెందుకిలా మార్చేశావు. మామయ్యుంటే ఈ స్థితికి గుండెపగిలేది." అంది ఏడుస్తూనే. పూర్తిగా మొరడు బారని పెద్దబావ, పూర్తిగా సహృదయుతని తెంచేసుకోలేని పెద్దబావ సీతని గట్టిగా కౌగలించుకున్నాడు — ఆ బిగువులో జీవి తపు ఒడుదుడుకుల అర్థం ఇమిడి పోయింది. ఇంకెప్పుడూ జరగదన్న హామీ ఉంది. అంతా మరిచిపోయి — ఈ ప్రేమికుణ్ణి క్షమించమన్న అభ్యర్థన ఉంది. సీత అలసిన కన్నులు కొత్త కాంతి తెచ్చుకుని మెరిశాయి. తూర్పున వెల్గు రేఖలు కూడ పరచుకు వస్తున్నాయి.

పెద్ద బావకి పెద్ద బుద్ధులు వస్తున్నయని పసికట్టిన సీత ఎన్నో విధాల ప్రయత్నించింది..

"ఈ మధ్య రోజుకి ఆరు కార్టూన్ లు వేస్తున్నాను" అన్నాడు ఆర్టిస్టు అప్పారావు.

"అసలు ఏ వస్తువుమీద అన్ని వేస్తున్నావ్?" అన్నాడు మిత్రుడు ఆశ్చర్యంగా

"చీకటిమీద" అప్పారావు గర్వపడ్డాడు.

కె రంగారావ్

మామూలు మనిషిగా తయారు చేయాలని. తిరిగి అర్ధరాత్రిపూట ఇల్లుచేరి కక్కుపోస్తే నోరుమూసుకు కడిగి, లాలించి "ఇది తప్పు మని ద్దరి జీవితాలూ ఇలా నలిపేస్తారా ?" అని చెప్పి చూసింది. ఇదింతేలే.

విరుచుకుపడదు : అని మరీ ధైర్యం పుంజు కున్నాడు పెద్దబావ. తప్పతాగి ఇంటికి వచ్చి, ఒకటే సొద. కాంతం సొద. ఎవరా కాంతం అన్నది ఇట్టే పసికట్టింది సీత. కాని తనేం చేయగలదు ? కాంతానికీ తనకీ పోలికెక్కడ ? కాంతంలా తన కెప్పటికీ రాదా నేర్పు !.... పేచీ పడ్డం ప్రారం భించింది సీత. 'నోరు మూసుకుంటే మరీ మూసేస్తున్నారు. నేనీ నరకం భరించలేను. చంపే యండి' అని తలబాదుకు ఏడ్చింది. హేళనగా నవ్వాడు పెద్ద బావ— చద్దామనుకున్న వాళ్లని ఎవరేనా చంపాలా అన్నట్టు.

'నాకెందుకింత అన్యాయం చేస్తారు. నా జీవిత మేం పెరిగిపోయిందని ?' ఏడ్చింది. 'బాధ్యతల్లో ఉన్న గొడవే అది. ఓ సంవత్సరంలో ఓ యుగం గడిచినంత నిస్పృహ. ఛ ! నేరక పెళ్లాడాను. నువ్వుపో— నీ వాళ్ల దగ్గరికి. నువ్వుపో నీ ఇష్టం వచ్చిన చోటుకి' అంటూ అరిచాడు పెద్దబావ. 'నువ్వు పో అంటే ఎక్కడికి పోను. నడిస్తేనే ఏమిటూ పరుగనే తండ్రి కొడుకువేనా నువ్వు ! నీలో ఇంత కర్కశత్వమా' కాళీ రూపం ధరించింది సీత. తనకి నిస్పత్తువ కల్గేదాకా చితక బాదాడు. పచ్చని శరీరం దద్దుర్లు తేలింది. కళ్లు జ్యోతుల్లా వెల్గాయి. కాని ఏడ్వడం మానేసింది సీత. తుఫాను ముందు స్తంభించిన సంద్రంలా ఉందామె మనస్సు.... ఒక ఆడదాన్ని లొంగదీయ లేక పోయానన్న కోపంతో తలుపులు తెరచుకు బయటికి నడిచాడు. పెద్దబావ.... అది జరిగి మూడు రాత్రులు గడిచింది. ఈ రాత్రికూడ దీపం వెల్గించి కూర్చుంది సీత....

గదిలో బిక్కుబిక్కుమంటూ ఒదిగి కూర్చుంది సీత. బయట గాలీ వానా. లోపల వూపిరి సలపని స్తబ్ధత. విచిత్రం.... దీపంకేసి చూస్తున్న సీత కళ్లు వర్షిస్తూనే ఉన్నాయి. పిడుగు పడిన చప్పుడుతో పాడే వీధి తలుపు తెరచుకుని పెద్ద బావ వచ్చాడు. ఆత్రంగా లేచి నిలబడింది సీత. కళ్లు తెరిచి తన ముందు కనబడుతున్న దృశ్యం చూడలేకపోయింది. సంస్కారంలేని జుట్టు, జుగుప్స కల్గిస్తున్న బట్టలు, చింత నిప్పులలా కణకణ లాడుతున్న కళ్లు— ఈ పెద్ద బావకోసమేనా తనంత పరితపించింది ! స్తబ్ధయి నిలబడి పోయింది సీత. భయంకరంగా నవ్వాడు పెద్దబావ. 'నువ్వో నేనో అన్నానుగా.... రా నాచేతుల్లోకి రా' అంటూ అరుస్తున్నాడు. అయినా సీత జాపిన చేతుల్లోకి తూరీగలా వెళ్లి వాలింది. ఇనుప చేతుల్లా అతని చేతులు సీతపీక నొక్కేస్తున్నాయి. అతని కళ్లలో భయంకరమైన వెల్గు— ఆమె కళ్లలో కొడికడుతూంది. 'బావా ఏమిటేది. పోనీలే— చంపెయి. అదేనయం.' మాట రావడం లేదు. అయినా సీతకళ్లు మాట్లాడుతున్నాయి. 'నే పరిగెట్టకుండా వెళ్లిపోతున్నాను బావా. వచ్చే జన్మలో కాంతం కడుపున వుడతాను. నన్ను చేపట్టు' అంటూ నవ్వుతున్నాయి సీత కళ్లు... పిడుగుపడి దద్దరిల్లి పోయింది ప్రకృతి.... కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూంది— ప్రకృతి....

భవిష్యత్తులో .... చిన్నది !!!

పెద్దబావ తాగుడు మైకంలో భార్యని చంపాడన్నారు. మతి చెలించిందన్నారు, కాంతం కాలదన్నింది. ఉద్యోగం వూడింది. రామకొండ కష్టపడి శిక్ష తప్పించి అన్నగార్ని పల్లెటూరికి తరలించేసరికి చనిపోయిన పెద్ద మామయ్య తిరిగి వచ్చినంత పనైంది ! కాని నడిచి పోయిన సీత తిరిగి రాలేదు.... తమ ఇంట మూడోనాడు వచ్చా డని కంటక పడులోంది వెంకటలక్ష్మి. పిచ్చి దానా ! ఏమిటా పరుగు ? నేనూ వస్తాను అంటూ రోడ్ల వెంట తిరుగుతున్నాడు పెద్దబావ.

(ఏం లోటు చేశాను. వాడికి అంటూ గాలిలో దెయ్యాలని పల్కరిస్తున్నాడు పెద్దమామయ్య.

నేనేం చేశాను అంటూ చీకటిని ప్రశ్ని స్తూంది సీత.

నేనేం చేశాను ? అంటూ పంచ భూతాలని ప్రశ్నిస్తున్నాడు పెద్దబావ.

అంతా దైవేచ్ఛ! అంటున్నారు పెద్దలు.) ★

# నా డైరీలో...

17వ పేజీ తరువాయి

"నా మొహం అందంగా ఉంటుందని యింత కాలానికి కనిపెట్టావా ? పూర్ క్రీచర్ !—ఏదీ? కాస్తైనా తినటానికి తగలెయ్ ! కడుపు మండి పోతోంది. కాలిపోతోంది—కుంచించుకుపోతోంది. వికనక .... "

నా కిక చెప్పక తప్పలేదు—"అన్నీ తయారుగా ఉంచాను ఉప్మా .... "

"గుడ్ ! మంచిదానివి. తీసుకురా తొందరగా. పోవాలి నేను."

నాకు ఏడుపే రాబోయింది—అణుచుకున్నాను. "కాస్త స్టౌ వెలిగించేస్తే .... వెధవది నే నెంత ప్రయత్నించినా అంటలేదు—ఐదు నిమిషాల్లో చేసేస్తాను. మీరు ఎలాగూ రేడియో వింటారుగా ? వేడివేడిగా కూడా ఉంటుంది." అనేశాను గబగబా ఎటో చూస్తూ—మావారి ఉద్దేశాలు నాకు తెలీవు. మూర్ఛపోలేదని మాత్రం చెప్పగలను. ఎందుకంటే .... "ఇంకా యిప్పుడు చేస్తావా ? ఇప్పుడా ? వెధవ స్టౌవా ? వెలిగించాలా ?" లాంటి అమితాశ్చర్యంతో కూడిన ప్రశ్నార్థకాలు చాలా వెలువడ్డాయి.

ఇక దబాయించటం ఒక్కటే నా ఆత్మరక్షణ కార్యం అని నిర్ధారణ చేసేచేసేసుకున్నాను—"స్టౌ బాగుచేయించమని ఎన్నిసార్లు చెప్పాను మీకు ? అది నానా తిప్పలు పెట్టింది గానీ ముట్టలేదే ! ఇప్పటినుంచీ కుంపటి అంటించి ఏం చెయ్యనూ ?" అన్నాను కాస్త చిరాగా.

"స్టౌ అంటించటం రాదను. అంతేగానీ అదేం పాడవలా బాగుచేయించటానికి—స్టౌ అంటించటమే రాకపోతే నువ్వెందుకు పనికొస్తావ్ ?"

"ఎందుకైనా పనికొచ్చేవాళ్లంతా స్టౌ వెలిగించి తీరాలన్న నియమ మేమైనా ఉందా ?"

"ఉట్టి కెగరలేనమ్మ స్వర్గాని కెగురుతుందా ?"

"ఉట్టి వెళ్ళి స్వర్గంలో ఉంటే ఎగరలేకపోనూ వచ్చు."

"మాటలు నేర్చావ్."

"మీ దగ్గిరే మరి."—కాస్త నవ్వబోయాను. శ్రీవారికి కొంచెం కోపం ఉపశమిస్తోన్న సూచనలు కన్పించాయి—"వచ్చేసరికి ఏదో ఇంత తగలేస్తే తినిపోతాను గానీ .... ఏమిటి చెప్పు ? నేనే వచ్చి స్టౌ వెలిగించుకుని వండుకుని తిని .... ఛ ! నీకు బొత్తిగా బాధ్యత లేకుండా పోతోంది."

"అలా అంటే మాత్రం నేను వూరుకోను. నేనేం పనీపాటా లేకుండా కుర్చీవేసుకు కూర్చున్నానా? నిద్ర ఒస్తోన్నా ఆపుకుని .... కొత్త పుస్తకాలున్నా మానుకుని .... ఏదో కాస్త రాశాను. కాస్సేపు ఎవరో అతిథులు వస్తే మాట్లాడి పంపించాను. పాప ఏడుస్తోంటే పక్కలో పడుకున్నాను .... లేచి స్టౌ వెలిగించబోతే నాతరం కాలేదు—ఈ వెధవ రాతలూ, కోతలూ లేకుండా సలక్షణంగా మీ పాదసేవ చేసుకుంటానంటే మీరు వింటున్నారా ?"

"పాదసేవ కాదు గానీ నా పీపు సేవ చెయ్యి... బావుంటుంది."

"మీ యిష్టం మరి. నాదేముంది ? ఏది చెప్తే అదే ...."

"నీతో నేను వాగలేను గానీ, ఇవ్వాళెంతవరకూ వచ్చింది ? ఓ కథ అయిందా ?"

"అవుతోంది."

"ఊఁ అవుతోంది. రోజుకో కథైనా రాయలేని నువ్వు ......"

"ఈపూట కాస్త ఇంట్లో ఉండి వంటపని చూసుకోండి. అది పూర్తిచేస్తాను. అంతేగాని వూరికే నన్నేం వెటకారాలు చెయ్యక్కర్లా."

"అలా బెదిరిస్తే బెదిరే ఘటం కాదిది. ఇప్పుడు శ్రీవారు స్టౌ మాత్రం అంటిస్తారు. తర్వాత రేడియో వింటూ పేపరు చూస్తారు. ఇంకా ఆ తర్వాత టిఫిన్‌చేసి షైరు వెళ్తారు—ఆతర్వాత .... అటునుంచి వచ్చి శ్రీమతి రాసిన కథ ఎడిట్ చేస్తారు."

"ఆగండి మరి—చిన్న సవరణ. శ్రీవారితో శ్రీమతిగారు కూడా షైరు వస్తారు. అంటే కథా ఎడిటింగూ జానేదేవ్ !"

"నో. నో. శ్రీవారు శ్రీమతిగార్ని తీసికెళ్లరుగా?"

"అసలు తీసికెళ్లకుండా వెళ్లలేరుగా ?"—ఫక్కుమని నవ్వుకున్నాం—శ్రీవారు ఓ అయిదు నిముషాలు కుస్తీపట్టి స్టౌ వెలిగించటం—శ్రీమతిగారు మరో ఐదు నిముషాలు కంగారుపడి ఉప్మా చెయ్యటం—ఇంతలో పక్కింటికి పోయిన పుత్రరత్నాన్ని లాక్కురావటం—చంటిది లేస్తే దాన్నికూడా మీటింగులో చేర్చుకోటం—అంతా ఓ పావుగంట !—

"తల ఒక్కంటికే ఒక టిక్కెట్ యివ్వబడును" అన్న బోర్డు చూసి "ఆడవాళ్ళకేనా అంతేనా ?" అన్నాదొక ఆవిడ.

"వాళ్ళకి రెండు తలలుంటాయా ?" అన్నాడు గుమాస్తా.

పి. నాగేశ్వరరావు (విజయవాడ)

అల్పాహారం ఆరగిస్తూ శ్రీవారి చక్కని కోరిక—"పోనీ, అలా ఏ పిక్చరుకైనా పోదామా ? బొత్తిగా బోర్ కొడుతోంది. మనం కలిసి వెళ్లి చాలారోజులైంది కూడాను."

"'రాజా పేదా' లో జిక్కి అంటోంది రేడియోలో కంఠం అప్పుడే.

"బావుంది. తేగలాంటి పిల్లయ్యా అంటే తేగే తెమ్మని కూర్చున్నాడట. పనీపాటా అన్నీ వదిలేసి యిప్పటి కిప్పుడు సినిమాకి పోదామా ?"

"మేచ్ కెళ్లటం మానేసి పాపని చూస్తాను. ఎంతలో తెమలగలవ్ ?"

"సుమారో గంట. అందగలమా ?"

"ఓఁ తప్పకుండా అందిపోగలం—ఇట్రవెల్‌కి."

శ్రీవారికి మళ్ళీ కోపం వచ్చింది—"సినిమాకు బయల్దేరమంటే గంట కావాలట. సిద్ధలా మొహం నువ్వూను. ఇంత చురుకుదనం లేకుండా .... నా ఖర్మకొద్దీ దొరికావ్. ప్చ్ !" దీర్ఘమైన, గాఢమైన వెచ్చని నిట్టూర్పు! ఇలా చెప్పేకన్నా ఆ నిట్టూర్పుకి ఘనపరిమాణం వూహిస్తే బాగుంటుందేమో !

నాకూ కోపం వచ్చింది. ఏం ? నాకేం అభిమానం లేదా ?—"చూడండీ ! ఇప్పుడు మీరు విచారించి ప్రయోజనంలేదు. ఇద్దరు చిన్నలు కూడాను. సినిమాకి బయల్దేరలేక పోతున్నందుకు నాకూ బాధగానే ఉంది. ఇక చురుకుపాలంటారా ? అది ఇద్దరిలోనూ ఉంటే చాలా ప్రమాదం. అట్నించి వచ్చి అన్నాలు తినబోతే ఈ చురుకుపాలు చాలా ఏడిపిస్తుంది."

ఓ నిముషం దారుణమైన గంభీరమైన మౌనం ! నిశ్శబ్దం ! కారణం పిల్లలిద్దరూ తిండిలో పడిఉన్నారు. పెద్దలిద్దరూ ఎడమొహం పెడమొహంగా కూర్చున్నారు—

టక్ .... టక్ .... వీధి తలుపుల మీద!

టకాటక్.... వాటిమీదే ! ఠాక్ ! .... ఠాక్ ...

"అమ్మా ! ఎవరో వచ్చారే !"

"ఆఁ ! వెళ్తున్నాలే ! నువ్వు తొందరగా కానీ ! నాన్నతో వెళ్దుగానీ సైకిల్‌మీద."

"నేను వాణ్ణి తీసుకెళ్లను."

"పోనీ, పాపని తీసికెళ్తారా ?"

"అహ ! నిన్ను తీసికెళ్తాను."

"సారీ ! నేను రాలేను."

"చాల్లే ! వూరుకో."

తలుపులు తీశాను—పక్కింటికి ఎదురింటివారి పాప !

"మీ పాపేం చేస్తోందండీ ? మా అక్క తీసుకు రమ్మంది."

గబగబా పాపకి ఒళ్ళు కడిగి గౌనువేసి పంపించేశాను.

నానిగాణ్ణి తయారుచేసి సైకిలెక్కించాను.

"నేను తీసికెళ్లనని చెప్పానా ?"

"మీరేం తీసికెళక్కర్లా. సైకిలే తీసికెళ్తుంది."

"సరే ! అయితే నేను నడిచిపోతాను."

"నానీ ! మీనాన్న వెనకే నడిచి వెళ్లమ్మా ! జాగ్రత్త ! ఎటూ పరిగెత్తకూ."

"ఏమిటా పెంకితనం నీకు ?"

"ఏమిటా గడుసుదనం మీకు ? అస్తమానూ పక్కింటివారి ఆడపిల్లలతో నాలుగు గోడల మధ్య బువ్వాలాట లాడుతూ కూర్చుంటే వాడెందుకు పనికివస్తాడు ?"

"ఓహో ! వాడినో మగధీరుణ్ణి చేద్దామని చూస్తున్నావన్నమాట."

"అన్నమాటేమిటి ? చూడడం ఏమిటి ? వా డెలాగూ మగధీరుడే ! తండ్రిలా కాదు ! సారీ ! తల్లిలా కాదు."

"నీకూ, నీ వాదనకూ గుడ్‌బై. సాయంత్రం నేనొచ్చి .... "

"బై బై ! వెళ్లిరండి."

తలుపులు వేసుకొని గదిలోకి నడిచాను.

ఎదరింటివారి రేడియో నుండి వచ్చే గందరగోళం భరించ శక్యంగాకుండా ఉంది. మా కుడి పక్కింటాయన బి. ఏ. కి కడుతున్నారు. పాపం పగలంతా ఆఫీసు పనులూ గట్రా చూసుకుని రాత్రి ఏడెనిమిది గంటల నుంచీ పుస్తకాలు ముందు వేసుకు కూర్చుంటా రాయన. మా ఎడమ పక్కింటావిడ వచ్చి బాలెంతరాలు. పగలంతా కళ్లల్లో ఒత్తులు వేసుకు కూర్చుని దీపాలు పెట్టగానే నిద్ర కువక్రమిస్తుంది—ఇక నేను పరేసరి -

ఏదైనా చదువుకోవాలంటే అదే సమయం! మాలాంటి దౌర్భాగ్యుల సందర్భీ ఎదరింటివారి రేడియో ఉద్ధరిస్తూ ఉంటుంది. సర్వావస్థల లోనూ, సర్వ వేళలానూ. ప్చ్! ఇలా మనసు పాడు చేసుకుంటే లాభంలేదు. అసలు ఎదరింటి వారికి రేడియో లేనేలేదనుకుంటాను — పోనీ నాకు బ్రహ్మాండమైన చెముడొచ్చిం దను కుంటాను — చాలు! ఇంకేం వినపడదు కావలసి నంత నిశ్శబ్దం! భావ కవిత్వంలో నిశ్శబ్దానికి చోటు చాలక పిటపిట లాడుతోంది కూడాను.

* * *

గోపాలం సిల్కు రుమాలుతో నుదురు ఒత్తుకున్నాడు తేలిగ్గా — ఉంగరాలు చెదరకుండా — అర్ధ గంట నుంచీ వెళ్ళాల్సిన ఇంటిముందు పచార్లు చేస్తున్న గోపాలం — చకచకా విడిచివెళ్ళి గుమ్మం ఎక్కే ధైర్యంలేని గోపాలం — చెట్టుకింద నిల బడి అప్పటికి నాలుగుసార్లు నుదురు ఒత్తుకు కున్నాడు. రెండుసార్లు చెట్టు చాటుకి పోయి క్రాపు దువ్వుకున్నాడు. కాలర్ సర్దుకున్నాడు. బెల్టు లూజ్ చేసి మళ్ళా బిగించుకున్నాడు. షర్టు మీదో పండుటాకు రాలిపడితే ఉలిక్కిపడి తలెత్తి పైకి చూసి గబగబా అంగలేసుకుంటూ చెట్టు బైటికి పరుగు తీశాడు — వెధవ కాకులు! ఏమో! చెప్పలేం'' అనుకొంటూ నీలం రంగు గాబర్డీన్ పాంటూ, తెల్లని టెరిలీన్ షర్టూ, నైలాన్ మేజోళ్ళూ, బూటూ, సిల్కు రుమాలూ "రూమ్'' లో అద్దంలో చూసుకున్నప్పుడు తనను తనే మోహించుకున్నాడు గోపాలం — ఇతరులు తనని మోహించరన్న అనుమానానికి అవకాశమే లేదిక —

"నమస్తే! రండి! అలా వీధిలో నిలబడి పోయారేం? రండి!'' చక్కని, సన్నని కంఠం శ్రావ్యంగా వినిపించేసరికి ఇంటివరకూ వచ్చేశానని తన తప్పు తెలుసుకున్న గోపాలం వెనక్కి పరు గెత్తబోయాడు.

"రండి లోపలికి — అలా నిలబడిపోయారేం?''

గోపాలం కాళ్ళు సమ్మె చేశాయ్! "సాహసం శాయరా డింభకా!'' అంది అంతరాత్మ!

దాదాపు మతి తప్పినవాడిలా గడపలో కాలు పెట్టాడు.

సరోజ! మిస్ సరోజాదేవి — సరో నవ్వింది కొంచెం —

దడదడలాడాయి గోపాలం గుండెలు — గుండె కొట్టుకునే "లబ్ — డబ్'' శబ్దాలు గోపాలం చెవు లకు స్పష్టంగా వినపడుతున్నాయి — సరోజకు కూడా వినపడుతున్నాయేమోనని బిక్కచచ్చిపోయిన గోపాలం ప్రేము కుర్చీలో ఒదిగిపోయాడు.

మరో కుర్చీ కాస్త దగ్గరికి జరుపుకుని కూర్చుంది సరోజ —

"మీరు వస్తారని నేను పావుగంట నుంచీ ఎదురుచూస్తున్నానండీ!'' చింతపిక్కలాంటి రిస్టు వాచీ చూసుకుంటూ అంది సరోజ.

గోపాలం శరీరం చచ్చిపోయింది — వాచీ లేని తన చెయ్యి అసలు లేకుండా పోతే బాగుండును. ఇప్పుడు గాని నాన్నకు బుద్ధి రాదు —

"ఏమండీ! అంత మౌనంగా కూర్చున్నారు.'' మృదువుగా నవ్వింది సరోజ. గోపాలం హృదయం యుగళగీతం ప్రారంభించబోయింది.

# నా డైరీలో ...

సరోని సరిగ్గా చూడకపోయినా సరో కట్టిన లేత ఎరుపు — అదే కనకాంబరం రంగు చీర, తెల్ల జాకెట్టూ చాల బ్యూటిఫుల్‌గా ఉన్నాయి. అవును. సరో కట్టబట్టే — ఎప్పుడూ ఓణీలూ, రెండు జెడలూ వేసుకునే పిల్ల సరో ఇలా అంచుల చీర తోటీ, వాలుజడ తోటీ ముస్తాబై కూర్చోటం కాస్త ఏమిటోగా అన్పించింది గోపాలానికి. ఏమో! తనే పొరబడ్డాడేమో! స్త్రీ హృదయం అగాధం! తనపట్ల ఉండే వినయవిధేయతలతో అలా హుందాగా నిండుగా ముస్తాబైందేమో! — ఎవరు అర్థం చేసుకోగలరు?

"ఓహో! మీరు మాట్లాడరు కాబోలు.'' చిరుకోపం నటించింది సరో. గోపాలం హృదయం యుగళగీతం ప్రారంభించనే ప్రారంభించింది.

"హాయిహాయిగా ఆమని సాగె! .... కనుగవా కలియగా ప్రియతమా! ఆ ఆ ఆ ....''

ఎంత ప్రయత్నించినా పైకి మాత్రం మాట్లాడలేక పోతున్నాడు. గోపాలం. సరోజ తన లేఖకి జవాబు రాసినా ఇంత ఆదరం ఇంత అను రాగం చూపిస్తుందని కలలో కూడా ....

ఒక రంగధామయ్యగారు తన "కురూపి కూతురును పెళ్లాడితే మంచి బహుమానం వస్తుం ద''న్నాడు. ఒక తెలివి గల బ్రహ్మచారి యిలా అన్నాడు. "ఆ బహుమానం కాస్త చూడ నివ్వండి!''

రాజారాం (గంజాం)

"పోనీ, ఒక్కమాట చెప్పెయ్యండి. మీరు మాట్లాడరా?''

"అబ్బే! లే .... లేదండీ! సరోజ .... గారూ!''

సరోజ చిత్రంగా నవ్వింది. శబ్దం విన్పించ కుండా పళ్ళు కన్పించకుండా పెదిమలు విదిల్చి కళ్లతో నవ్వింది.

"చెలువమూ కనుగొనా .... మనసానంద నాట్యాలు సేయునోయీ! ఆనంద నాట్యాలు .... ఆనందనాట్యాలు ... '' గోపాలం హృదయం రెండు పేపులా తనే పాడుకోసాగింది.

"నాదగ్గి రెందుకండీ మీకంత బిడియం?''

గోపాలం సరోజకేసి కొంచెం ధైర్యంగానే చూడగలిగాడు.

"నాదగ్గిర మీకేం సిగ్గు? నేను మీ ప్రేయసినే కదా?'' అనా అర్థం?

అబ్బ! ఆడపిల్లలు ఎంత తెలివైనవాళ్ళు!

"మీ మనస్సంతా విప్పి ఉత్తరమే రాసేశారు. ఇక మాట్లాడటానికేం లేదనుకుంటున్నారా?''

గోపాలం కొంచెం తెల్లబోయాడు కూడా. చుట్టూ కళ్లు తిప్పి చూశాడు. ఎవరూ లేకపోతే మాత్రం ఈపిల్ల ఎందు కింత ధైర్యంగా మాట్లాడుతోంది? — "నేను .... లెటరు రాశాను లెండి.''

"నా జవాబు అందింది కదండీ!''

"ఆఁ అందింది'' — విరామం! ఛ! ఆడపిల్ల ఇంత చనువు యిస్తోంటే తనకేమిటీ పిరికితనం? ఏదైనా మాట్లాడెయ్యాలి. ఫ్రీగా, ధైర్యంగా గబగబా మాట్లాడెయ్యాలి — "మీ రిప్లయి ఎన్ని వందలసార్లు చదివానో తెలీదండీ!'' కాస్త మొహంలోకి చూడబోతే. సరోజ అదోలా నుదురు చిట్లించి — "ఏం? అంత అర్థంకాకుండా ఉందా?''

"ఎబ్బే! అర్థంకాకపోవటం కాదూ! అంత బాగాఉందని ఇరవైమూడుసార్లు చదివాను.''

"ఎన్నివందలసార్లో చదివానన్నా రిప్పుడు'' చిత్రంగా చూసింది సరోజ. నవ్వేయబోయాడు గోపాలం — "వూరికే .... అలా ....'' — ఛ! బొత్తిగా నోటికొచ్చినట్టూ వాగేస్తే కాదు. కాస్త ఒళ్ళు దగ్గిర పెట్టుకుని ..... చెప్పద్దూ!

మీ లెటర్ చూసి నేను చాలా ఆశ్చర్యపోయానండీ! మీ అనురాగం, మీ కవిత్వం, ఆ భాష, శైలీ .... అసలు రిప్లయి యివ్వకుండా ఉండలేకపోయాను'' సరోజ గోపాలం మొహంలోకి సూటిగా చూసింది.

గోపాలం కొంచెం తల దించుకుంటూ — "మీ రిప్లయి చూసి నేను మాత్రం ఎంత ఆశ్చర్య పోయాననీ! మీరంత అందంగా, తియ్యగా లేఖ రాస్తారని అనుకోలేదండీ!'' అన్నాడు.

సరోజ మళ్ళా నవ్వింది — "మరి నమ్మకం లేకుండానే మొదట ప్రేమలేఖలా రాశారు?''

గోపాలం గుండె ఆగిపోయింది — తిరిగి దడదడ కొట్టుకోసాగింది.

"అదే .... అదే .... తొందరపడ్డానేమో అను కుంటున్నాను. మీరు మంచివారు కాబట్టి సరి పోయింది.''

"లేకపోతే ....''

గోపాలానికేం జవాబు వాక్యం దొరకలా.

సరోజే ధైర్యమిచ్చింది — "మీరేం బిడియ పడకండి గోపాల్రావుగారూ!''

చెప్పద్దూ! ఆ సంబోధన ఏమంత రుచించ లేదు గోపాలానికి.

"బిడియపడకండి గోపాల్!''

"మీరేమీ భయపడకండి ప్రి—యా!'' అనా కూడదూ? ప్చ్! ఏమిటో ఆ ఆడపిల్లలు చదువు కుంటూన్న తర్వాత ఎంత తోస్తే అంతేగానీ ఏంచెప్పినా ఎవరు చెప్పినా వినరు.

"నా లేఖ మీకు సరిగ్గా అర్థమైందా? అన్ని విషయాలూ రాశాను కదూ?''

అవునన్నట్టు అటూ యిటూ తల వూయిస్తూ నసిగాడు గోపాలం —

"ఇంకా ఏమో విషయాలు .... కలుసుకున్న ప్పుడు ..... మాట్లాడదాం అని రాసినట్టున్నారు.''

"అవును.'' నవ్వింది సరోజ — "మాట్లా డాలి''. అంతలోనే "హల్లో! కమలా!'' సరోజ చటుక్కున లేచి నిలబడింది — "రా కమలా! మంచి టైమ్‌కే వచ్చావు! వీరే గోపాలరావుగారు! నా స్నేహితులని నీకోసారి చెప్పానుకదూ?'' అంటూ గోపాలాన్ని చూపి "ఈవిడేనండి కమల! నా ముఖ్య స్నేహితురాలు. మీకు లెటర్‌లో రాశాను కదూ?'' అంటూ పరస్పరం పరిచయం చేసింది — నమస్కారా రాల తదనంతరం కమల కూడా ఓ కుర్చీ లాక్కుని కూర్చుంది.

గోపాలం రుమాలుతో చేతులు ఒత్తుకున్నాడు. విశాలమైన అద్దాల భవనంలో బంధించి గాలి

తీసేసినట్టుంది గోపాలం స్థితి ! ఈ కమలెవరో గాని విలన్ పెళ్లాం లాగే ఉంది. కిష్టిగాడికిచ్చి బొత్తిగా ప్రేమలేని పెళ్లి చేసేస్తే సరి—సరో ఏమిటంత చిలిపిగా ప్రవర్తిస్తోంది ? ఎంత స్నేహమైతే మాత్రం—"సారీ ! నాకో ఎంగేజ్ మెంటుంది గోపాల్ తో. రేపుకలుస్తాం. ఎక్స్యూజ్ మీ" అనెయ్యకూడదూ ? ప్చ్ ! ఏమిటో ఈ ఆడ పిల్లల అంతరంగాలే చిత్రం ! అగాధం ! అయో మయం ! అపూర్వం !

"ఏం సరూ ! మీ ఫ్రెండేం మాట్లాడటంలేదు" అంది కమల నవ్వుతూ.

"ఏమిటో ఆయన వచ్చినప్పట్నుంచీ అలా మవునంగానే ఉంటున్నారు."

"అబ్బే ! లేదండీ !" నవ్వేశాడు గోపాలం.

"కొంతమంది భావకవులు ఎప్పుడూ మవునంగా ఏదో ఆలోచించుకొంటూ ఉంటారట. మీరూ అంతేనా ?" కమల.

"నిజం చెప్పండీ ! మీరేమైనా రాస్తుంటారా?" సరోజ.

గోపాలం సిగ్గుతో చితికిపోతూనే జవాబుచెప్పాడు.

"ఆఁ ఏదో—అప్పుడప్పుడూ .... కొద్దిగా ...."

"చూశావా ? నామాట నువ్వు నమ్మావుకాదు" సరోజ కమలకేసి గర్వంగా చూసింది.

"ఏమో మరి. నువ్వూహించ గలిగావ్ గానీ నే నంతదూరం పోలేదులే." గోపాలం ఒళ్లు ఝుళ్లు మంది. స్నేహితురా ళ్లిద్దరూ తన గురించి అప్పు డప్పుడూ వాదించుకొంటూనే ఉంటారన్నమాట! అందులోను సరోజ తనపక్షం !

"అయితే మీ రిప్పుడేం రాస్తున్నారండీ ?"

"ప్రేమ హృదయం అనే టైటిల్ తో ఓ కథ రాయండి ! ప్లీజ్ ! ప్లాట్ కావాలం టే సరూ యిస్తుంది."

గోపాలాని కంతా విచిత్రంగా తోచింది. ఇంద్ర లోకంలో అప్సరసలతో పరాచికా లాడుతున్నట్టే అనిపించింది—మత్తుగా సరోకేసి చూడబోతే సరో సిగ్గుపడ్డట్టు తల తిప్పుకొంది.

"ఒసేవ్ ! సరోజా ! అబ్బాయికి కాఫీ యివ్వ వుటే ?" లోపలినుంచో గావుకేక .... కర్ణానంద రహితంగా .... ఘోరంగా .... దారుణంగా ....

వెధవ కాఫీ ! .... కాఫీ కావాలని ఎవ డేడుస్తు న్నాడు ?

"వస్తాను కూర్చోండీ ! మా బామ్మ పిలు స్తోంది" సరోజ లేచింది.

"వయనమయే ప్రియతమ నను..." అనుకో బోయి—"పోనీ కాఫీ తెస్తుందిలే." అని సరి పెట్టుకున్నాడు గోపాలం. సరోజ వయ్యారంగా నడుచుకొంటూ హంసలా వెళ్లిపోయింది.(గోపాలం కళ్లతో చూడాలని మనవి.

కమల చొరవగా అంది—"గోపాలరావుగారూ! మీకు సరోజం టే ఇష్టమే కదండీ !"

తెల్లబోయాడు గోపాలం. ఎందుకా ప్రశ్న ? భగవాన్ సరోజం టే తనకి యిష్టమా ? ఉత్త యిష్టమా ? ప్రాణం ! దేహం ! రాగం ! తానం !

"పోనీ, మీరు చెప్పనక్కర్లేదులెండి. మీ మన సంతా నాకు అర్థమైంది. సరోజకి కూడా అంతే. మీరం టే చాలా యిష్టం. మీ విషయమంతా నాతో చెప్పింది. మీ లెటర్ ఎంత అపురూపంగా దాచుకుందనుకున్నారు ? నిజంగా మీరు అదృష్ట వంతులండీ !"

గోపాలానికేం మాట పెగల్లేదు—అంతా చిత్రంగా, విచిత్రంగా, మాయంగా — అయో మయంగా ఉంది—"లాహిరి లాహిరి లాహిరిలో ఓహో జగమే వూగెనుగా ...." సరో లేకుండా యుగళగీతం .... లాభంలేదు .... అక్కడితో ఆపు చేసేసింది అంతరంగం.

"మీరు బొత్తిగా మవునం భోంచేస్తున్నా రండీ !" కమల నవ్వింది. కళ్లు పెద్దవి చేశాడు గోపాలం—ఎదురుగా ......

* * *

కలం కింద పెట్టి తల పైకెత్తి ఒక్కసారి బద్ధకం తీర్చుకున్నాను. వెలుగూ, చీకటీ తెలుపు నలుపుల కలనేతచీర పరిచినట్టు వ్యాపిస్తోంది. టైం ఆరు దగ్గిర ! లేచి కుంపటి అంటించి ఎసరు పడేశాను. బియ్యంలో ఓ నాలుగైదు రాళ్ళూ, రెండు మూడు బెడ్డలూ ఏరేసి తృప్తి పడి కడిగి ప్లేటు మూత వేశాను. ఫర్వాలేదు, ఎసరు కాగుతూ ఉంటుంది. రాసుకోవచ్చు.

* * *

"తీసుగో నాయనా ! .... కాఫీ !" బామ్మగారు అత్యంత ఆప్యాయంతో కాఫీ గ్లాసు గోపాలం ఎదురుగా పెట్టి బల్లమీద జేరబడింది. ఆ సంఘటనేం గోపాలానికి నచ్చలేదు. సరో లేని ఆ ఘట్టంలో తనసలు ఏమీ చెయ్యలేకపోతున్నాడు. బండ వేళ్లతో కాఫీ గ్లాసు పట్టుకుని వూడిపోయిన పళ్ల చిగుళ్లు కన్పించేలా నవ్వుతూ—జారిపోతున్న కొంగు సర్దుకొంటూ—"పిచ్చిపిల్ల ! ఈ కాఫీ నీళ్లు తన చేత్తోనే యిచ్చుకోకూడదూ ?" అని స్వగతం చెప్పుకొంటూ వచ్చిన బామ్మగార్ని చూడగానే తొలిచూపులోనే ఏదో అయిష్టం లాంటిది—"లవ్ ఎట్ ఫస్ట్ సైట్" కానిది—అనుమానంలాంటి— భయంలాంటి భావం ఏర్పడి పోయింది గోపాలానికి. రుమాలుతో మొదురుఒత్తు కున్నాడు.

"కాఫీ చల్లారిపోతోంది. తీసుకోండి" కమల హెచ్చరించి బామ్మగార్ని పరిచయం చేసింది—'సరోజ బామ్మగారండీ." అంటూ.

చేసేది లేక "నమస్కారం.... మామ్మగారూ !" అన్నాడు కసిగా.

బామ్మగారు "ఇహి .... హి." అంటూ బోసి నోటితో నవ్వేసి—"నమస్కారాల కేమొచ్చెలే కాని నాయనా ! కొంచెం కాఫీ తీసుకో" అంది ప్రేమగా కాని .... ఆ కాఫీ గ్లాసుకేసి చూడాలని కూడా అని పించలేదు గోపాలానికి. సరో అందిస్తే తప్ప తమ అమృతమైనా త్రాగలేడు—సరో యిస్తే విష మైనా .... చ ! సరో యివ్వదుగా ?

"జవ్వనీ ! నీవు లేని జననమే వృధా !
సుందరీ ! నీవులేని అందమే వృధా !"

'తెనెలూరే భాషలన్నీ తీరుగా వీటిపైన వ్రాతలే కదా ?' "నా మనోహరీ—వినుము నీ ...."

(ఇంకా ఉంది)



IMPORTANT TO MOTHERS

WOODWARD'S CELEBRATED GRIPE WATER

INFANTS' PRESERVATIVE




అతని గిలగిల్లాడే నొప్పులను తొలిగించి కిలకిల్లాడించునది. వుడ్ వార్డ్స్ 'గ్రైప్ వాటర్'! నూరేళ్ల నుంచి, శిశువులు (లక్షలాది) వాయువు, కడుపుబ్బరం, పళ్లు చేయునప్పుడు కలిగే జబ్బులనుండి వరప్రసాదంవంటి నివారణ పొందియున్నారు. వుడ్ వార్డ్స్ ఒక్కటే సమకూర్చగల నివారణ. తర తరాల నుండియు తల్లులు తప్పుదారి త్రొక్కరు!

## వుడ్ వార్డ్స
## 'గ్రైప్ వాటర్'

ప్రపంచమంతట
100 ఏళ్ల నుంచి
వాడబడుచున్నది

అధికారయుత ఏజెంట్లు: హెర్బర్ట్స సన్స లిమిటెడ్., బొంబాయి, కలకత్తా మరియు లక్నో ● టి టి క్రిష్ణమాచారి అండ్ కొ., మద్రాస్ ● ఎమ్.జి. షహాని అండ్ కొ., (ఢిల్లీ) ప్రైవేట్ లిమిటెడ్, ఢిల్లీ.

Aiyars AT. 357-TL.

## RATNAM'S N-OIL
(పై పూతకు మాత్రమే)

అంగనరముల బలహీనత చెంది, చిన్నదై ఎచో తిరిగి యధాప్రకారం అయిపూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10/-లు వి. పి. 1-50. కావలసినవారు ఎడ్రాన్సు పంపేది. ఇందులో స్పెషల్ రకం అర్జంటు గుణమునకు రూ. 25-00లు వి. పి. రూ. 2-00.

**డాక్టర్ రత్నం సన్స్, (Estd 1904)**
మలకపేట బిల్డింగ్, ఆజంపూరా మార్కెట్‌వద్ద,
హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

## ఇంకా పొడుగు ఎదగండి

మా నూతన వ్యాయామాలు, ఆహార నియమాలక్రమం అనుసరించి ఇతోధికమైన ఆరోగ్యం కూడా చేకూర్చుకోండి. స్త్రీ పురుషులు ఉభయులకూ అనుకూలమైనది. వివరములు ఉచితంగా పొందవచ్చును.

283, Azad Market (A.P.M.,)
Delhi-6.

ఇంటికి వచ్చేటప్పుడు
Parry's పారీస్
మిఠాయిలు మరచిపోవద్దు

మీరు రుచి చూచారా?
పారీస్
లాక్టో బాన్ బాన్స్

తయారీ:
పారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

JWT/PRS-2280

నంతా ఆడపెళ్లివారి తరపున 'విడిదిగా' ఇచ్చింది. దీనికి సంప్రదాయాలు పట్టింపులు యేమిటి ? నాకు లోగిలి ఉన్నది జానికమ్మగారూ! అదీ మనదే ననుకోండి పైగా మీరు మేమూ అనేతేడా యెన్నాళ్ళూ'' అన్నదామె.

''సుఖంగా ముహూర్తాలు శీతాకాలంలో పెట్టుకోరెంచేతో ? ఈ మండు టెండాకాలం గాకపోతే'' నంటోందెవరో ఒకావిడ.

''ఇది శ్రావణ మండీ వదినగారూ ? కాని ఈ పాడు ముండావూరు.... దీనికి శీతాకాల మెక్కడతల్లీ ? ఎండకాలం మండుటెండా కాలం అని రెండే కాలా లిక్కడ. కురిస్తే వానా వరదా రెండూను....'' వినసక్ర విరిగిపోయేలా విసురు కుంటూ అన్నది మరో ముత్తయిదువ.

''ఇంకా నయం పోయిన్నెల ఈ వేళకి మావాళ్లింట పెళ్లికి ఈ గూబగాడ్పు ఆ గూబకు కొడుతున్నది'' అన్నది మరోకామె. నీర్సంగా, దూరంగా అరుస్తు న్నట్టు అరుస్తున్నాయి కాకులు కూడా— పెళ్లి పందిట్లో విస్తళ్లువేసి వడ్డనలు ప్రారంభించే సరికి ఎవరికీ మంచి నీళ్లుకంటే అమృత ప్రాయంగా మరో వస్తువు అగుపించలేదు. ఒక చేత విసన క్ర రెండోచేత మంచినీళ్ల గ్లాసూ— అదీవరస.

అయినా రాఘవేంద్రంగారి భార్య సూర్య కళమ్మ, ధనమ్మ, జానికమ్మ అందరూ కూడా పట్టుచీరెలతోనే ఈ తీక్ష్ణత భరిస్తున్నారు. వసంత లేత అరిటాకులా వాడిపోయింది.

''పెళ్లికూతురుట ?! బండముస్తాబులు!— — పిల్ల అందమంతా ఈ ముస్తాబులోనే దాగి పోయింది'' అనుకున్నాడు భాస్కరం.

భాస్కరం అదివరకు నాలుగు పెళ్లిళ్లు చూసి కూడా ఎరుగడు. ఆందోళన హడావుడీ పడతాడేకాని, ఏ పని చెయ్యాలో ఏది చెయ్య నక్కర్లేదో తెలియదు.

మగపెళ్లి వారంతా— అతణ్ని సొంత బంట్రో తులా చూస్తున్నారు.

''ఎమ్మెస్సీ ! చదువుతున్నాట్ట !'' అన్నది ఒకావిడ ఎడంగా.... మరోకామెతో.

''ఐతే మాత్రం— పెళ్లి కూతురు అన్నయ్య కాడా ?— తెమ్మనూ రెండు లైవ్‌జ్యూసు బుడ్లేగా— పైగా మనం మగపెళ్లివారి తరఫున బంధువులమే ! అదీగాక నేను ముకుందరావుని చిన్నతనంనించీ ఎరుగుదును !'' అంటూ రెండో ఆవిడ— ఎడం ఎడంగా వెళ్లిపోతున్న భాస్కరాన్ని ''చూడు బాబూ ! నన్ను ఫలానా వారి కోడ లంటారు— ఈ ముకుందం అంటే పెళ్లి కొడుకు మాకు చాలా ఐనవాడూ....'' అంటూ పిలిచింది

''అమ్మా ! మీకేం కావాలి ?''

''నాకేమీ వద్దులే ! పెళ్లికి వచ్చిన మనకి పట్టు పరుపులెలా వస్తాయి !— జంఖానా చాలు గాని, ఈవిడ ఎడపిల్లకి కాస్త కడుపు నొప్పిగా ఉంది—రెండు లైవ్‌జ్యూస్‌లు తెస్తావ్ ?''

''తప్పకుండాను'' భాస్కరం వినయంగా చెప్పాడు. ''ఒక్క రెండు నిమిషాల్లో తెప్పించు తాను''—

''అలా అనకు— మళ్లీ ఎవరో అయితే అర్ధం టుగా రావు— ఇప్పుడే అది కడుపునొప్పి అని 'కింక' పెడుతున్నది... నువ్వు బాబ్ బాబూ ? కాస్త ప్వయంగాతే !''— అది హుకుమే.

# ప్రేమకు పగ్గాలు

13 వ పేజీ తరువాయి

భాస్కరం ''చిత్తం'' అని లోపల లోపలే గొణుక్కుని బయలుదేరాడు.

* * *

పెళ్లి పందడి బాగా ఇనుమడించింది—భాస్కరం జానికమ్మగారిని చూసి

''పిన్నీ ! నువ్వు ఇంత అలసిపోకూడదమ్మా !'' అన్నాడు— ఆమె నుదుట చెమటలు ముత్యాలై నిలిచాయి. కుంకుమ పాతరూపాయి కాసంత బొట్టు పెట్టుకున్నదేమో ముక్కుమీదకు కారుతున్నది.

అలసిపోయిన కళ్లు, లోతుకు పీక్కుపోయి —భాస్కరానికి ''పిన్ని'' ఈ నాలుగు రోజులూ ఐపోతే ''మంచాన పడదు''కదా అని భయం వేసింది.

''ఒరే ! ఎవరికిరా చెప్తున్నావ్ ?.. నీ మొహం ఒకసారి అద్దంలో చూస్కో.... పెళ్లికూతురై నీ చెల్లెలెంత నీర్స పడిపోయిందో, నువ్వు అంతకు రెట్టింపు పీక్కుపోయి, తోటకూర కాడలా ఎండిపోయావ్ !.... ఇలారా !'' అని ప్రక్కకు పిలిచి కొంగుతో నుదుటి చెమట ఒత్తి వంట ఇంటికేసి తీసి కెళ్లిందామె.... గ్లాసు నిండా పాలు తెచ్చింది.

''నా కెందుకమ్మా ! చెల్లాయ్....''



''తాగు ముందు.... నలుగురూ వస్తే ఏడు స్తారు'' ఆమె పట్టేసినంత బలవంతం చేసింది.

''నువ్వు తాగమ్మా''

''ఛీ ! నోర్ముయ్ ! చాదస్తం.. వూ:. వూ:.... వాళ్లంతా దానిని నే దగ్గర లేపోతే బ్రతకనివ్వరు'' —ఆమె బ్రతిమాలుతూనే తొందర పడ్డది.

భాస్కరానికి పిన్ని తాగలేదని బాధగానూ ఉంది. తనకి త్రాగడానికి సిగ్గుగాను ఉంది.

''ఉహూ నువ్వు త్రాగకపోతే నేతాగను''—

''మంకుతనం !....'' ఆమె ఏమో అనబోయే టంతలోనే ఎవరో ఆమెను

''రావాలి ! రావాలి !జానికమ్మా రావాలి ! అవతల ముహూర్తం గడియలు దాటిపోతున్నాయ్!'' అని కేక వేశారు.

భాస్కరానికి ఆమెను ఇక అల్లరి పెట్టడం ఇష్టంలేక పోయింది. గ్లాసు అతని రెండు చేతుల్లోను పెట్టి ఆమె సంరంభంగా వెళిపోయింది.

గబగబా త్రాగేశాడు పాలు. సగం త్రాగాక— ''మళ్లీ తను కనిపిస్తే బాగుణ్ను.... వెధవను నేనొక్కణ్ణే అర్ధశేరు పాలు త్రాగేయడమే అసలు తను తిండీ, నిద్రా ఇలాంటి వాటి కతీతంగా ఉన్నదే!....ఎలా చెప్మా'' ననుకున్నాడు పిన్ని గురించి మనసంతా అదో రకమైన ఆందోళన పీకింది.

అటూ ఇటూ చూశాడు.

గాడీలు, 'పెద్ద ఫర్నేస్'ల్లా మండుతున్నాయి— వంట బ్రాహ్మలు కళాయిలు గుండిగలు ఎక్కి స్తున్నారు. దింపేస్తున్నారు – చాపలమీద వెళిపే స్తున్నారు.

అంతలో అట్నుంచి పిన్ని తిరిగి తనకోసే వస్తున్నది.

''భాసి ! అక్కడ భాజాలవాళ్లకి మధ్యలోనే కాఫీలు కావాల్సి వచ్చాయిరా ! ఈ వంట బ్రామ్మడు కాఫీపొడుం లేదంటున్నాడు.... కాస్త ఒక రెండు పొనులు తెప్పించు.... బజారుకి పందివారి రావుల్నో పాలూరి వాళ్ల అబ్బాయినో పంపు'' అంటూనే ఆమె కొడుకు చేతిలోని గ్లాసూ అందులో సగం పాలు చూసి విస్తుబోయి అంతలోనే నొచ్చు కుని ఇకవాణ్ని బ్రతిమాల గలోపిక లేదన్నట్లు వూరుకుని, నిట్టూర్చింది.

''ఇదో ! ఇట్టే వస్తా ! ఇంద యిది నువ్వు త్రాగేయ్ ! లేపోతే అంత ఒట్టే !'' భాస్కరం ఆ గ్లాసు ఆమె చేత బట్టి పరిగెత్తాడు.

ఆమెకు ఒళ్లు మండిపోయింది. అంతలోనే మనసు చల్లబడి పోయింది. మండు వేసవిలో పిల్ల తెమ్మెరలా అనుభూతి కలిగి చిన్న నవ్వు విరి సింది పెదాలమీద.

''వాడికి నాభెంగా, నాకు వాడి భెంగా.... అంతేగా'' అనుకుంది. ''ఒట్టు పెట్టుకున్నాడు కూడా ! వెర్రినాగమ్మ !'' అనుకుని మళ్లీ ''అబ్బ ! వీడితో తెలిసీ తెలియని గోల ! ఇదేం మన ఇల్లా ! ఇక్కడ 'అవ్వ' – నేను పాలు త్రాగితే చూసిన వాళ్లేమనుకుంటారూ ? !''

నిజంగా ఆమెకలాంటి సంకటస్థితి భాస్కరం గనుక సరిపోయింది. మరెవ్వరు కల్పించినా సహిం చదు. అటు తిరిగి ఒక వారకువెళ్లి, ఎలాగో ఆ పాలు గొంతులో పోసుకుని— ఆమె తిరిగి పెళ్లి పందిట్లోకి ఆందోళనగా వెళ్లిపోయింది.

ఆమెకు అట్నుంచి సురేఖ మరో అమ్మాయి కూడావస్తూ అగుపించారు. పద్మావతి నామె నెరు గదు. సురేఖను పోల్చుకున్నది. కాని అప్పటి బరువు బాధ్యతల మధ్య ఆమె కే ధ్యాసా ధ్యానమూ పట్టడంలేదు.

* * *

సురేఖ రాకూడదు అనుకుంది— కాని పద్మా వతి నేనొక్కర్తినీ వెళ్లలేనంది – పైగా భాస్కరం ఇద్దరికీ మరీమరీ చెప్పాడు.

అసలు పద్మావతి భాస్కరాన్ని ఆ రోజు చేసిన అవమానానికి క్షమాపణ చెప్పుకోవాలని కూడా వచ్చింది.

సురేఖ మొదట రాకతప్పలేదు. పద్మావతి జయమ్మగారిని ఒప్పించి ఎలాగైతేనేం ఆ ఉద యమే రాగలిగింది.

వస్తూనే సురేఖ ఆప్యాయంగా పద్మావతికి తన గదిలోనే ఉండగల అనుమతి కోసరం ధనమ్మ గారిని ఉబ్బేసి మరీ— ఏర్పాట్లు చేసింది.

పద్మావతికి అంతా భయంగాను కొత్తగాను ఉంది. సురేఖ తప్ప అందరూ కొత్త వాళ్లే— పైగా పుట్టి బుద్ధెరిగిన తర్వాత ఆ అమ్మాయి ఇలా బంధుకోటిలోకి రాగల అవకాశమే కలుగలేదు!

(ఇంకా ఉంది)

మని, ఇంకా ఇతర(త్రా)కూడా, అవకాశాన్ని బట్టి, సౌకర్యాలు కల్గిస్తామని కూడా అన్నారు. కార్పొరేషన్ వారి సిబ్బంది చాలా యెక్కువగానే ఉందని, అయినప్పటికీ, చీటికి మాటికి, ఉద్యోగస్థులు సెలవు తీసుకోవటం వలన కూడా బస్సుల నడకలో తరుచు అంతరాయము వస్తోందని కూడా, రవాణా మంత్రిగారు చెప్పారు. ఈ లోపంయెక్కడుందో పూర్తిగా దర్యాప్తుచేసి, సత్వరం, చర్యలు తీసుకోవలసిన అవసరం యెంతైనా ఉంది. బస్సుల రేట్లు పెంచటం ఖాయమని గగ్గోలు పుట్టిపోయింది. ఈ చల్లని కబురు వినేటప్పటికి, ప్రాణాలు కుదట బడ్డాయి.

అర్. టి. డి. బస్సుల నడక సరిగా లేదని, చీటికి మాటకి విమర్శలు వస్తూనే ఉన్నాయి. వాటికి కారణమేమిటో అధికారులు ఏకరువు పెడుతూనే ఉన్నారు. ఇద్దరి మధ్య సమన్వయం మాత్రం పెంచటంలేదు. ఉదయం పదిగంటల దగ్గర్నుంచి ఉంటుంది తమాషా అంతా ! అదైనా ఓ గంట మాత్రమే ! అందరికీ హడావిడీ ! పాఠశాలలకు, కాలేజీలకు, ఆఫీసులకూ అదే టైము ఇంచుమించు, కొన్ని ఆఫీసులు 10 గంటలకవుతే, మరికొన్ని 10—30 గంటలకు ఉన్నాయి. అంతే తేడా ? కాని 11 గంటలకు మాత్రం ఇంతవరకు ఏ ఆఫీసులూ లేవు. ఇట్లా ఎందుకు ఉండకూడదు. అన్నట్లు, సచివాలయ కార్యాలయాలు 11 గంటలకు అని ఈ మధ్యనే ప్రభుత్వంవారు 'టైమును' సవరించారు. సాయంత్రం 5—30 గంటలదాకా పనిచెయ్యాలి. శీతాకాలపు ప్రొద్దు, సాయంత్రం అయిదున్నరంటే, దీపాలు పెట్టేవేళకు ఇళ్లకు చేరాలి. ఆఫీసు బాదర బందీ వదలిపోయిన తర్వాత, కాస్త షికారుగా ఎటువైపుకు వెళ్లాలన్నా వ్యవధి ఉండదు. అయితే ఉదయం బస్సుల దగ్గర మాత్రం, వత్తిడి కొంచెంగా తగ్గింది. ఇది కాదనలేము. అదనంగా బస్సులు ఏర్పాటు చెయ్యటం చేతకానప్పుడు, టైము మార్చటం లేకుండా ఓ పద్ధతే ? ప్రతి దాంట్లోనూ కూడా కొన్ని సౌలభ్యాలు, కొన్ని చిక్కులు ఉంటూ ఉంటాయి. ఇది తప్పనిసరే మరి ! స్వంత కార్లలో స్వైర విహారం చేసే అల్ప సంఖ్యాకుల్ని మినహాఇస్తే, చాలా మంది, సైకిళ్లమీదో, రిక్షాలమీదో, బస్సులమీదో తప్పనిసరిగా ఆధారపడాల్సిందేగా ? పాఠశాలలకు పిల్లలు ముందుగా వెళ్లాల్సి వస్తోంది. వాళ్లను దిగవిడవటం మళ్లీ ఓ సమస్య తండ్రులు, అక్కడక్కడ తల్లులు కూడానూ ఆఫీసులకు వెళ్ళేముందర, పిల్లల్ని కూడా తమతో పాటే తీసుకు వెళ్లటం అలవాటు పడ్డవాళ్లకు ఈ టైము మార్పులు చికాకును కలిగిస్తాయి. కేవలం సచివాలయ కార్యాలయాల్లోనే ఈ మార్పు తీసుకువచ్చి, ఇతర ఆఫీసుల వేళలు మామూలుగానే ఉంచటం వలన కూడా కొంత ఇబ్బంది కలుగుతుంది. మరి కొంత మేలు కలుగుతుంది. సచివాలయ కార్యాలయాల్లో పనులున్నవాళ్లు, ఇతర ఆఫీసుల్నుంచి అయిదింటికి బయలుదేరి, త్వరగా వచ్చే సావకాశం ఉంది. కాని, ఆఫీసులన్నీ అందుబాటయిన దూరాల్లోనేలేవు. ఇదొక చిక్కు. బస్సుకోసం నిరీక్షిస్తూ కూర్చుంటే

# రాజధాని కబుర్లు

11 వ పేజీ తరువాయి

పుణ్యకాలం దాటిపోతుంది. రిక్షామీద వెళ్దామంటే వ్యక్తి అవసరం, తొందరలబట్టి, రిక్షా కిరాయి ఇట్టే భగ్గున మండిపోతుంది. ఇవన్నీ నిత్యకృత్యం. అందరూ చూస్తున్నవే, అనుభవిస్తున్నవే ! ఈ టైము మార్పువలన కాస్త ఉదయంపూట ఊపిరి పీల్చుకొనటానికి అవకాశం దొరికింది. ఇంట్లో వాళ్లను ఉక్కిరి బిక్కిరి చెయ్యక్కర్లేదు అని కొంతమంది సంతృప్తి వెల్లడిస్తే, సాయంత్రం పూట బొత్తిగా టైము దొరకటంలేదు. చీకటి పడేదాకా ఆఫీసులోనే పడి ఉండాలని అని చీదరించుకునే వాళ్లూ ఉన్నారు. అందర్నీ సంతృప్తి పరచటం ఎవ్వరికైనా కష్టసాధ్యమేగా!

ఐ. ఎల్. ఎన్.★

ఏమిటంటే, అభ్యుదయవాదులు (ఈ మాట కర్థం కమ్యూనిస్టులు, వారి మిత్రులు మాత్రమే) పండిత నెహ్రూను కాపాడగలరని, శ్రీ నెహ్రూ మిత్రులే గాక, శ్రీ నెహ్రూ కూడా నమ్మటమే.

ఏమైతేనేం, మొన్నటి ప్రదర్శన చైనాకు చక్కగా ఉపయోగిస్తుంది. కమ్యూనిస్టుల ప్రదర్శన వెనుక గూడుపుఠానీ ప్రధానమంత్రి గ్రహించారో లేదో ఇంకా తెలియదు. శ్రీ డాంగేకు సంబంధించి

## న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

నంతవరకు — అణ్వస్త్ర వ్యతిరేక ఒప్పందం కీర్తి ప్రధానికి దక్కినట్లుగానే—ఆయనకు కూడా నిర్బంధపు పొదుపు పథకాన్ని సవరింపించిన ఘనత దక్కుతుంది. అసలు ఈ నిర్బంధపు పొదుపులో సవరణలు ఏవైనా కలిగితే దానికి ముఖ్యమైన కారణమయ్యే కామరాజ తీర్మానం మాత్రమే.

దండకారణ్య పథకంమీద వ్యవసాయిక నిపుణుల మండలి సమర్పించిన నివేదిక ఇటీవలే బయటికి వచ్చింది. అందులో ఉన్న కొన్ని ముఖ్య విషయాలివి :

దండకారణ్య పథకం ప్రాంతంలో కొత్తగా వచ్చేవారికి ఇక్కడి వ్యవసాయ స్థితి పెద్దగా ఆశ కలిగించటం కష్టం. కనుక వ్యవసాయాన్ని

పెంపొందించేందుకు శాస్త్రీయమైన పద్ధతులలో కృషి జరపటమే గాక కొత్త రకం పంటలు కూడా ప్రవేశపెట్టాలి.

పొలానికి బలం కలిగించే ఎరువులు వేయటం, పైరు పాడైపోకుండా ఉండేందుకు రెండు రకాల పైర్లు వేయటం, ఆ ప్రాంతంలోనివసించేవారికి పొలాలను వ్యక్తికి ఇంత అని విభజించటం, స్థానికమైన వాతావరణానికి అనుకూలమైన పంటలు వేయటం, బంగాళదుంప, వేరుసెనగ, దోసలు, కాయధాన్యాలలో కొత్త రకాలు ప్రవేశపెట్టటం ఈ ప్రాజెక్టు ప్రాంతంలో అమలు జరపాలసిన కొన్ని పనులు.

ఇక్కడి ప్రాంతం నేలలో ఫాస్ఫేట్ (తెలుగులో భాస్వర లవణాలు అంటారు.)ల కొరత చాలా ఎక్కువగా ఉంది. కొన్ని చోట్ల మాత్రం పొటాష్ తక్కువగా ఉంది. ఇక్కడ నత్రజని (నైట్రోజన్) పాలు మరీ హీనంగానో, మధ్యరకంగానో ఉంది. పంటలు పండించటం ప్రారంభం కాగానే నేల బలం తగ్గిపోతుందని, అనుభవపూర్వకంగా వెల్లడయింది. అందువల్ల, సక్రమ పద్ధతులతో ఎరువులు, రసాయనికమైన ఎరువుల వాడకాన్ని విస్తృతము చెయ్యాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఈ ఎరువులను వస్తురూప ఋణంగా మదుపు పెట్టి వీటిని ఉపయోగించే విధానాన్ని ఈప్రాంత నివాసుల గ్రామాల్లో తెలియపరచాలి.

పనిచేయలేనివారికి, ఇచ్చే అప్పు చాలా తక్కువగా ఉంటోంది. ఈ ప్రాంతంలో రెండేళ్లపాటు ఎరువులు వేయాలంటే కనీసం రు. 210 రూపాయలు అవుతుందని అంచనా. కనుక ఈ మొత్తాన్ని అప్పుగా ఇవ్వాలి. మోసుకెళ్ళటానికి వీలులేని కొండ ప్రాంతాలకు సరుకులను రవాణా చేస్తే అయ్యే డబ్బు సబ్సిడీగా ఎంత ఇస్తున్నారో, ఆ మొత్తాన్ని ఈ దండకారణ్య ప్రాంతానికికూడా అనువర్తింపచేయాలి.

ఈ ప్రాంతం నైసర్గిక స్థితి, సమంగా అన్ని చోట్లా పడని వర్షాలు, కొండ ప్రాంతం కావటం, భూమట్టానికి పైనా క్రిందా కూడా జలసంపద తక్కువగా ఉండటం ఇక్కడ ఉండే వ్యవసాయదారునికి ఆర్థికంగా కలిగే ఇబ్బంది. ఇవన్నీ కలిసి, ఈ ప్రాంతంలో పెద్ద వాణిజ్య కేంద్రాలుగా రూపొందే అవకాశాన్ని తగ్గించివేస్తున్నాయి.

ఈ కారణాల దృష్ట్యా, ప్రభుత్వం ఈవరకే ఏదో రూపంలో నీటి సదుపాయాలు సమకూర్చుకున్న, ఆ ప్రాంత ప్రజలకు ఉద్యానాభివృద్ధి, తోటల పెంపకాల్లాంటి వాటి పట్ల ఉత్సాహాన్ని కలిగించాలి. ఈ నీటి సదుపాయాలతో అల్పకాలికపు పంటలు, కాయగూరలు పండించేట్లు చూడాలి.

వర్షాలు ఈ ప్రాంతంలో అన్ని చోట్లా ఒకే విధంగా పడవు గనుక, వరిపైరును ఆదుకునేందుకు అదనంగా నీటివనరులు కల్పించి, మరీ గడ్డుకాలంలో ఉపన్నప్పుడు రాగి, లాంటి వాణిజ్య పంటలు పండించాలి.

ఇంతవరకు మధ్యరకం నీటి వనరుల మీదనే శ్రద్ధ కన్పిస్తున్నది. ఇప్పుడు ప్రతిపాదనలో ఉన్న ఈ రకం పథకాలు పూర్తికావటానికి చాలా సంవత్సరాలు పట్టటమే కాక, వీటి సత్ఫలితాలు ఈ ప్రాంతంలోని నిర్వాసులకని కేటాయించిన పొలాలకు కాక, తదితరమైన వాటికి దక్కుతాయి. ఇవన్నీ ఇలావుంచి, ఈ పథకం పూర్తయిం తర్వాత నీటి వినియోగానికి సంబంధించిన సమస్యలెన్నో ఏర్పడతాయి.

గాలికి ఒరుసుకుని నిప్పురాజుకుని మంచి విలువగల కలప అంతా తగల బడిపోతున్నది. అలా జరగకుండా అరికట్టాలి. అంతేగాక ఈ ప్రాంతాల్లోని వెదుళ్లను నిర్మాణ సంబంధమైన పనులకు ఉపయోగించాలి.

ఇక్కడి ప్రజల వ్యవసాయ క్షేత్రాలనుంచి పంటలు, సరకులు వివిధ ప్రాంతాలకు తీసుకు వెళ్ళేందుకు తగిన రవాణా సదుపాయాలు, ఏజెన్సీలు ఏర్పరచాలి. వ్యవసాయ డైరెక్టరు ఆధ్వర్యంలో, పూర్వం నిర్ణీతమైన ధరల ఉత్పత్తి, కొనుగోలు, వాటి వినియోగాల బాధ్యత నిర్వహించేందుకు ఒక మార్కెటింగ్ విభాగాన్ని ఏర్పరచాలి. ★

# సరాగమాల

9 వ పేజీ తరువాయి

మధ్య మధ్య వేణు హార్మోణి వాయింపులు ఇవన్నీ ఒక ఎత్తు. "ఈ రేయి నీకై నిలచి పోయిన వేళలో" అన్న ఒక్క వాక్యం ఒక ఎత్తు. పాట వింటుంటే ఊహాకన్య కళ్ల ఎదుటనే నర్తిస్తుంది. కలల రాణి హృదయాన్ని అలరిస్తుంది. స్వప్నసుందరి మనసునే తనవశం చేసుకుంటుంది. ఒకసారి వినండీ పాటను. మరొకసారి వినకుండా ఉండగలరేమో చూడండి.

రెండవ ప్రక్కనున్న 'దీపాలు వెలిగే' కూడ ఇంత చక్కని పాటే, దాశరథి రచనే, పాడింది సుశీలే కాని "అందగాడా" అందము కాదీ పాటది. అది సీతాకోక చిలుక పులకరింపైతే ఇది గండు కోయిల పలకరింపు. అది ప్రేమల చిల్కరింపయితే, ఇది ప్రేయసి వెక్కిరింపు. అది తీయని జోల. ఇది తీరని జ్వాల. రెండు పాటలు అందరూ వినదగ్గవి, రసికులు కొనదగ్గవి.



# అవీ - ఇవీ - అన్నీ

## డా॥ రాజారావు స్మారకనిధి: జమున విజ్ఞప్తి

సెప్టెంబరు 17వ తేదీని మద్రాసు విజయా గార్డెన్సులో డా. గరికిపాటి రాజారావు స్మారక సభ జరిగింది.

సభకు శ్రీ బి. ఎన్. రెడ్డి అధ్యక్షత వహించారు. ప్రారంభంలో కుమారి జమున శ్రీయుతులు అక్కినేని నాగేశ్వరరావును, నాగేంద్రం, బి. ఎన్. రెడ్డిగార్లను వేదికపైకి ఆహ్వానించింది. శ్రీ విస్సన్, కె. గోపాలకృష్ణ సంతాపగేయాలు చదివేరు.

శ్రీ మిక్కిలినేని మాట్లాడుతూ రాజారావు గారి కళాసేవను వివరించారు. ప్రజానాట్య మండలిస్థాపన, దాని పతనానికి దారితీసిన పరిస్థితులు, రాఘవనాటక కళాసమితి స్థాపన గురించి వివరించారు. జమున, దేవిక, నృత్యదర్శకుడు వేణుగోపాల్ మేకప్ కుమార్, వేణూమాధవ్, సంగీత దర్శకులు టి. ఛలపతిరావు, మోహన్‌దాస్ వంటి వారిని ఎందర్నో ఈ చిత్ర రంగానికి పరిచయం రాజారావుగారే చేశారని అన్నారు. శ్రీ నాగయ్య రాజారావు ప్రతిభా సంపత్తులను సంస్మరించారు. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు మాట్లాడుతూ శ్రీ రాజారావుగారే బ్రతికి ఉంటే ఇంకా ఎంతో మంది నటీనటులను, సాంకేతికుల్ని చక్కని శిక్షణతో ఈ పరిశ్రమకు పరిచయం చేసి ఉండే వారు. వారు బ్రతికి ఉండగా ఆయనను సన్మానించుకోలేకపోయినా చనిపోయిన తర్వాత ఆయన కుటుంబానికి సహాయం చేయడంద్వారా మన కర్తవ్యం నిర్వహించుకొన్నట్లవుతుంది అన్నారు.

శ్రీ యన్. టి. రామారావు మాట్లాడుతూ వైజ్ఞానిక దళం ఏర్పాటు, దాని లక్ష్యం, ప్రచారం తీరు విషయంలో శ్రీ రాజారావు ఒక ఆదర్శాన్ని నెలకొల్పారని, అన్నారు. "బొబ్బిలి యుద్ధం చిత్రం షూటింగ్‌లో ఒకే ఒకసారి వారితో తమకు గల పరిచయాన్ని, దానితో ఆయనపట్ల తమకు కలిగిన ఉన్నత మయిన భావాలను వివరించారు.

శ్రీ నాగభూషణం తన బాధను, విచారాన్ని తెలియజేశారు. ఆత్రేయ రచించిన ఒక సంతాప సూచిక గేయాన్ని జగ్గయ్య చదివేరు. శ్రీ పాలగుమ్మి పద్మరాజు, శ్రీ యం. ఆర్. రాధాలు కూడా ప్రసంగించారు.

కుమారి జమున మాట్లాడుతూ "ఇప్పటికి 70 చిత్రాలు వరకు నటించాను. నూరు పూర్తి కాగానే ఈ వేదికపైనే శ్రీ రాజారావుగార్ని సన్మానించుదా మనుకున్నాను. సన్మానానికి బదులు సంతాప సభ జరుగుతున్నందుకు, నా దుర దృష్టాన్ని నిందించుకుంటున్నాను. రాజారావుగారు ఎప్పుడూ, ఎవర్నీ యాచించేవారుకాదు. ఎన్నో సార్లు నేనే డబ్బు పంపేను. కాని తిరిగి పంపించే వారు. చివరకు వారికి, తెలియకుండా అప్పుడప్పుడు ఇంట్లో ఇస్తూ ఉండేదాన్ని. వారికి ఎన్నో ఆశయాలున్నాయి. అందులో డ్రెమెటిక్ స్కూలు స్థాపన ఒకటి, పెద్దలందరి సహాయ సహకారాలుంటే కీర్తిశేషుని ఆశయాల సాధనకై గట్టి ప్రయత్నం చేద్దామని ఉంది." అని అన్నారు.

"కీర్తి శేషుని కుటుంబానికి సహాయంగా నేను రూ 25 వేలు ఇస్తాను." అని ప్రకటించారు.

కళాకారుడుగా, వైద్యుడుగా ప్రజలకు సేవ చేసి ఆదరాభిమానాలు చూరగొన్న కీ. శే. డా. గరికిపాటి రాజారావుగారు స్మారక చిహ్నం ఏర్పాటు గురించి ఆంధ్ర నాటక అకాడమీవారు సత్వర నిర్ణయం చేయాలని వారి కుటుంబానికి ఆర్థికంగా సహాయం చేసేటందుకు ప్రభుత్వం ముందుకు రావాలని కోరుతూ ఏకగ్రీవంగా సభలో తీర్మానించారు. తీర్మానాన్ని శ్రీ యన్. టి. రామారావు చదువగా సభికులు కరతాళ ధ్వనులతో ఆమోదించారు.

చిలకలూరిపేట కళాకారుల సంఘం రూ. 200లు విరాళం పంపినట్లు, శ్రీ రామారావు గారే తెలియజేశారు కుమారి జమున విరాళాలిచ్చిన మరికొందరి పేర్లు చదివేరు. ప్రప్రథమంగా మిక్కిలినేని రూ 200లు విరాళమిచ్చారు. అక్కినేని నాగేశ్వరరావు, గంగాధరరావుగార్లు చెరొక రెండువేలు. డి. ఎల్. నారాయణ, రిపబ్లిక్ సీతారాం, రమణారెడ్డి, పద్మనాభం, వి. కె. ఆర్. జయంతిగార్లు తలో రూ. 1000లు, ఆదుర్తి సుబ్బారావు రూ500లు, అల్లు రామలింగయ్య రూ 200లు వేణుగోపాల్ రూ. 116.

కళాకారుడుగా, వైద్యుడుగా బహుముఖ ప్రశంసలందుకొని హఠాత్తుగా కన్నుమూసిన రాజారావుగారిపట్ల తమ తీవ్ర విచారం ప్రకటిస్తూ కుమారి జమున ఈ క్రిందివిధంగా విజ్ఞప్తి చేసిరి.

"రాజారావుగారి స్మారక నిధి వసూలుకు ఏర్పాటయిన సంఘానికి నన్ను కన్వీనరుగానూ, శ్రీ ఎన్. టి. రామారావుగారిని కోశాధికారిగాను ఎన్నుకున్నారు. కనుక వ్యక్తులు, సంస్థలు, శ్రీ రాజారావుగారి స్మారకనిధి పేర నాటకాలు వేసి, విరాళాలు వసూలుచేసి వాటిని కోశాధికారి పేర 63 ఎ. బజుల్లారోడ్డు, టి. నగర్, మద్రాసు—17, చిరునామాకు పంపవలసిందిగా కోరుతున్నాను."

## శ్రీ పద్మాలయా "మూగనమ్మకాలు"

బి. సరోజాదేవి కథానాయకిగా నటించిన శ్రీ పద్మాలయావారి "మూగనమ్మకాలు" చిత్రం సెన్సారు అయింది. త్వరలో విడుదల కానున్న చిత్రాలలో ఇదొకటి. మాటలు, పాటలు : రాజశ్రీ కూర్పు : రామదాసు, దర్శకుడు : శ్రీనివాసన్. నిర్మాత, సంగీతదర్శకుడు : ఎం. ఎస్. శ్రీరామ్,



"గురువునుమించిన శిష్యుడు"లో ఒక దృశ్యం.

## "గుడిగంటలు"

రాజ్యలక్ష్మి ప్రొడక్షన్సువారి సాంఘిక చిత్రం వాహినీ స్టూడియోలో తయారవుతోంది. ఈ చిత్రం 1964 సంక్రాంతికి విశాలాంధ్రంతటా

# ఋతుక్రమం ఆలస్యమైతే?

విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన "దేవిపిల్సు" వాడండి!

పూర్తికోర్సుప్యాకెట్టు 28 మాత్రలు వెల రు.11/- సగంకోర్సు ప్యాకెట్టు 14 మాత్రలు వెల రు. 6/- ... ప్రతిచోటు దొరకును

"దేవి పిల్సు" ముఖ్యంగా ఆలస్యమైన, క్రమముగాకాక పోయిన, బాధతో కూడిన, లేక ఆగిపోయిన బహిష్టుకు దేవిపిల్సు బాగుగ గుణమిచ్చును

1 అన్ని సందర్భములలోను శీఘ్రముగాను, అమోఘముగాను పనిచేయును. 2 ... ఆరోగ్యమునకు ఎట్టిహాని కలిగింపదు

MANUFACTURERS SEENU & CO., MADRAS-21 | Selling Agents DEVI AGENCIES. MADRAS-21

స్టాకిస్టులు: మెస్సర్స్. డి. జె. పరీక్ & కం. సుభాష్‌రోడ్, సికిందరాబాద్.

---

# నాకాస్

వేటినుండి ఉబ్బసపు వ్యాధితో బాధపడ నవసరం లేదు ఈ వ్యాధి నిర్మూలనకుగాను 30 సం॥ల పరిశోధనా ఫలితంగా లభ్యపరచుకొనబడి, పరమహంస క్రియలగు మూలికలతో తయారైన ఆయుర్వేద ఔషధం. ఎంత మొండి వ్యాధికైనను తక్షణమే బాధ నివారింపజేయుటయేగాక కొంతకాలము సేవించిన తిరిగి చూపెట్టదు.

8 ఔ. రు. 3-75. పోస్టేజి ప్రత్యేకం.

ఇండియన్ మెడిసన్ హౌస్, విజయవాడ-2

---

# జమ్మివారి లివర్‌క్యూర్

## పిల్లల లివర్, స్ప్లీన్ వ్యాధులకు

సలహాలు యిచ్చుటకు నెలవారి మకాములు

| స్థలము | తేదీ | వేళలు | అడ్రసు |
|---|---|---|---|
| నెల్లూరు | 6 | ఉ. 9 నుండి 12<br>మ. 3 నుండి 5 | అజంత హోటల్, ట్రంక్ రోడ్. |
| సికిందరాబాద్ | 8 | ఉ. 9 నుండి 12 | తాజ్ మహల్ హోటల్. సరోజిని దేవి రోడ్. |
| హైదరాబాద్ | 9 | ఉ. 9 నుండి 12 | న్యూ తాజ్ మహల్ హోటల్, రెసిడెన్సీ రోడ్. |
| తెనాలి | 12 | ఉ. 9 నుండి 11 | కన్యకాపరమేశ్వరీ సత్రం. |
| చీరాల | 13 | సా. 3 నుండి 5 | రాజ్ మహల్‌లాడ్జి, రైల్వేస్టేషన్ దగ్గర. |
| గుంటూరు | 14 | ఉ. 9 నుండి 12 | ది మెడికల్ స్టోర్సు, కొత్తపేట. |
| మచిలీపట్నం | 16 | ఉ.10నుండి 12 | ఆనంద ఫార్మసీ, మెయిన్‌రోడ్, |
| రాజమండ్రి | 19 | సా. 3 నుండి 6 | ఈశ్వరదాస్‌రత్నం పెసి, ఇన్నీస్‌పేట |
| కాకినాడ | 20 | ఉ. 9నుండి 11 | వి. ఎల్. మూర్తి & సన్, మార్కెట్ రోడ్ |
| మదనపల్లి | 28 | ఉ. 9నుండి 11 | బృందావన్ లాడ్జి. |
| చిత్తూరు | 30 | ఉ. 9 నుండి11 | ఓరియంటల్ లాడ్జి, హైరోడ్. |
| తిరుపతి | 30 | సా. 3 నుండి 5 | డాక్టర్ ఆర్. గోపీనాధ్, 28, గంగుండ్రా మంటపం వీధి. |
| ఖర్గపూర్ | 4 | ఉ. 9 నుండి 11<br>సా. 3 నుండి 5 | మెసర్సు యునైటెడ్ మెడికల్ స్టోర్స్, ఎన్‌టి.ఇ.155, రైల్వే మార్కెట్. |
| జంషెడ్‌పూర్ | 15 | ఉ. 9 నుండి 11<br>సా. 3 నుండి 5 | మెసర్సు సిటీ కెమిస్టుసు, సాక్షి. |

## జమ్మి వెంకటరమణయ్య & సన్సు,

17/283, హిందీ వీధి, గాంధీనగర్ పోస్టు, విజయవాడ-3.

బ్రాంచి: ఓరుగంటివారి వీధి, విజయనగరం.

*గమనిక:* అన్ని రోజులలో ఎప్పటివలె మా క్లినిక్ వద్ద సంప్రదించవచ్చును

---

# ORIGINAL RaceK REGD

హై పవర్ లాంతరులు

350 కాండిల్ పవరు ఈ రంగంలో దీనికి ఒక దానికి

IS:1384 ISI

సైజు: 2

స్టాండర్డ్ మార్కు ఉన్నది

రాసెక్ ఇండస్ట్రీస్ ప్రయివేట్ లి.,

శ్రీజి భవన్ లోహార్ స్ట్రీట్, బొంబాయి-2.

డిస్ట్రిబ్యూటర్లు

ఎఫ్. రాసెక్ & కం.

ప్రయివేట్ లిమిటెడ్

బొంబాయి-2 కలకత్తా-1 మద్రాసు-1

పో. బా. నెం. 2006 పో. బా. నెం. 2121 పో. బా. నెం. 1248

---

# తగ్గింపు ధరలకు అమ్మకం

ఆకర్షణీయమైన రంగులలో మిక్కిలి అందమైన చేనేత చీరలు. ఒక్కొక్కటి ధర రు. 7/50. 2 చీరలు రు. 14. 3 చీరలు రు. 20. పోస్టేజి, ప్యాకింగు ఉచితం.

ఉత్తమ రకం చీరలు 1కి రు. 14, 2 చీరలు రు. 25/- 3 చీరలు రు. 37/- పోస్టేజి, ప్యాకింగ్ ఉచితం.

బహుమతులు - 2 చీరలు కొనువారికి ఒక జత ఇయర్ టాప్స్. 3 చీరలు కొనువారికి ఒక బ్లవ్స్, ఒక జత ఇయర్‌టాప్స్, కొద్ది స్టాకుగలదు. మీ ఆర్డరును వెంటనే పంపండి. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి. చీరలు నచ్చని యెడల సరియైన పరిస్థితిలో తిరిగి పంపిన ఖరీదు వాపసు చేయబడును

THE ROYAL STORES (APM6)
Post Box No. 1774. Delhi 6.

విడుదల చేయాలని నిర్మాతలు అనుకుంటున్నట్లు తెలుస్తుంది.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, జగ్గయ్య, నాగయ్య, రేలంగి, రమణారెడ్డి, కృష్ణకుమారి. గిరిజ, వాసంతి, శాంతకుమారి మొదలగువారున్నారు.

ఈ చిత్రానికి మాటలు: ముళ్లపూడి వెంకట రమణ, ఛాయ: సి. నాగేశ్వరరావు, సంగీతం: ఘంటసాల, దర్శకుడు వి. మధుసూదనరావు, నిర్మాతలు: సుందరలాల్ నహతా, అండ్ డూండీ.

## అరుణాచల ప్రొడక్షన్సు

అరుణాచల ప్రొడక్షన్సువారి తెలుగు సాంఘిక చిత్రం ఇప్పటికి 4 రీళ్లు పూర్తి అయింది.

కొసరాజు వ్రాసిన "ఒక్కమాట నిన్ను నేను అడగనా," అనే పాట సుశీల—మరికొంత బృందంతో పాడగా రికార్డు చేయబడింది.

ఈ పాటను దేవిక, మరికొంతమంది చెలులతో పల్లె వాతావరణంలో పచ్చని పొలాల్లో ఈమధ్య చిత్రీకరించారు.

మాటలు: పినిసెట్టి, సంగీతం: టి. చలపతిరావు. ఛాయ: జె. వి. సత్యనారాయణ, నృత్యం: రాజకుమార్ స్టూడియో: అరుణాచలం, అసోసియేట్ దర్శకుడు: గౌతమ్, కథ, నిర్మాత, దర్శకుడు: పి. కె. వేలన్.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, దేవిక రమణారెడ్డి, పద్మనాభం, హేమలత, రమాదేవి, అర అరుణశ్రీ, సీతారాం, వై వి. రాజా మొదలగువారు నటిస్తున్నారు.

## అమరశిల్పి జక్కన

పల్లె వాతావరణం గ్రామస్థులంతా ఆనందోత్సాహాలతో నృత్యం జరుగుతుంది. జక్కన వస్తాడు.

"ఆగండి! నా మాట వినండి"

"............................"

"మగవాళ్ల బాధ లన్నిటికీ ఆడవాళ్లే కారణం. ఆడవాళ్ల అందం మొగవాళ్లకు బంధం. అంతా పై వేషం—మోసం. స్త్రీలను నమ్మి మీ జీవితాల్ని నాశనం చేసుకోకండి. వారిని చేరనివ్వకండి. చెడిపోకండి. నా మాట నమ్మండి. వెళ్లండి. వెళ్లండి."

"పిచ్చోడురా ఆడ పిచ్చోడు. వదలి పెడితే అపాయం. చెట్టుకు కట్టేయండి."

రామానుజాచార్యులు, ఆ మార్గంలోనే వస్తూ ఆ దృశ్యాన్ని చూస్తారు.

"ఏమిటి నాయనా ఈ ఘోరం. ఇతడ్ని విముక్తి చేయండి."

విడుదల చేస్తారు.

"నీ వెవరు నాయనా? ఎందుకీ దండన?"

"సత్యం పలికిన ఫలితం స్వామీ. తమ ఉపకారం నే నెన్నటికీ మరచిపోను. సెలవు."

"నీ ప్రయాణం ఎక్కడికి?"

"ఏమో స్వామీ. దిక్కులేని వాడ్ని. నే నెక్కడ కని చెప్పను స్వామి"

## "దేశ ద్రోహులు"

శ్రీ రామా పిక్చర్స్‌వారు "దేశ ద్రోహులు" చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈమధ్య వాహినీ స్టూడియోలో రెండు పాటలను రికార్డు చేశారు. ఆ రెండు పాటలు కూడా మల్లాది రామకృష్ణశాస్త్రిగారు వ్రాసినవే.

## అవీ - ఇవీ - అన్నీ

1. దయా శాలులారా—సహాయమ్ముకారా....
భరించాలి మీరు—ఫలించాలి మేము"

ఈ పై పాటను శ్రీ ఘంటసాల, వసంత బృందం పాడగా, రికార్డు చేయబడింది. యన్. టి. రామారావు, మరికొంతమంది అనాధ బాలురతో చిత్రీకరిస్తారు.

2. "కన్నూ కన్నూ సోకె—ఖరారేనులే!......
ఈ చిన్నదాని పేరే—హుషారేనులే"

ఈ పై పాటను జానకి—మాధవపెద్ది సత్యం పిఠాపురం రికార్డు చేయబడింది.

నాటకాల కంపెనీ దివాలా తీయగా బాధపడుతున్న ఒక నాటకాలరాయుడు (రేలంగి) పత్రికలో అబద్ధాలయ్యగారి (రమణారెడ్డి) గారి అమ్మాయి (గిరిజ)కు నాట్యం నేర్పడానికి మాష్టర్ కావలసిందిగా ప్రకటన చూస్తాడు. అప్లికేషన్ పెట్టుకుంటాడు. అబద్ధాలయ్య సరేనంటాడు. నాటకాలరాయుడు భరతనాట్యం గురువై నాట్యంనేర్పిస్తాడు. ఈ సన్నివేశం పై పాట రేలంగి, గిరిజలతో చిత్రీకరిస్తారు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, దేవిక, జానకి, రేలంగి, గిరిజ, రమణారెడ్డి, కాంతారావు, రాజనాల, శోభన్‌బాబు, రామకృష్ణ, సత్యనారాయణ, మిక్కిలినేని, మల్లాది, బాలకృష్ణ, జెమినీ చంద్ర



"ఆజ్ ఔర్ కల్"లో ఒక దృశ్యం.

మొదలగువారు నటిస్తున్నారు.

## "పద్మశ్రీ" షూటింగ్

పద్మశ్రీ వారు తమ తాజా చిత్రాన్ని ఈనెల 1 వ తేదీనుండి హైదరాబాద్‌లో షూటింగ్ ప్రారంభించారు. ఈనెల 11 నుండి కలకత్తాలో నాగేశ్వరరావు, హరనాథ్ లతో అవుట్‌డోర్ షూటింగ్ జరిపించారు. హౌరా బ్రిడ్జిపై కూడా షూటింగ్ జరిపిస్తారు. అవుట్‌డోర్ షూటింగ్‌కు సంబంధించిన సెట్టు కూడ కలకత్తాలోనే ఒక స్టూడియోలో సెట్టువేసి పూర్తి చేస్తారు.

ఈ చిత్రం దర్శకుడు: పి. పుల్లయ్య, నిర్మాత: వెంకటేశ్వర్లు.

# అవీ-ఇవీ-అన్నీ

## చందమామా ఫిలింస్

చందమామ ఫిలింస్‌వారి ప్రొడక్షన్ నెం. 5 ఈనెల 15 వ తేదీని వీనస్ స్టూడియోలో ప్రారంభించారు.

ఈచిత్రం "ఆత్మాశ—ఫలితాలు—పరిశోధనలు" గా కథా వస్తు ఉంటుంది.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, గుమ్మడి' కాంతారావు, రాజనాల, రమణారెడ్డి, సి. యస్. ఆర్. సత్యనారాయణ, ధూళిపాళ, జమున, సూర్యకాంతం, శారద, జయంతి, రాజశ్రీ మొదలగువారు ఉన్నారు.

కథ: కె. వి. ఆర్. ఆచార్య, మాటలు, పాటలు: ఆత్రేయ, ఛాయ: రహెమాన్ అండ్ ప్రసాద్, సంగీతం: యస్. రాజేశ్వరరావు, కళ: గొడగాంకర్, స్టూడియో: వీనస్, దర్శకత్వం: పి. సుబ్రహ్మణ్యం, నిర్మాత: డి. ఎల్. నారాయణ.

సి. ధర్మారావు.

## పునర్జన్మ

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి "పునర్జన్మ" చిత్రం తాలూకు వెండితెర నవల శ్రీమద్దిపట్ల సూరి కూర్చినది మా కార్యాలయం చేరినది. వెల: రూపాయి ముద్రణ గెటప్ ముచ్చటగా వున్నాయి.





భారతదేశంలో కాక ఇతరత్రా ఉన్న ఒకేఒక జత తెల్లపులులు ఇప్పుడు బ్రిస్టల్ జంతు ప్రదర్శన శాలలో ఉన్నవి. ఆడపులి పేరు చమేలీ; మగపులి పేరు చంపా. ఇవి ఇంతవరకూ రీవా మహారాజావద్ద ఉండేవి. బ్రిస్టల్ జంతు ప్రదర్శన శాలలో ఈ రెండు తెల్లపులుల వయస్సు 16 నెలలు—వాషింగ్టన్ జంతు ప్రదర్శనశాలలో మరో తెల్లపులి ఉన్నది—ఢిల్లీ జంతు ప్రదర్శన శాలలో మరో జంట ఉన్నది. మిగతా తెల్లపులులు ఇప్పుడు కూడా రీవాలోనే ఉన్నవి. పై రెండు పులులను ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ బోయింగ్ విమానంలో బ్రిస్టల్ చేర్చారు. (బి. ఐ. ఎస్.)




**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Chief Editor S. Sambhu Prasad.**



వర్ధమాన నటి దేవిక (ఫోటో: రూప)

